# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Thursday, 16th August, 1956**

The House met in the Assembly Hall, Kurnool at half past eight of the clock, Mr Speaker (The Hon Sri R Lakshminarasimham Dora) in the Chair

## I QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS

*Construction of a Surplus weir to Raju Tank of Vijayaramapuram of Srikakulam district*

93

*28 Q SRI M SATYANARAYANA RAJU —Will the Hon the Minister for Revenue be pleased to state

When the work of constructing a surplus weir (Kalingamu) to Raju Tank in Vijayaramapuram, hamlet of Pappala Lingalavalasa Bobbili taluk, will be taken up?

THE HON SRI K CHANDRAMOULI —There is no proposal at present to construct a surplus weir to the Raju Tank of Vijaya ramapuram hamlet of Pappala Lingalavalsa, Bobbili taluk, Srikakulam district

SRI S VEMAYYA — Vijayaramapuram లో రాజుచెరువుకు surplus weir కట్టవలసిన అవసరమున్నదని ప్రభుత్వదృష్టికి వచ్చిందా ? అక్కడ రైతులు ఎంతకాలమునుంచి యిబ్బంది పడుతున్నారో చెబుతారా ?

THE HON SRI K CHANDRAMOULI — ఇంతవరకు ప్రభుత్వం యొక్క దృష్టికిరాలేదు కాని అక్కడ మరమ్మతులు చేయాలనిమాత్రమువచ్చింది ఇంతవరకు రు 1, 373/- లు ఖర్చుచేసి petty repairs చేశారు

*National Extension Service Blocks in Gudur taluk*

94

* 116 Q SRI P GOPALAKRISHNA REDDI —Will the Hon the Minister for Planning and Industries be pleased to state

Whether there is any proposal to start National Extension Service Blocks in Gudur taluk (Nellore district) in the year 1956 57 ?

THE HON SRI K VENKATA RAO —There is no proposal at present to start National Extension Service Blocks in Gudur taluk The matter will be considered when further allotment of blocks is made by the Community Projects Administration

ప్రస్తుతము గూడూరులో జాతీయ విస్తరణ ప్రణాళిక నిర్వహణకు ఆలోచన ఉన్నది కాని యికముందు కొత్తగా పెట్టబోయే blocks పెట్టేటప్పుడు ఆసంగతి ఆలోచించబడుతుంది

SRI B SANKARAIAH — ఈవిధముగా వెనుకబడిన గూడూరు తాలూకా మాదిరి తాలూకాలు ముందు take up చేయకుండా Delta areas ను ఎందుకు తీసుకుంటున్నారు ? అయితే దానికి ఏదైనా పద్ధతి ఉన్నదా ?

THE HON SRI K VENKATA RAO — పద్ధతి అనేది ఏమీలేదు కేంద్రప్రభుత్వమువారే కొన్నిషరతులుపెట్టి చేయిస్తున్నారు అసలు మొట్టమొదటి బ్లాకే ఎక్కడ మొదలుపెట్టారోకూడా నాకు తెలియదు కాని మొదలుపెట్టిన blocks మాత్రము contiguous గా పెట్టితీరాలి అని ఉన్నది అందుచేత అది తూర్పుననో పడమటనో ఉత్తరముననో దక్షిణముననో ఎటో అటు పెట్టక తప్పదు అందుచే గూడూరుకుగూడ chance వస్తుంది రాబోయే మూడుసంవత్సరములలో దేశములో అన్నిచోట్లలోనూ అన్ని blocks కూడ వస్తాయి కాబట్టి దీనికి ఆట్టే అంత పోటీపడవలసిన అవసరములేదు

SRI R B RAMAKRISHNA RAJU —ఈ contiguity సిద్ధాంతాన్ని ప్రభుత్వం తప్పకుండా అనుసరిస్తుందా ?

THE HON SRI K VENKATA RAO — పూర్తిగా అనుసరిస్తున్నారు ఇదివరకు నేనుచెప్పిన ఒక్క విషయములోతప్ప ఆరంభించిన మొత్తము 57 బ్లాకులలోనూ contiguity ని దృష్టిలో పెట్టుకునే పని జరిగింది అంటే Basic Agriculture Schools పెట్టేచోట్ల blocks ఉండవలసిన అవసరము ఉన్నది గనుక యిందులో ఏవి contiguous గా లేకపోయినా వాటికి ఒక block ను తగిలించవలసిన ఆస్కారము ఏర్పడుతున్నది

SRI R B RAMAKRISHNA RAJU —Contiguous గా వుండే చోటులో Basic Education Centres ఉండేటప్పుడు వాటికి preference యిస్తారా ?

THE HON SRI K VENKATA RAO —అసలు యిదివరకు మేము అనుకున్న Basic Agriculture Schools పెట్టినచోట్లు అన్నింటిలో blocks ను పెట్టి

వేశాము ఇంకను కొత్త Schools ఏవైనా పెట్టేటట్లయితే ఆ విషయము తప్పకుండా ఆలోచించి యిస్తాము

SRI D VENKATARAMANA REDDI —1956 57 వ సంవత్సరములో Darsi తాలూకాలో N E S Blocks పెట్టే ఏర్పాటు ఏమైనా ఉన్నదా ?

THE HON SRI K VENKATA RAO —ఒక్క block ను గురించి అడిగితే కాదు రేపు రాబోయే సెప్టెంబరు నెలలో 20 బ్లాకులు శాంక్షను చేయటానికి Government of India నుంచి ఆర్డరు వచ్చింది 26 వ తేదీన జరగబోయే Cabinet meeting లో యీ విషయము ఆలోచించబడుతుంది ప్లానింగు మంత్రి ఒక్కడే యీ విషయములో చేయగలిగింది యేమీ లేదు అందరు మంత్రులు కూర్చుని ఏ విధంగా చేస్తే బాగా ఉంటుందో పరిశీలించి నిర్ణయముచేసిన తరువాత ఆ నిర్ణయము ప్రకారము ఆ 20 బ్లాకులుకూడా వస్తాయి మరల డిసెంబరు నెలలో యింకా 20 లేక 24 వస్తాయి ఈ విధముగా ఆరేసి నెలల కొకసారి దేశమంతటా అన్నీ cemplete చేయాలని ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది

SRI M NAGI REDDI — Contiguous అనే పద్ధతి పెట్టడంవల్ల యీ వచ్చే అవకాశము ఒకే తాలూకానుంచి ప్రారంభించబడుతున్నది అందువల్ల అయిదు సంవత్సరములకైనా కొన్ని తాలూకాలకుగూడ రానటువంటి పరిస్థితులు ఉంటాయి అందువల్ల ప్రతితాలూకాకు ఒక్కొక్క బ్లాకు పెట్టే ఆలోచన ఆలోచించుతున్నట్లుగా తెలుస్తున్నది అది నిజమేనా ? అలా కాకపోతే contiguous అనే పద్ధతిఅయినా ప్రభుత్వం అనుసరిస్తుందా ?

THE HON SRI K VENKATA RAO — నా భావమేగనుక చెల్లనట్లయితే, నాగిరెడ్డిగారు అనుకున్నదికూడ నిజమే అయ్యేది కాని Government of India వారు నా అభిప్రాయన్ని అంగీకరించడములేదు

SRI N SREENIVASA RAO — 'Contiguous' అని ప్రభుత్వంవారె అంటున్నారు అయితే భీమడోలు బ్లాకునుంచి ఎడమవైపున చూస్తే అది మెరక ప్రాంతాలకు పోయింది కుడివైపునచూస్తే పల్లపు ప్రాంతాలకు పోయింది మరల గణపవరంనుంచి ఉత్తరవైపున చూస్తే మెరక ప్రాంతము దక్షిణము వైపున చూస్తే పల్లపుప్రాంతము కనబడుతున్నది అందుచేత సాధ్యమైనంత మటుకు పల్లపుప్రాంతాలకున్నూ, fertile ప్రాంతాలకున్నూ ప్రభుత్వము యొక్క చూపు అటు మెరకప్రాంతాలవైపుకు మరలించుతురా ?

THE HON SRI K VENKATA RAO — అన్ని బ్లాకులు మెరక ప్రాంతాలలో పెట్టినట్లయితే Geography లో నుంచి పల్లపు ప్రాంతాలన్నింటిని తీసివేయవలసిందే మెరక ప్రాంతాల ప్రతినిధులుగా శ్రీనివాసరావుగారు కాని యితరులు కాని అన్ని బ్లాకులు మెరక ప్రాంతాలలోనే పెట్టాలని కోరేటట్లయితే యిక యీ ప్రణాళిక ముందుకురాదు

SRI RAJA SAGI SURYANARAYANA RAJU —క్రొత్తగా re present చేసేటటువంటి blocks వరసగా యిదివరకు ఉన్న బ్లాకులలో చేరుస్తారా? లేకపోతే క్రొత్తబ్లాకులు ఏమైనా ఏర్పాటు చేస్తారా ?

THE HON SRI K VENKATA RAO — ఇప్పుడు పెట్టబోయే టటువంటి బ్లాకులు తూర్పుకో పడమరకో ఉత్తరముకో దక్షిణముకో ఎటో అటు పెట్టుతాము

SRI K BRAHMANANDA REDDI —శ్రీనివాసరావుగారి ప్రశ్నకు మంత్రిగారికి కోపము వచ్చినట్లున్నది శ్రీనివాసరావుగారి ప్రశ్న యేమిటంటే మెరకప్రాంతాలకే యివ్వాలి మాగాణి ప్రాంతాలకు యివ్వకూడదు అని కాదు మాగాణి ప్రాంతాలకు కూడా యివ్వవలసినదే అయినప్పటికినీ మెట్ట ప్రాంతాలకు గూడ ప్రాముఖ్యత యివ్వమనే ఆ విధంగా చేస్తారా ?

THE HON SRI K VENKATA RAO —బ్రహ్మానందరెడ్డిగారిని ఒక పర్యాయము మ్యాపు చూడవలసిందిగా కోరుతున్నాను ఇప్పటికి ఉన్న 57 బ్లాకులలోనూ 50 బ్లాకులు మెట్టప్రాంతాలలోనే ఉన్నవి తక్కిన 7 బ్లాకులున్నూ పల్లపు ప్రాంతాలలో ఉన్నవి

SRI P SREERAMULU —N E S Blocks select చేసేవిషయంలో వెనుకబడిన ప్రాంతాలు, ముందుకువెళ్లిన ప్రాంతాలు, అనే విచక్షణ లేకుండా, మెరక ప్రాంతాల బ్లాకులతోబాటు అన్ని వసతులు ఉన్నచోట్లలో కూడా ప్రాముఖ్యత యిస్తూ బ్లాకులను select చేయవలసిందిగా కేంద్రప్రభుత్వము యీ ప్రభుత్వానికి ఆదేశించినట్లుగా తెలుస్తున్నది అది నిజమేనా ?

THE HON SRI K VENKATA RAO —అలాంటి ఆర్డర్సు ఏవీ రాలేదు శ్రీరాములుగారి గ్రామములో బ్లాకులు కావాలంటే పల్లపు ప్రాంతాలకు కూడ ఆర్డర్సు పుట్టుతున్నవి

SRI G NARSIMHA MURTHY — అధ్యక్షా, ప్రభుత్వానికి అప్పు కావలసివచ్చినప్పుడు, ఆ అప్పులో అధికభాగము యిచ్చేవి పల్లపు ప్రాంతాలే

గనుక పల్లపు ప్రాంతాలవారిని మెరక ప్రాంతాలవారు తృప్తిపరిస్తే ప్రభుత్వం యింకా ఎక్కువ సహకారము పొందగలుగుతారు అనే దృష్టితో పల్లపు ప్రాంత లవారికి కూడ అవకాశము యిస్తారా ?

THE HON SRI K VENKATA RAO —పల్లపు ప్రాంతాలవారికి ముందు అవకాశము ప్రభుత్వము యివ్వదు కాని అవకాశము తరువాతనైనా యిస్తుంది ఈపర్యాయము East Godavari District లో బ్లాకులువస్తే ముందు నరసింహమూర్తిగారి constituency లో మాత్రం రావడం లేదు

SRI S VEMAYYA — గూడూరుతాలూకా మెట్టతాలూకా అయినందు వల్ల ఆ ప్రాంతానికి అనుకునివున్న పడమరవైపుకుగాని దక్షిణవైపుకుగాని extend చేస్తున్నారు ఇక్కడ ఉన్న మెట్టప్రాంతాలన్నీ వదలివేసి మాగాణీ ప్రాంతాలకు extend చేశారు కాబట్టి గూడూరుకంటె దర్శికి extend చేయటానికి ప్రభుత్వం వెంటనే తగినచర్య తీసుకుంటుందా ?

THE HON SRI K VENKATA RAO — Individual గా యిక్కడ ఎసెంబ్లీలో ప్రశ్నలువేస్తే నేను చెప్పలేను ధర్మము ఎట్లాఉంటుందో అలాచేస్తాను గూడూరుకంటె దర్శితాలూకా యింకా మంచిదేమో అదికూడ ఆలోచించాలి గూడూరు తాలూకాకంటె దర్శితాలూకా మెట్టతాలూకాయె

SRI N K LINGAM — అధ్యక్షా ఈ బ్లాకులుఅన్నీ ఏర్పాటుచేసే సందర్భములో ప్రభుత్వం ఏపద్ధతి అవలంబిస్తున్నది ? ఎవరిని అడిగి చేస్తున్నారు ? ఈ కార్యక్రమమంతా ఎట్లా జరుగుతున్నదో చెబుతారా ?

THE HON SRI K VENKATA RAO — రాష్ట్రములో ప్రభుత్వ పరిపాలనలో యీ కార్యక్రమమంతా ఏవిధంగా జరుగుతున్నదని గౌరవసభ్యులు లింగంగారు అడుగుతున్నారు లింగంగారిని అడిగి ప్రభుత్వ కార్యక్రమాలు నడిపే పరిస్థితి ఇంకారాలేదు గౌరవసభ్యులకు శాసనసభలో ఉండే హక్కులు సాగించుకో వచ్చునేకాని లింగంగారినే అడిగి పరిపాలించవలసిన పరిస్థితి సాంప్రదాయాలలో లేదు అందులో కర్నూలువారు యీ ప్రశ్నవేయడం ఆశ్చర్యంగా ఉన్నది ఆంధ్రరాష్ట్రములోఉన్న అన్ని జిల్లాలలోకంటే కర్నూలు జిల్లాలోనే ఎక్కువ బ్లాకులు ఉన్నవి కాబట్టి ఎక్కువగా లాభము పొందుతున్న కర్నూలు జిల్లా వారైన లింగంగారే యీవిధంగా ప్రశ్న వేయడం, ఆరోపణ చేయడం మర్యాదైన విషయంగా కనబడలేదు

*Transfer of the Senior Deputy Inspector of Schools, Gannavaram*

91

*154 Q SRI V VISWESWARA RAO —Will the Hon the Chief Minister be pleased to state

(a) whether the Government received any representation from the Teachers in Krishna district requesting the Government to transfer the Gannavaram Senior Deputy Inspector of Schools, and

(b) if so, the action taken thereon ?

THE HON Dr B GOPALA REDDI —

(a) The answer is in the affirmative

(b) The allegations made were found to be baseless, and no action was considered necessary against the Senior Deputy Inspector of Schools

*House sites for Harijans of Ponugupadu, Sathenapalli taluk*

95

*95 Q SRI VAVILALA GOPALAKRISHNAYYA —Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) whether any applications for house sites from the Harijans of Ponugupadu, Sathenapalli taluk were received by the Government, and

(b) if so, the action taken thereon ?

THE HON SRI G LATCHANNA —

(a) The answer is in the affirmative

(b) The Harijans of Ponugupadu Village have not come to a definite conclusion regarding the site required for providing house sites to them As there are no sufficient funds available to meet the cost of acquisition in fresh cases for provision of house sites, the matter has been deferred for the present

(a) అవునండి

(b) పొనుగుపాడు గ్రామస్థులు మొదట దరఖాస్తుచేసిన 303వ సర్వే నంబరుగల భూమిని అక్కరలేదని ప్రస్తుతము వారికిఉన్న 514 129 నెంబర్ల తాలూకు భూమిలోనే చోటు యిప్పించమనిన్ని తరువాత అది వసతిగా లేనందు వల్ల దానిమీదట 512, 513 నెంబర్లుగల భూమిని కలెక్టరుగారు సూచిస్తే అదికూడ అక్కరలేదని నిరాకరించడమువల్ల ప్రస్తుతమునకు విచారణ ఆపు చేయడ మైనది

SRI VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా అసలు యీస్థలము విషయములో అదా ఇదా అనే వాదనకాకుండా ప్రస్తుతము ప్రభుత్వానికి funds లేవుగనుక విచారణ ఆపుజేశామని అన్నారు తరువాత funds యిచ్చామని అంటున్నారు పోనీ funds యిచ్చేదానిలోనైనా priority యిస్తారా?

THE HON SRI G LATCHANNA — ఇలాంటి ప్రశ్న యిటీవలనే వచ్చింది అసలు మొట్టమొదట యీ proposals ను గురించిన చరిత్ర తమకు యిదివరకే మనవిచేశాను Funds యిచ్చేవిషయములో యిటీవలనే ఆరులకలు యివ్వడం అయింది Dposits పుచ్చుకున్నవారి proposal విషయములో first priority awards sanction చేసినవాటివిషయములో second priority, awards stage లో ఉన్నవాటివిషయములో third prority యీమాదిరిగా వాటిని అమలు పరచవలసిందని ప్రభుత్వం ఉత్తరువులు జారీచేసింది

*Sharing of the tax on account of composite licences for stage carriages*

96

* 43 Q SRI S VEMAYYA —Will the Hon the Minister for Co-operation and Commercial Taxes be pleased to state the amount of share of the proceeds of tax on account of composite lincences due to this State for the Stage Carriages for the year ending 31st March 1956 on the Inter-State routes lying partly in our State and partly in Madras State ?

THE HON SRI D SANJIVAYYA —The system of composite licences in regard to stage carriages plying on inter State routes lying between Madras and Andhra has come into effect only from 1 10 55 Particulars of this State's approximate share of the proceeds during the period from 1 10 55 to 31 3 56 are furnished below

| | |
|---|---|
| Under Madras Motor Vehicles Taxation Act, 1931 | Rs 1,04,966-12 6 |
| Under Madras Motor Vehicles (Taxation of Passengers and Goods) Act, 1952, | Rs 30,590 2-6 |

SRI S VEMAYYA — ఈ లైసెన్సువల్ల వచ్చేడబ్బుఎక్కువ భాగాన్ని రోడ్లు అధ్వాన్నముగా ఉన్నవి కాబట్టి జిల్లాబోర్డులకు ఇవ్వడానికి ప్రభుత్వం ఏమైనా ఆలోచిస్తుందా ?

THE HON SRI D. SANJIVAYYA — అటువంటిది ఏమీలేదండి general funds లోనుంచి కొంత రోడ్లకు ప్రత్యేకిస్తుంది.

*Road between Puttagunta and Gannavaram*

97

*160 Q SRI V VISWESWARA RAO —Will be Hon the Minister for Local Administration and Prohibition be pleased to state

(a) Whether it is a fact that the formation of road between Puttagunta and Gannavaram was stopped after forming a few miles

(b) whether the allotted money is still remaining unspent with the District Board and

(c) if so what action the Government propose to take to finish the road work immediately?

THE HON SRI A B NAGESWARA RAO –

(a) and (b)

The answer is in the affirmative

(c) The District Board Krishna is taking action to acquire the lands in which the road was formed

SRI M NAGI REDDI— ఇప్పటివరకు చేసినట్టి రోడ్డు ఎప్పుడు ప్రారంభించారు? ఎప్పుడు పూర్తిఅగుతుంది ఇంకా ఎంతరోడ్డు వెయ్యవలసిఉంది ఎంతఖర్చుఅగుతుంది?

THE HON SRI A B NAGESWARA RAO — 55 వేలు sanction చేసినారు తరువాత 20–12–55 న 10 వేలు sanction చేశారు మొత్తం 600 మిగిలింది సుమారు 2½ మైళ్ళరోడ్డు మిగిలిఉంది దానికి ఇదివరకు వేసినరోడ్డుకు కొంత acquire చెయ్యవలసిఉంది దానికోసము 4700 ప్రత్యేకించబడింది తిరిగి 1955–56 సంవత్సరం బడ్జెటులో 286 వేలు sanction చేసినారు దానిలో నుంచి జిల్లా బోర్డు స్పెషలు ఆఫీసరు ఖర్చుపెట్టుకొనవచ్చును ఇంకా ఏమైనా కావలసివస్తే గవర్నమెంటు తిరిగి ఆలోచిస్తుంది

*Abolition of the Matriculation Examinations*

99

*230 Q SRI M NAGI REDDI —Will the Hon the Chief Minister be pleased to state whether it is a fact that the Government are contemplating to abolish the Matriculation Examinations?

THE HON Dr B GOPALA REDDI —It is a matter for the University to consider

SRI PILLALAMARRI VENKATESWARLU —దానిమీద ప్రభుత్వ అభిప్రాయం ఏమిటో తెలియచేస్తారా?

16th August 1956]

THE HON DR B GOPALA REDDI — ఈ suggesitons అన్నీ University వారు చేశారు

Matriculation examinations should be restricted to girl students and other students outside Andhra State and also to fix a minimum age limit of 18 years and requested the Andhra University to consider the suggestion

The Andhra University has stated that at its meeting on 8 3 1956 it has resolved that the Matriculation examinations as at present be continued without any change

*Starting of Heavy Industries in the State*

101

* 22ℓ Q SRI M NAGI REDDI — Will the Hon the Minister for Planning and Industries be pleased to state

(a) whether the Central Government sent any definite proposals to this Government for starting heavy industries in this State and

(b) if so what are those industries?

THE HON SRI K VENKATA RAO —

(a) No Sir,

(b) Does not arise

(ఎ) లేదండి

(బి) జనించదండి

*Amending the Co operative Societies Act*

102

* 237 Q SRI P SATYANARAYANA —Will the Hon the Minister for Co operation and Commercial Taxes be pleased to state whether the Government propose to so amend the Co operative Societies Act as to provide for an appeal to the general body against the decision of the Directors in regard to admission of new members into a Co operative Society?

THE HON SRI D SANJIVAYYA —The Government are considering the question of amending the Madras Co operative Societies Act, 1932, wherever necessary

SRI S VEMAYYA —ఈ కో-ఆపరేటివు చట్టాన్ని సవరించాలని చాలా కాలముగా ప్రభుత్వానికి ప్రజలు ఆందోళనపూర్వకముగా చెప్పుకుంటున్నారు కొన్నిమాసాలలో మార్చడానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

THE HON SRI D SANJIVAYYA — All India Rural Credit Survey Committee కూడా చెప్పినారు గవర్నమెంటు ఆఫ్ ఇండియా amend ments suggest చెయ్యడానికి ఒక కమిటీని వేసినారు ఇవన్నీ చూసుకొని సమగ్రంగా చేదామని ఆలోచిస్తున్నాము

SRI P VENKATASUBBAYYA — All India Rural Credit Survey రిపోర్టులో సూచించిన సలహాలన్నీ amendments లో పొందుపరుస్తారా ?

THE HON SRI D SANJIVAYYA —అదే గవర్నమెంటు యొక్క ఉద్దేశ్యము

SRI VAVILALA GOPALAKRISHNAYYA —గవర్నమెంటు ఏదో Ad Hoc కమిటీని వేసినట్లున్నది అది ఏమీ చెయ్యలేదా ? Co operative Banks Act మార్చే విషయములో కూడా ఆలోచిస్తున్నారా ? వారిని సంప్రతించి త్వరలో మార్పులు తీసుకొనివస్తారా ?

THE HON SRI D SANJIVAYYA — Ad Hoc Committee ఏమీ చెయ్యలేదు ఇండియా గవర్నమెంటువారు వేసినారు

SRI B SANKARAIAH — ఒకప్రాంతములో ఉన్నట్టివారు కొద్ది మందిచేరి సొసైటీ స్థాపించి డైరెక్టర్లను వేసుకొని ఇతరులను రానీయకుండా చేసినపుడు కనీసం అందరినీ చేర్చుకొనడానికి వీలుగా చట్టం సవరించుతారా ?

THE HON SRI D SANJIVAYYA — ఆ విషయంలో త్వరగా చర్య తీసుకోవాలని మా ఉద్దేశ్యము చేర్చుకొనడానికి నిరాకరించినా, ఉన్న వారిని తొలగించినా రిజిస్ట్రారుకు అప్పీలు పెట్టుకొనడానికి అవకాశం కల్పించాలి అనేది examine చేస్తున్నాము

SRI PILLALAMARRI VENKATESWARLU — సొసైటీల ఎన్నికలలో చాలా అన్యాయములు జరుగుచున్నవి ఇప్పుడు ఉన్నవారే అధికారం నిలబెట్టుకొనడానికి ఎక్కువ అవకాశములు చట్టములో ఉన్నవి అవిలేకుండా ఎన్నికలు సక్రమముగా జరిగేటట్లు చూస్తారా ?

THE HON SRI D SANJIVAYYA — అలాగేనండి

SRI L LAKSHMANA DAS — ఈ ఆక్టును మార్పుచేసేముందు దానిని సమగ్రంగా పరిశీలించడానికి ప్రభుత్వం ఒక కమిటీని వెయ్యడానికి ప్రయత్నిస్తుందా ?

16th August 1956]

THE HON SRI D SANJIVAYYA — మొట్టమొదట Registrar అన్నిచూచి amendments suggest చేస్తే తరువాత Co operative Advisory Council ముందు పెడతాం ఆ తరువాత వీలైతే ఏమైనాచూస్తాం

SRI N SRINIVASA RAO — సొసైటీల ఆక్టు సవరణ కాని కారణం చేత Labour Cooperative Societies చాలా కష్టపడుతున్నవి కనీసము అవి త్వరగా రిజస్టరౌనట్లు సహాయం చేస్తారా ?

THE HON SRI D SANJIVAYYA — అలాంటిది ఏమీ చెయ్యడానికి వీలులేదండి ఏదైనా చట్టము సవరిస్తే అన్ని సొసైటీలకు అన్వయిస్తుంది

*Educational concessions to the dependents of ex servicemen*

103

* 249 Q SRI PILLALAMARRI VENKATESWARLU —Will the Hon the Chief Minister be pleased to state

(a) whether the Government propose to reduce the concessions that are made avilable to the dependents of ex servicemen in regard to education and

(b) if so the concessions that are made available till now and the concessions the Government propose to reduce ?

THE HON Dr B GOPALA REDDI —

(a) The answer is in affirmative

(b) The concessions that were available till now are the following

(i) Exemption from tuition and special fees (Medical, Library and Laboratory) in all grades of educational institutions, elementary, secondary and collegiate (arts and professional)

(ii) An allowance for the purchase of books,

(iii) Exemption from the payment of examination fees from the S S L C Public Examination and other public examinations conducted under the authority of the Government

(iv) Payment of hostel charges upto a maximum of Rs 40/ per mensem per pupil

The concessions that will be discontinued with effect from the academic year 1956 57 are the following —

(i) No new pupils will be granted concessions towards payment of tuition or examination fees or purchase of text books or boarding or hostel charges,

(ii) From the academic year 1956 57, the concessions will be given only to direct dependants of ex servicemen i e, their children only All concessions hitherto granted to other dependants such as brothers and sisters of ex servicemen will be withdrawn

(iii) All concessions now given for post graduate courses of studies will be withdrawn

(iv) No concessions will be given for students in Primary or Middle stages, i e from standard I to standard VIII or Form III inclusive

(v) From the academic year 1956 57, the renewal of concessions will be confined to the completion of a particular stage in the school or college for this purpose there will be a high school stage comprising Form IV to VI, intermediate stage comprising the Junior and Senior Intermediate classes and the degree stage comprising B A, B A (Hons), B Sc, B Sc (Hons) B Com B E, M B B S, B Sc, (Agrl) B V Sc, courses The concessions will lapse after a student has completed the High School or Intermediate stage or any other stage specified above

SRI PILLALAMARRI VENKATESWARLU — ఇప్పుడు చాలా పెద్దసమాధానం ఇచ్చారు ఇదివాయి దావే స్తే బాగుంటుంది ఈStatementనుTable మీద పెట్టేఉంటే బాగాఉండేది I request you to take it up on the next day

THE HON Dr B GOPALA REDDI — ఇది గవర్నమెంటుకు సంబంధించినదికాదు Expenditure అంతా గవర్నమెంటు భరించుతారు Post war Services Reconstruction Fund Committee ఒకటి ఉంది దానికి మన గవర్నరుగారు Chairman లచ్చన్నగారు కొంతమంది non officials మిలిటరీ వారితరఫున కొందరు ఉన్నారు వారివద్దనుండి ఆ డబ్బు recoup చేస్తుంది ప్రభుత్వం దానికి మొదట 20 లక్షలు ఉండింది కొన్ని concessions ఇచ్చారు ఇంకా ఇస్తే 2 3 సంవత్సరములలో అయిపోతుందనే ఉద్దేశముతో మొన్నవారు సమావేశములో 'భరించలేము 10 సంవత్సరములకు పెట్టుకొనవలెనని concessions withdraw చెయ్యవలెనని' సఫార్సుచేసినారు ఇది గవర్నమెంటుకు సంబంధించినది కాదు ఇచ్చినా ఆ fund లోనుంచే ఇచ్చుకోవాలి కొద్దిమందికిఇస్తే 10 సంవత్సరాలవరకు fund ఉంటుంది

SRI PILLALAMARRI VENKATESWARLU — ఆ fund recoupe చేసే అవకాశం లేదా ?

THE HON Dr B GOPALA REDDI — మళ్లీ యుద్ధం వస్తే అప్పుడు మళ్లీ ఏదైనా చేసుకుందాము

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Note చాలా పెద్దదిగా ఉంది వేరే ఇవ్వస్తారా ?

(No Answer)

SRI S VEMAYYA — Ex Servicemen కు వేరే hostels ఉన్నవా ? అవి function చేస్తున్నవా ?

THE HON Dr B GOPALA REDDI —విద్యార్థులు ఎక్కడైనా hostels లో ఉండేవారికి రు 40/ కు మించకుండా ఇవ్వడానికి నిశ్చయించుకున్నారు ఇది గవర్నమెంటు డబ్బుకాదు గవర్నమెంటుకు ప్రత్యక్షముగా సంబంధంలేదు

Mr SPEAKER — It is limited to those 20 lakhs of rupees

SRI A KALESWARA RAO — Ex Servicemen కు ఇంత యిస్తున్నామంటున్నారు నిజమే వాండ్లు యుద్ధాలుచేశారు మనము యుద్ధాలు వద్దన్నప్పటికి కూడా వాండ్లువెళ్ళి ఆగవర్నమెంటుకు సహాయంచేసి మనలను అణచడములో కూడా ప్రయత్నంచేశారు అట్టి వాండ్ల కందరికీ సహాయం చేస్తున్నాము మన స్వాతంత్ర్యముకోసము పోట్లాడినవారి కుటుంబాల విషయంలో వారిపిల్లలకు scholarships యివ్వడానికి గవర్నమెంటు fund start చేసో స్వంతంగానో ఏదైనా యిస్తారుఅని అడుగుతున్నారు

THE HON Dr B GOPALA REDDI — ఒక వేళ (శ్రీ) వెంకటేశ్వరులు వగైరాలు వద్దన్నాకూడా రాజకీయ బాధితులకు వేరేరకంగా ఏదైనా సదుపాయాలు చేయాలనిచెప్పి నిశ్చయించాము ఆ scheme అమలులో వున్నది ఇది త్వరలోనే పూర్తి అవుతుందనికూడా ఆశిస్తున్నాను ఇక Education concessions విషయంలో ఏదైనా rare cases వుంటేతప్ప మామూలుగా వారికి యివ్వడములేదు Ex Servicemen కు ఒక fund వుండేది ఆ fund ను వేరే దేనికైనా ఖర్చుపెట్టడానికి వీలులేదు బ్రిటిష్‌వాండ్ల హయాంనుంచి వచ్చింది ఆ fund ప్రభుత్వము ఒక time లో వాండ్లకు హామీయిచ్చి మీరు యుద్ధంలో చేరండి ఒక వేళ యుద్ధంలో ఏదైనా జరిగినప్పటికీ కూడా మీ కుటుంబాలను మీ బిడ్డలను మేము సంరక్షిస్తామని చెప్పినతర్వాత దీనిని కొంతవరకు నెరవేర్చడమే మంచిదేమోనని అనుకుంటాను లేకుంటే రేపుప్రొద్దున మళ్లీ అవసర మొచ్చినపుడు మనము recruit చేయడానికి ప్రయత్నిస్తే అపుడేమంటారు వాండ్లు? మీరుచేసిన వాగ్దానాలన్ని మరచిపోయినా' రంటారు ఇపుడుకూడా అటులే అవుతుందేమోఅనే భీతికూడా కల్గుతుందనే భయంతో కొన్నికొన్ని concessions యివ్వడానికికూడా ప్రభుత్వంవారు ప్రయత్నం చేస్తున్నారు

[16th August 1956

SRI PILLALAMARRI VENKATESWARLU — అధ్యక్షా ఈ Ex servicemen కుటుంబాలకు యిచ్చేటపుడు దీనితోబాటు స్వతంత్ర పోరాటంలో పాల్గొన్నవారికికూడా డబ్బులేక పేదరికంతో బాధపడే కుటుంబాలకు కొంచెము ప్రత్యేకమైన fund ఏర్పాటుచేసి యీలాంటి concessions యివ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

Mr SPEAKER — That is not the question Confine yourself to Ex servicemen

THE HON SRI K VENKATA RAO — అదంతా అక్కరలేకుండానే ఆయన చెప్పారు Deserving cases లో మరీ బాధగావున్నచోట యిస్తామని చెప్పారు మద్దూరి అన్నపూర్ణయ్యగారి కొడుకుకు గవర్నమెంటు యిచ్చారు

SRI P VENKATASUBBAYYA — ముఖ్యమంత్రి గారు జవాబు చెప్పుతూ అలాంటి hostels మన State లో లేవన్నారు కడప Town లో Hostel for the children of Ex service personnel అని ఒకటి ఉంది ఒక్కొక్కవ్యక్తికి 40 రూపాయలు యిస్తున్నారు ఇటీవల 15 రూపాయలకు పరిమితము చేయబడిందని తెలుస్తుంది అది ఒక్కటే hostel కనుక 40 రూపాయల వరకూ యిచ్చేటట్లు ఏర్పాటుచేస్తారా ?

THE HON Dr B GOPALA REDDI — I am thankful to the Hon Member for the information given అక్కడ ఒక Hostel వున్నదని చెప్పినందుకు సంతోషిస్తాను 40 రూపాయలవరకు యిస్తే ఆ fund 2 సంవత్సరాలలో ఐపోతుంది వాండ్లే మొన్న Vizag లో meeting పెట్టుకొని ఆ fund ను 10 సంవత్సరాలైనా వుంచుకొని కొద్దిమందికి సహాయం చేస్తామనే ఉద్దేశంతో వాండ్లు అన్నివిషయాలు ఆలోచించి నిర్ణయముచేశారు ఏదైనావుంటే మీరు వారికి వ్రాయండి తప్పకుండా మళ్లీ ఆలోచిస్తారు

SRI P KODANDARAMAYYA —అధ్యక్షా మద్దూరి అన్నపూర్ణయ్యగారి కుమారునితోకూడా బండరాముని కుమారునికి యివ్వడానికి ఆలోచిస్తారా ?

THE HON Dr B GOPALA REDDI — బండ రాముడు కూడా యుద్ధానికి పోయివుంటే ఆలోచిస్తాము

SRI PILLALAMARRI VENKATESWARLU — ఇపుడు యీ concessions ఆధారంగా చేసుకొని ప్రస్తుతము విద్యాసంస్థలలో చదువుతున్నవారికి ఏవిధమైన ఇబ్బందిలేకుండా చేస్తారా ?

THE HON Dr B GOPALA REDDI — ఇబ్బంది లేకుండా వుండడానికే మేము ప్రయత్నంచేస్తున్నాము మొదట 3 కోట్ల రూపాయలువుండినవి మద్రాస్‌లో Sri Archibald Nye గవర్నర్ గా వున్నపుడు వచ్చింది మన ఆంధ్రరాష్ట్రం separate అయినపుడు మనకు 20 లక్షలు వచ్చింది మన భాగము క్రింద ఆ 20 లక్షలలోకూడా యీ 2-3 సంవత్సరాలలో కొంత ఐపోయింది ఆ మాదిరిగా ఐపోతే ఇంక 2 3 సంవత్సరాలలో ఏమీలేకుండా ఖాళీ ఐపోతుంది దానిని నిలబెట్టుకొని మరీ అవసరమైన విద్యార్థులకు చదువుచెప్పించడానికి పరిమితము చేసి సహాయంచేయడానికి పూనుకుంటారు replenish చేయడంలేదు కాబట్టి ఇది exhaust ఐపోతుంది

*Abolition of Language Tests in Tamil, Kanarese etc , for Government Servants*

105

* 267 Q SRI T G THIMMAIAH SETTY — Will the Hon the Chief Minister be pleased to state whether the Government propose to abolish the Language Tests in Tamil, Kanarese, etc wherever they are prescribed for Government servants for purposes of promotions etc , in view of the formation of the linguistic State of Andhra Pradesh ?

THE HON Dr B GOPALA REDDI —"No Sir "

SRI PILLALAMARRI VENKATESWARULU —Why sir ?

THE HON Dr B GOPALA REDDI —For obvious reasons

SRI PILLALAMARRI VENKATESWARLU —What are the reasons

THE HON Dr B GOPALA REDDI —మనచుట్టూవున్న సరిహద్దులలో యీ language minorities వాండ్లు కొంతమందివున్నారు Tamil వున్నది కన్నడవున్నది ఒరియావున్నది అందువల్ల మన Province లో కూడా కొంత కాలము Second Language Test వుంటే మంచిదని ప్రభుత్వంవారు అనుకున్నారు

## STARRED QUESTIONS

*Boravancha Jagir in Nuzvid Taluk, Krishna District*

146

* 399 Q SRI VAVILALA GOPALAKRISHNAYYA —Will the Hon the Minister for Revenue be pleased to state

(a) when the Boravancha Jagir in Nuzvid Taluk Krishna District abolished by the Hyderabad Government under the provisions of the Hyderabad Jagir Abolition Regulations 1949, and transferred to the Andhra Government was converted into a ryotwari village ,

(b) are the Government aware that the Jagirdars have collected the assessment for five faslis namely 1359 to 1363 even after the abolition

(c) if so, what was the amount so collected, and

(d) has any compensation been paid to the Jagirdars by the Andhra Government?

THE HON SRI K CHANDRAMOULI —

(a) Boravancha Jagir was converted into a ryotwari village on 28 9 49 when the Hyderabad Government took it over under the provisions of the Hyderabad (Abolition of Jagirs) Regulation, 1949 The village was thus already a ryotwari village when it was transferred to the Madras State (now Andhra State) on 25 1 50 under the provisions of the India and the Hyderabad (Exchange of Enclaves) order 1950

(b) No collection of assessment for the faslis 1359 to 1363 has been made by the Ex Jagirdars

(c) Does not arise

(d) The answer is in the negative

SRI VAVILALA GOPALAKRISHNAYYA —అధ్యక్షా Collectors వాండ్లకు నోటీసులు యివ్వడము నోటీసులు withdraw చేసుకోవడము జరిగిందని చెప్పు దానిలో రాష్ట్ర అధికారులకు సంబంధించిన చుట్టాలు కూడా వున్నందున కలెక్టర్ వాండ్ల బంధువులు ఐనందువల్ల ఆ వసూలుచేసినవి బయట పెట్టకుండా వుండడము మీకు తెలుసునా ?

THE HON SRI K CHANDRAMOULI —రహస్యంగా — దొంగతనంగా చేస్తున్నారేమో కాని public గా ఏమీ జరుగదు హైదరాబాద్ గవర్నమెంటునుంచి మాకేమి reports లేవు

SRI VAVILALA GOPALAKRISHNAYYA — క్రిందటి సంవత్సరంవరకూ వాండ్లు వసూలు చేశారు రశీదులు కూడా యిచ్చారు రైతాంగము కలెక్టర్‌కు petition పెట్టుకొన్నారు మేము విచారణ చేస్తామన్నారు ఇంతవరకు విచారణ చేయలేదు ఇక్కడ గవర్నమెంటు అసెస్మెంటు జరుపుతున్నారు అక్కడేమో వాండ్లు వసూలు చేస్తున్నారు దానివిషయమై ఏమైనా చర్య తీసుకుంటారా ?

THE HON SRI K CHANDRAMOULI — అటువంటి రశీదులు ఏవైనావుంటే పంపితే నేను విచారణ చేస్తాము

*Development of Silk Industry*

147

*224 Q SRI M NAGI REDDI —Will the Hon. the Minister for Planning and Industries be pleased to state

(a) the amount of grant allocated by the Technical Development Committee of the Central Silk Board for the Development of Silk Industry in this State, and

(b) how that amount will be spent?

THE HON SRI K VENKATA RAO —

(a) Rs $10\frac{1}{2}$ lakhs

(b) The amount will be spent for

| | |
|---|---|
| (1) Development of Sericulture (Plains & Agencies) | Rs 5 00 lakhs |
| (2) Development of Ericulture (Plains) | Rs 0 5 lakhs |
| (3) Development of Tassar Culture (Agency area) | Rs 5 00 lakhs |
| | 10 50 lakhs |

*Improvement of minor ports*

148

*394 Q SRI P VENKATASUBBAYYA
SRI M NAGI REDDI —Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) whether it is a fact that the Government of India have allotted a sum of Rs 28 1 lakhs for the improvement of minor ports during the Second Plan period, and

(b) if so, what are the ports that are going to be improved and whether estimates were prepared for such ports?

THE HON SRI G LATCHANNA —

(a) the answer is in the affirmative

(b) The following are the minor ports that are going to be improved

(1) Kakinada
(2) Masulipatnam
(3) Krishnapatnam
(4) Narsapur
(5) Bheemunipatnam
(6) Calingapatnam

Two estimates in respect of Kakinada port have been received and sanctioned In respected of other ports estimates have been called for and they are awaited from the State Port Officer

SRI S VEMAYYA — కాకినాడకు estimates వచ్చినవన్నారు అది ఎంత estimate చేసినారు? మిగతా వాటికి approximate estimates వున్నాయా? లోగడ కందరేరు విషయంలో ఎంతవరకు అభివృద్ధివచ్చిందో తెలుసుకోవచ్చునా?

THE HON SRI G LATCHANNA — కంగలేరు రేవుకే కృష్ణపట్టణమనిపేరు కందలేరురేవుకు కృష్ణపట్టణమని ప్రభుత్వం declare చేసి ఒక G O pass చేసింది ప్రభుత్వం దానికి ౩0 లక్షలు విలువగల estimates చేసి 1955 October లో ఢిల్లీప్రభుత్వానికి పంపడము ఢిల్లీప్రభుత్వము officer నవంబర్ లోవచ్చి వాటినన్నిటిని పరిశీలించడము పరిశీలించి మనకు ఇపుడు వారు 28 లక్షల 10 వేల రూపాయలు sanction చేసినారు దానిప్రకారంగా ఇపుడు estimates తయారౌతున్నాయి

SRI VAVILALA GOPALAKRISHNAYYA — వాడ్రేవు కొత్త పట్టణముల సంగతి గవర్నమెంటు కేమైనా అర్జీలు వచ్చినాయాఅండి ? దాని విషయమై ఏమి ఆలోచించారు ?

THF HON SRI G LATCHANNA — వాడ్రేవుకు గురించి పరిశీలించడము గవర్నర్ గారుకూడా చూడడమూ నేనుకూడా ఒకసారి అక్కడకు వెళ్లడము దాని వివరాలన్నీ సేకరించి ఇటీవల ఢిల్లీ వెళ్లినపుడు దానియొక్క ఆవశ్యకతను గురించి ప్రభుత్వానికి నచ్చచెప్పడము జరిగింది త్వరలోనే అనుకూలమైన అభిప్రాయం ఢిల్లీ ప్రభుత్వంనుంచి వస్తుందని ప్రభుత్వము ఆశిస్తున్నది

SRI K APPA RAO — బందర్ రేవు ఇసుకబారు తీసివేయడమూ ఇంకా ఏవిధమైన అభివృద్ధి చేయదలచుకున్నారో చెప్పుతారా ?

THE HON SRI G LATCHANNA — ప్రస్తుతము file లో వివరాలు లేవు కాని నాకు తెలిసినంతవరకూ ఆ Channel ను వెడల్పు చేయడానికి ఒక డ్రెడ్జర్ ను ఏర్పాటుచేయడానికి warf కు రాతి కట్టడం ఏర్పాటుచేయడానికి ఇపుడు estimates తయారౌతున్నాయి

SRI N VENKAIAH — పూర్వం ప్రసిద్ధమైన ఒడరేవు కొత్త పట్టణం అనే పేరుతో ఉంది ఆ పేరు ఇప్పుడు కందలేరు రేవుకు పెట్టితే సందిగ్ధానికి అనుమానాలకు తావుఇస్తుంది అది ఆలోచిస్తారా ?

16th August 1956]

THE HON SRI G LATCHANNA — ప్రభుత్వం అన్నీ పరిశీలించి ఒక proposal చేసింది దానిని కేంద్రప్రభుత్వంకూడ ఆమోదించింది దానిమీద estimates తయారవుతున్నాయి

SRI A VENKATRAMA RAJU — పశ్చిమ గోదావరిజిల్లా నర్సాపురం పూర్వం Dutch వారి రేవుగా ఉండేది దానినిగురించికూడ గవర్నమెంటు enquiry చేస్తున్నట్లు తెలుస్తుంది ఇప్పుడు estimates కావలసినటువంటి రేవులలో అదికూడ ఉన్నదా ?

THE HON SRI G LATCHANNA — Estimates ఉన్న రేవుల జాబితా తమకు చదివి వినిపించానండి

*Loans to Minor Panchayat Boards*

149 * 190 Q SRI B RATNASABHAPATHI —Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state

(a) the amount of loan that a minor Panchayat Board can obtain from the Government,

(b) whether it is a fact that a loan of twenty four thousand rupees was granted to Buchireddipalem Panchayat Board and

(c) if so whether there is any other minor Panchayat Board which has been granted an equal amount ?

THE HON SRI A B NAGESWARA RAO —

(a) No limit has been prescribed for the amount of loan which a Class II Panchayat may obtain from the Government

(b) The answer is in the negative

(c) The answer is in the negative

SRI B RATNASABHAPATHY — పొరపాటున ఇది Minor Panchayat అని పడింది అనుకొంటాను. ఆ పొరపాటు ఎక్కడ జరిగిందో తెలియదు Major Panchayat అనే నేను వ్రాశాను అనుకొంటాను

Mr SPEAKER —When there is no limit for minor panchayats much less there will be no limit for major panchayats

SRI P NARASIMHAPPA RAO — అధ్యక్షా ముఖ్యంగా మనకు కావలసింది నీరు గాలి ముందు Major Panchayat అని వ్రాశారు Major Panchayat కు ముఖ్యంగా కావలసింది water works దానినిగురించి ప్రభుత్వం ఆలోచిస్తుందా అని అడుగుతున్నాను

THE HON SRI A B NAGESWARA RAO — వేరే question వేస్తే answer వస్తుంది Secretariat కు వచ్చినదాంట్లో కూడ Minor Panchayat అనే వచ్చింది మా answer యివ్వడం అయినది

SRI M NAGI REDDI — అప్పులు ఇవ్వడంలో restrictions లేవు అన్నారు ఎక్కడకూడ Minor Panchayat లకు అప్పు ఇస్తున్నట్లు మాదృష్టిలో లేదు ఎక్కడైనా ఇచ్చినటువంటివి ఉన్నాయా ? Minor Panchayat లకు ఇవ్వడానికి ఈ సంవత్సరం allotment ఉన్నదా ?

THE HON SRI A B NAGESWARA RAO —ఇది Major and Minor Panchayat లకుకూడా మామూలు low income housing group క్రింద composts కి other purposes కి ఇచ్చినవి ఉన్నాయి 5 6 items ఉన్నాయి

*Schemes relating to Handloom Industry*

151
*240 Q SRI P SATYANARAYANA —Will the Hon the Minister for Planning and Industries be pleased to state

(a) whether the schemes relating to Handloom Industry in the State are prepared clearly and completely in the Second Five Year Plan

(b) if so whether Government will place those schemes on the Table of the House?

THE HON SRI K VENKATA RAO

(a) Yes, Sir, A programme of development of the handloom industry under the Second Five Year Plan has been drawn up with a view to secure all round development of the ndustry

(b) A statement‡ is placed on the Table of the House,

(a) అవునండి ఈ చేనేత పరిశ్రమాభి వృద్ధికోసం 2వ పంచవర్ష ప్రణాళికలో schemes తయారు చేయబడ్డవి

(b) ఒక statement సభవారిముందు పెట్టబడినది

SRI P GUNNAYYA — అధ్యక్షా, చేనేత పారిశ్రామికులను గురించి ప్రభుత్వం అనేక సదుపాయాలు చేస్తున్నారు ఇంకా చేయబోతున్నారు కాని ఈ బట్టలధర ఏమీ తగ్గలేదు రాష్ట్రంఅంతా చాలా అందోళనగాఉంది బట్టలు ఇది వరకు 4 సంవత్సరాలకుపూర్వం అమ్మినట్లుగా అమ్మేటట్లు చేయడానికి ప్రభుత్వం వారు ఆలోచిస్తారా ?

‡ Vide appendix at page 234 infra

THE HON SRI K VENKATA RAO — గున్నయ్యగారు కూలీరేట్లు తగ్గించే వ్యవహారంచేస్తే చేనేత బట్టలధరలు తగ్గుతాయి ధాన్యంధరలు తగ్గుతాయి

*Charitable Endowments*

152

* 462 Q SRI P VENKATASUBBAYYA.—Will the Hon the Minister for Revenue be pleased to state

(a) the procedure adopted to bring in any charitable endowments under the purview of the Charitable Endowments Act, and

(b) whether the Government propose to amend the Act to simplify the procedure ?

THE HON SRI K CHANDRAMOULI —

(a) Printed answer † is placed on the Table of the House

(b) The matter is under consideration of the Government

*Soap Manufa ture from non edible oils*

153

* 371 Q SRI P VENKATASUBBAYYA

SRI M NAGI REDDI —Will the Hon the Minister for Planning and Industries be pleased to state

(a) whether it is a fact that the All India Khadi and Village Industries Board has allotted to Andhra 30 units for the manufacture of soap from non-edible oils,

(b) if so, what are the details of the Scheme ?

THE HON SRI K VENKATA RAO —

(a) It is understood from a representative of the All India Khadi and Village Industries Board that the Board has allotted to Andhra 30 units for the manufacture of soap from non edible oils

The Board has been requested to confirm the allotment

(b) The details ‡ of the scheme as furnished by the representative of the All India Khadi and Village Industries Board are in the paper placed on the Table of the House

THE HON SRI K VENKATA RAO — ఆంధ్రరాష్ట్రంలో భోజన పదార్థములక్రింద వినియోగించే నూనెలోనుంచి సబ్బులు తయారు చేయడానికి 30 సంస్థలు పర్పాటు చేయడానికి All India Cottage Industries Board వారు

† Vide appendix II at page 236 infra

‡ Vide appendix III at page 237 infra

సంకల్పించారని ఈ ప్రభుత్వానికి వార్తవచ్చింది వారు ఇచ్చినటువంటి వివరములు అన్నికూడా ఈ సభముందు పెట్టడం అయింది

SRI VAVILALA GOPALAKRISHNAYYA — ఇంతవరకు అటువంటి units ఏమైనా ప్రారంభించారా ? ఎవరన్నా అడిగారా? అడిగితే ఇస్తారా ?

THE HON SRI K VENKATA RAO —ఇదివరకు కొంతమంది అడిగారు ఇంకా అడగడానికి కావలసినటువంటి అవకాశం ఉంది

SRI PILLALAMARRI VENKATESWARLU — అడిగినవాండ్లకు ఏమైనా సహాయం జరిగిందా ?

THE HON SRI K VENKATA RAO —అప్పుడేకొన్ని institutions పనిచేస్తున్నాయి ఈ ఏడు 30 కొత్తవి ప్రారంభం అవుతాయి ఇదివరకే దేశంలో ం 10 ఉన్నాయి

SRI PILLAMARRI VENKATESWARLU —ఇందులో తయారు అయిన సబ్బులు ఏవిధంగా ఉన్నాయో ప్రభుత్వం పరీక్షించిందా ?

THE HON SRI K VENKATA RAO —బహుశా ఈ వేళ సాయంత్రము exhibition లో కనిపిస్తాయి అనుకొంటాను

SRI S VEMAYYA —సబ్బుల ఫ్యాక్టరీలు ఉన్నాయి అన్నారు అవి ఎక్కడెక్కడ పనిచేస్తున్నాయో తెలుసుకోవచ్చునా ?

THE HON SRI K VENKATA RAO — వేమయ్యగారు వేరేప్రశ్న వేస్తేమంచిది

SRI P VENKATA SUBBAYYA — ఈ table మీద పెట్టబడిననోటులో అప్పులు ఇచ్చేటటువంటి పద్ధతులలో Director of Industries recommend చేయవలెనని ఉంది Society ఇదివరకు Society Act క్రింద register కాబడినపుడు Society Registrar recommend చేయకుండా డైరక్టరుకు పోవడం అసంభవం కాబట్టి ఇక్కడ ఎక్కువ ఆలస్యం జరుగుతుంది అదికాకుండా డబ్బు registered society కి నేరుగా ఇవ్వబడుతుందని చెప్పబడింది ఆవిధంగా చేసినట్లయితే District Co operative Central Bank supervision ఉండదు కాబట్టి District Co-operative Central Bank ద్వారా ఈ అప్పులు ఇచ్చేదానికి ప్రభుత్వంవారు ఏర్పాటు చేస్తారా ?

THF HON SRI K VENKATA RAO —ఇవ్వనక్కర లేదు ఇవి ప్రత్యేక సంస్థలు వాటి ద్వారా వెళ్ళితే గ్రాంట్లు అన్నీ పోతాయి చిన్న శ్రీసంజీవయ్యగారు నేను కలసి ఒక కొత్త సిద్ధాంతం ఆలోచించాము Joint Dirctor of Industries కు Co operative Societies Industries కు సంబంధించి నంతవరకు రిజిస్టరుచేసే అధికారం సంప్రాప్తింపచేస్తున్నాము గనుక ఈ ఆలస్యాలు అన్నీ తగ్గిపోయి పని త్వరగా జరిగేటటువంటి ఏర్పాట్లు వారంరోజులలో జరుగుతాయి

SRI PILLALAMARRI VENKATESWARLU — ఈ బోర్డుక్రింద graduates కు training course పెట్టుతున్నాం జరుగుతున్నది అని చెప్పారు ఇప్పటికి ఎంతమందిని train చేశారో చెప్పగలరా ?

THE HON SRI K VENKATA RAO — వేరే ప్రశ్న వేయాలి

SRI S VEMAYYA — ఈ factory లలో పనిజరగడానికి technical assistance ప్రభుత్వం ఇస్తుందా ? ఇస్తే అది పరిమితమైన కాలమేనా ? లేక ఎప్పటికీ ఇస్తారా ?

THE HON SRI K VENKATA RAO — Technicality factory ఇవి అన్నీ మామూలు పర్యాయపదాలు ఎవరో ముగ్గురు నలుగురికీ నేర్పి తర్వాత వీరికి నేర్పుతారు అదిఅంతా ఎక్కువగా cold process అది బుద్ధికుశలతో చేసుకొనే వ్యవహారం దానికి పెద్దపెద్ద జీతాలు ఇచ్చి Technical Assistants ను పెట్టవలసిన అవసరం ఉండదు అనుకొంటాను

SRI N VENKAIAH — ఈ Soap factory లలో మంచి quality సబ్బు తయారు అవుతుందా ? అయితే పభుత్వంవారు తెలియజేసి ఇంకా ప్రోత్సహిస్తారా ?

THE HON SRI K VENKATA RAO — కాకిపిల్ల కాకికి ముద్దు భారతదేశంలోఉన్న దేశభక్తులకు మనదేశంలో తయారు అయ్యేదే ముద్దు

*Starred question postponed from the supplemental list for 11 8 56*
*Adult Literacy Campaign*

131

* 163 Q SRI V VISWESWARA RAO

SRI M NAGI REDDI —Will the Hon the Chief Minister be pleased to state

(a) whether it is a fact that the Government directed the Education Department to discontinue the adult literacy campaign, and

(b) if so, the reasons for the same?

THE HON Dr B GOPALA REDDI –

(a) The answer is in the affirmative

(b) In view of the general complaint that the adult literacy schools are not properly run orders were issued directing the Education Department to restrict the expenditure to the budget provision for 1956 57 by closing as many of the existing schools as are necessary

SRI PILLALAMARRI VENKATESWARLU — Budjet లో దాని మీద ఎంత save చేస్తున్నారు ?

THE HON Dr B GOPALA REDDI — పోయిన సంవత్సరం 6 61 500 రు॥ లు ఉన్నది ఈసంవత్సరం లక్ష రూపాయలు తగ్గించినారు అంటే 5 61 000 రు॥లు మిగిలింపు వస్తుంది

SRI VAVILALA GOPALAKRISHNAYYA — మీరు close చేయడానికి ఆర్డరు ఇచ్చారా అని ప్రశ్న వేశారు అవును అంటే close చేయడానికే ఆర్డరు ఇచ్చారాండీ ? అట్లాగే అర్థం చేసుకోనవలెనా ?

Mr SPEAKER — మరొక అర్థం చేసుకొనడానికి possibility లేదు

THE HON Dr B GOPALA REDDI — ఆరు లక్షల 61 వేల దగ్గరనుంచి లక్ష రూపాయలు తగ్గించామన్నారు అంటే చాలవరకు స్కూళ్లు పోతాయి ఎక్కడనో N E S block వగైరాలలో ఉండేటటువంటి schools మాత్రం ఉంటాయి

SRI S VEMAYYA —General complaints వచ్చినందున ఈ schools close చేయడానికి పూనుకొన్నామన్నారు సామాన్యంగా ఏదో general complaint వస్తే చర్య తీసుకోడానికి specific గా కావాలంటారు ఆ specific complaints వచ్చేవరకైనా ఇవి continue చేసేదానికి ప్రభుత్వం పూనుకొంటుందా ?

THE HON Dr. B GOPALA REDDI —మరి budjet provision లేదే Budjet provision బట్టి లక్ష రూపాయలు మాత్రం ఉంది మన budjet discussions లో మనఅసెంబ్లీ మెంబర్లే చాలమంది ఇది బాగా run కావడంలేదని చెప్పారు మేము close చేస్తున్నాం అది ఆలోచిస్తున్నాం అని చెప్పినపుడు ఎవరో మెంబరు ఒకరు నన్ను అభినందించారు కూడ అసెంబ్లీ మెంబరే, పేరు జ్ఞాపకంలేదు.

16th August 1956 ]

(Ramana Reddi గారట) అందువల్ల ఇవి అన్నికూడ ఆలోచించినతరువాత జరిగింది దానివల్ల కొంత మిగిలింపు వస్తుంది

SRI S KASI REDDI — అధ్యక్షా ! మనదేశంలో నూటికి 85 మంది విద్యరాని వారున్నారు ఇటువంటి పరిస్థితులలో ఏదో complaint వచ్చిందనే కారణంచేత ఈ adult schools ను రద్దుచేయడం అంత సబబుగావుండదు కాబట్టి ప్రభుత్వంవారు పునరాలోచించి ఈ schools ను continue చేయుటకు ప్రయత్నిస్తారా ?

THE HON Dr B GOPALA REDDI — ఇది కేవలం complaint మాత్రమే కాదు వయస్సుమీరినవారు వయోజనులుగాకూడ సరిగా చదువుట లేదని అందరియొక్క అనుభవాన్ని బట్టి ఋజువు అవుతోంది అందువల్ల ఈ schools ను మూసివేయడం జరుగుతోంది చిన్నపిల్లలుగా వున్నపుడే చదువులు నేర్పి దేశంలో నిరక్షరాస్యత లేకుండా చేసుకోవడం మంచిదే కాని ఈ adult schools సరిగా పనిచేయడంలేదని అనేకమంది వ్యక్తీకరించారు కాబట్టి ఈ నిర్ణయానికి వచ్చాము

SRI M NAGI REDDI — కొన్ని పాఠశాలలను మూసివేయుటకు ప్రభుత్వం నిర్ణయించిందని చెబుతున్నారు కాని ఏయే పాఠశాలలను మూసివేస్తున్నారో ఇంతవరకు orders రాలేదు జనవరినుంచీ కూడా జీతాలు రాలేదని ఉపాధ్యాయులు complaint చేయడం జరుగుతోంది ఏయే పాఠశాలలను మూసివేయుటకు నిర్ణయించారో వాటికి specific గా orders పంపి జీతాలు ఇవ్వవలసిన ఉపాధ్యాయులకు వెంటనే జీతాలు బట్వాడాచేసే ఏర్పాటు చేస్తుందా ప్రభుత్వం ?

THE HON Dr B GOPALA REDDI —Academic yearలో వచ్చిన లోపంఅది Last two months లోను కొన్నికొన్ని objections ఉన్నాయి అటువంటి objections అన్నింటినీ సవరించేవరకూ grants ఇచ్చుటకు వీలుండదు Academic year అనగా ఇది జూలై నెల నుంచి అమలులోకి వస్తుంది కాబట్టి అంతకుముందుఉన్న ఉపాధ్యాయులందరకూ ఏమియివ్వాలో అది ఇవ్వడానికి ప్రయత్నంచేస్తాము

SRI PILLALAMARRI VENKATESWARLU — ఈ schools ను మూసివేయడంవల్ల చదువుకొనేవారు ఎంతమంది చదువులేకుండా పోతున్నారో చెప్పగలరా ?

THE HON Dr B GOPALA REDDI —నేర్చుకుంటున్నామని అభినయించేవారు కొంతమంది తగ్గిపోతారు నేర్చుకొనేవారు ఎవ్వరూలేరు

4

[16th August 1956

SRI G NARASIMHA MURTHI —అధ్యక్షా ఈ schools ను తగ్గించే విషయంలో పలువురు సభ్యులు వారి అభిప్రాయాలను తెలిపారు వారి అభిప్రాయాలను మంత్రిగారు పాటించామని శలవిచ్చారు అది చాలా ప్రశంసా పాత్రమైన విషయం

Mr SPEAKER — Question వేయండి

SRI G NARASIMHA MURTHI — మొన్న బంగాళాదుంప నీరుల్లి పాయపైన

Mr SPEAKER — వేరేప్రశ్న వేయండి

THE HON Dr B GOPALA REDDI — ఆపన్నుఉండాలని పలువురు సభ్యులు కోరినారు

SRI P NARASIMHAPPA RAO — అధ్యక్షా ! మన అసెంబ్లీ form అయినతరువాత శ్రీకాకుళం జిల్లాబోర్డునుగురించి కొన్నిప్రశ్నలు పంపినాము మొదటిసమావేశం అయిపోయింది రెండవసమావేశం అయినతరువాత మళ్లీ పంపించాము అవి ఏ కారణంచేతనో ఇంతవరకు రాలేదు కారణమేమిటో మంత్రి గారు శలవిస్తారా ?

Mr SPEAKER — వరుసగా ఒకటితరువాత ఒకటివస్తున్నాయండీ

SRI A KALESWARA RAO —టర్కీ స్వాతంత్ర్యంపొందినతరువాత చైనాలో 28 వ విప్లవం జరిగిన తరువాత బ్రహ్మాండంగా adult schools programme పెట్టి వయోజనులకు సక్రమంగా విద్యనేర్పుతున్నారు మనం ఉన్న schools ను close చేసుకుంటున్నాము University Students చేత adult education programme పెట్టించి సక్రమంగా నడిపించడానికి ఆలోచిస్తారా ? డబ్బులేదని చేతులు ముడుచుకొని ఊరుకుంటారా ?

THE HON SRI A B NAGESWARA RAO — నేను రాజ మండ్రి మున్సిపల్ ఛైర్మేన్గా ఉన్నప్పుడు adult education కోసమని 7 సం॥ లు ప్రయత్నంచేశాను Classes conduct చేశారు విద్యార్థులు వారం రోజులకంటె ఎక్కువరాలేదు క్రమేపీ 20 15 10 వచ్చి ఆఖరికి అసలు రాని రోజులుకూడా ఉన్నాయి అందుచేత ఈ schools కోసం ఖర్చుచేసే డబ్బంతా దండగని నా అభిప్రాయం

## II POINT OF INFORMATION RE BUSINESS OF THE HOUSE

SRI P NARASIMHAPPA RAO —On a point of information Sir ఈసమావేశం ఎప్పటివరకూ continue అవుతుందో తెలియజేయవలసిందిగా మంత్రి గారిని కోరుతున్నాను

THE HON Dr B GOPALA REDDI — ఈ నెల 22 23 తేదీలలో ఆపుజేస మళ్లీ సెప్టెంబరునెలలో సమావేశపరచాలని అనుకొంటున్నాను గౌరవనీయ సభ్యులు ఈలోపుగానే బిల్లులన్నీ ఆమోదించి త్వరగా pass చేసినట్లయితే మనంఅంతా తొందరగానే వెళ్లిపోవచ్చు

SRI N SRINIVASA RAO — ఈరెండుమూడురోజులలో ఒక అనధికార దినమును యివ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON Dr B GOPALA REDDI —రేపే non official day

SRI R B RAMAKRISHNA RAJU —రేపు non official day గా చేసుకొంటే 18 19 holidays అవుతాయి 20 21 22 23 తేదీలలో ఏయే Bills జరుగుతాయి ? ఈలోగా ఒక conference ఏర్పాటు చేస్తారా ?

[*Note* —An asterisk *at the commencement of a speach indicates revision by the Member ]

## III MOTION UNDER RULE 74 OF THE ASSEMBLY RULES

Mr SPEAKER —Sri Vavilala Gopalakrishnayya calls the attention of the Hon the Chief Minister to the following statement

I rise to draw the attention of the Hon Chief Minister to the statement made by Hon Sri C Subramaniam, Minister of Madras State in the Madras Legislative Assembly that the statement of the Government in the Governor s address has crossed the bounds of Inter State propriety ' and request to please explain and uphold the propriety of our Government and Legislature '

SRI R B RAMAKRISHNA RAJU —Sir, I suppose all of us have seen that statement and I need not tell you that it has raised a serious constitutional question, and I am sure all of us those in the opposition also feel a sort of trepedition at this kind of language Personally, I feel, Sir that whether the speech is from the Governor or from the Chief Minister or from the Revenue Minister, or any Minister we are entitled to say what we feel about a particular question Even supposing this border question is pending discussion between this government

and that government, I do not know if our Government is preclud ed from making their mind know about what they intend to do about a particular subject Moreover I have reason to believe that our Government have already informed the Madras Government that they feel that no useful purpose will be served by the inter State negotiations, and the better thing perhaps will be to ask for a Boundary Commission I speak subject to correction Sir I think I also saw a statement from the Madras Government that they have already addressed the Central Government for the appointment of a Boundary Commission, because they see nothing tangible coming out of these inter State negotia tions While so I fail to see Sir, what is the inter State propriety, and what is the border of inter State propriety that has been crossed by the statement made by the Governor in this House, that they would like to wait till uniform principles are evolved for deciding this boundary question That is all the statement that has been made here and I fail to see what is the inter State propriety that has been violated here Apart from that, as I submitted Sir, even so, it will be very dangerous to allow members or Ministers of another State to criti cise the actions of this Assembly, the Governor or the Assembly or the proceedings of this Assembly with impunity If that is allowed where will the matters end? Yesterday, the Minister spoke and there is no objection to any other member also speaking We know that the Minister had some restraint in the talk though one or two sentences which he used are unfortunate But we may not expect the very same kind of propriety or restraint from the other members So I think it is a very serious Constitutional question Sir, and we ought to make it clear whether it is open to us or to that Assembly or to any other Assembly to freely criticise the actions of this Govern ment, or the Governor or the proceedings of this House I do not want to say anything more but I request you Sir, to look into the matter I feel that it is a matter which we ought not to allow to go unnoticed and I hope, Sir, you will do the right thing to uphold the prestige of this House

SRI PILLALAMARRI VENKATESWARLU — అధ్యక్షా మన గవర్నరుగారి addressలో ఇచ్చినటువంటిభావాలు చదివితే దానిలో improperగా ఉండేభావాలు నాకేవిధంగాను కనబడడంలేదు ఉన్నటువంటి facts ను narrate చేశారు Agreement కు రావలసినటువంటి అవసరం ఉన్నదని సూచించారు ఇట్లా చెప్పినప్పుడు మద్రాసు ఆర్థికమంత్రిగారు ఎందువల్ల ఆవిధంగా statement చేశారోకూడా అర్థంకావడంలేదు ఆరకంగా మద్రాసు ఆర్థికమంత్రిగారు Statement ఇచ్చి ఉండరాదనికూడా నేను అభిప్రాయపడుతున్నాను ఏమన్నాఉంటే

Government level లోని correspondence జరిపినట్లయితే ఇంతకంటె ఎక్కువ ఉపయోగకరంగా ఉండేదేమోనని అనుకొంటాను ఏదిఏమైనప్పటికి అటు Madras Government కు మనకు ఏవిధంగాను అన్యాయం జరగకుండాఉండాలని మాత్రం నేను కోరుతున్నాను దీనిలో పరిష్కారమార్గంగా సూచించినటువంటివి చాల భాగము అంగికరించడానికికూడా వీలుఉన్నది అన్ని వివాదగ్రస్త ప్రాంతాలకి ఒకేవిధమైనటువంటి సూత్రాన్ని apply చేయాలనేటటువంటి విషయంలో ఎవరికి ఏవిధంగా అభ్యంతరంఉన్నదో తెలియచేస్తే మనకు కూడా కొంత ఉపయోగంగా ఉండేది అంతేగాకుండా improper గా ఉన్నది ఇట్లాచెప్పాలి అట్లాచెప్పాలి అని ఎవో నీతిసూత్రాలు వల్లించినట్లుగా వీరు వల్లించారు ఆవిధంగా జరిగి ఉండాల్సింది కాదని నేను అనుకొంటాను

THE HON Dr GOPALA REDDI — అధ్యక్షా ఇది చాల ప్రముఖమైనటువంటి సునిశితమైనటువంటి విషయంకాబట్టి ఇప్పుడు ఏమిచెప్పేదానికి వీలు లేదు వారు ఏమిచెప్పారో నేనింకా పూర్తిగా చదవలేదు ఏమైనప్పటికి ఏదైన చెప్పదలచుకొంటే రేపుచెప్పడానికి అనుమతిస్తారని ఆశిస్తున్నాను

## IV MOTION UNDER RULE 265 OF THE ASSEMBLY RULES

SRI B RATNASABHAPATHI —Sır I move

That under rule 265 of the Andhra Legıslatıve Assembly Rules leave of absence be granted by thıs House to Srı P V R Gajapathı Raju Member Andhra Legıslatıve Assembly for hıs absence durıng the present Sessıon

Mr SPEAKER —The questıon ıs

'That under rule 265 of the Andhra Legıslatıvs Assembly Rules, leave of absence be granted by thıs House to Srı P V R Gajapathı Raju, Member, Andhra Legıslatıve Assembly for hıs absence durıng the present Sessıon

The motıon was carrıed and leave granted

SRI B RATNASABHAPATHI —Sır, I move

"That under rule 265 of the Andhra Legıslatıve Assembly Rules leave of absence be granted to Srımathı Kusum Gajapathı Raju, Member Andhra Legıslatıve Assembly for her absence durıng the present Sessıon

Mr SPEAKER —The question is

That under rule 265 of the Andhra Legislative Assembly Rules leave of absence be granted by this House to Srimathi Kusum Gajapathi Raju, Member Andhra Legislative Assembly for her absence during the present Session

The motion was carried and leave granted

(At this stage Mr Deputy Speaker occupied the Chair)

## V GOVERNMENT BILLS

### *1 The Andhra Ayurvedic and Homeopathic Medical Practitioners Registration Bill, 1956*

THE HON SRI K VENKATA RAO —Sir, I beg to introduce The Andhra Ayurvedic and Homeopathic Medical Practitioners Registration Bill, 1956 and more that the Bill be taken into consideration at once

అధ్యక్షా ఆయుర్వేద హోమియోపతి వైద్యుల యొక్క Registration practice లకు సంబంధించినటువంటి ఈ బిల్లును తమ ముందర పెట్టడానికి చాల సంతోషంగా ఉన్నది అయితే ఆయుర్వేదానికి సంబంధించిన బిల్లు తమవారి ముందర పెట్టేముందు ఒకసారి ధన్వంతరిని తలచుకోవడం చాల అవసరమని అనుకొంటాను

సుధాకుంభం హాస్తే జరమరణకార్థం సూనసాం సహస్రే
జిహ్వాగ్రే గదవార మదరోపనిషదం మణిం
శ్రీ వత్సాంకే ధృతిజలనిధే యోగినిపుర వినిఘ్నం
విఘ్నాని వహసుకయేతు సధన్వంత విభుః '

ఇప్పుడు దేశంలోఉన్న పరిస్థితి మనకు తెలుసు కృత్రిమ ఎరువులచే పండించి జీవపదార్థములు కోల్పోయిన చాలిధాన్యము సంకిధాన్యము, ఇట్టి ధాన్యముమీద పొట్టుచే పోషించబడిన గోమహిషాది సంతానము యొక్క పాలు పెరుగు నెయ్యి సూపరు వగైరా వేసిన కూరలు ఆకుకూరలు నెయ్యిలో డాల్డా నూనెలో వేరుసెనగ కల్తీ శుభ్రమైన నీటిలో bleaching powder కలిపి స్వభావాన్ని మార్చుట బైటకుపోతే పట్టణాలు జనసమర్ధము బస్సులు రైళ్లలో ప్రత్యవాయము హోటళ్లలో తొత్తడం భోజనం అని ఒకరి మధ్యన ఈపరిస్థితిని వర్ణించారు ఈ పరిస్థితిలో దేశం ఉన్నది దేశంలో ఉన్నటువంటి ఆరోగ్యాన్ని కాపాడ అన్నట్లయితే చాల విపులమైనటువంటి చర్య తీసుకొంటేనే తప్ప అది

ముందుకు వెళ్ళడం చాల కష్టం అవుతుందనేటటువంటి భావం ఒకటి ఉన్నది ఇతరదేశములు మనకంటెబాగున్నాయేమోనని కూడా ఈ మధ్యన నేను ఒకచోట చదివాను

Popes who are in a position to know, have no hesitency in saying that the Americans as a Nation are the sickest people on the face of the earth Scientists who have studied the subject ungrudgingly admit that many of the wild tribes along the Amazon river in South America on the high plateaus of India and the jungles of darkest Africa have a health cotient that is many times higher than that of practically any of the modern countries and even among the so called civilised nations the United States is far from top when it comes to sound health

ఇప్పుడు నేను వర్ణించినటువంటి పరిస్థితులు అమెరికాలో కూడా ఉన్నాయన్నమాట అందువల్ల మందులు క్రొత్త వైద్య విధానాలు వచ్చాయిగాని ప్రజారోగ్యము అంతా ఉచ్ఛస్థాయిలో అక్కడ కూడా లేదు

Over 350 million dollars ( 750 crores of rupees ) is the sum the American public pays for patent medicine manufacturers for drugs containing poisons or for worthless nostrums The laws offer the consumer little protection against advertised theoropathic claims that are false and misleading

ఒక్క అమెరికా దేశంలోనే 750 కోట్ల రూపాయలు సీసాలలో పెట్టిన మందులకోసమే ఖర్చు పెడుతున్నారు అవి మంచివో చెడ్డవో తెలుసుకోనేటటువంటి సునిశితమైన విధానం అక్కడ కూడా అమలులో లేదు అందువల్ల paper లలో వేసేటటువంటి advertisement ల యొక్క ఫలితం ఆదేశంలోకూడా ఉన్నదన్నమాట ఈ పరిస్థితులలో మనదేశంలో ఉన్నటువంటి ఆరోగ్యాన్ని కాపాడేందుకోసం ప్రస్తుతం ఆలోపతిక్ విధానం అమలులో ఉన్నది ఈ ఆలోపతిక్ విధానానికి చేసేటటువంటి చదువు సంధ్యలకు డాక్టర్లుగా తయారు కావడానికి చాలడబ్బు ఖర్చు పెట్టవలసి వస్తోంది తయారయ్యే డాక్టర్ల సంఖ్య చాలా స్వల్పంగా ఉన్నది మనకు 7 లక్షల గ్రామాలు ఉన్నాయి వైశాల్యమైనటువంటి దేశం అంతకంటె విపులమైనటువంటి జనాభా ఇంతమందికి ఆర్థిక విధానంలో వెనుకబడినటువంటి దేశాన్ని రోగాన్నుంచి కాపాడ్డానికిగాను సరైనటువంటి రోగవిధానాన్ని అవలంబించి ఆ కార్యక్రమాన్ని అమలు పెట్టదలచినట్లయితే ఎంతోఖర్చుచేయవలసి వస్తుంది అందువల్ల ఆలోపతిక్ విధానం వల్లనే దేశంలోఉన్నటువంటి అనారోగ్యాన్ని తగ్గించేటటువంటి యత్నం చేద్దామని తలచినట్లయితే అవి వృధాప్రయత్నమే అవుతుంది ఈమాట నేను క్రిందటి చర్చ

Sri K Venkata Rao] [16 th August 1956

లోనే చెప్పాను ఇంగ్లండులో 1000 మందికి ఒక వైద్యుడున్నాడు ఇండియాలో 6000 మందిక ఒకవైద్యుడున్నాడు ఆంధ్రరాష్ట్రంలో 8000 మందికి ఒక వైద్యుడున్నాడు అందువల్ల ఒక్క అలోపతిక్ విధానంవల్లనే ఈ వ్యవహారం జరగ డానికి వీలులేనటువంటి పరిస్థితులు దేశంలో ఉన్నాయని మనమందరం ఎరిగిన విషయమే అయితే మనకు స్థానికంగా దేశీయమైనటువంటి పద్ధతులు లేక పోలేదు ఆయుర్వేద యూనానిన్ ఎచ్చి ప్రకృతి విదేశంలో పుట్టినా మనదేశంలో చాల ప్రచారంలో ఉన్నటువంటి హోమ్యోపతివైద్యాలు మనదేశంలో నడుస్తు న్నాయి అంతవరకు ప్రభుత్వంవారు వీటి దేనికీకూడా శాసనరూపంగా సహాయం చేసి ఉండలేదు

ఇప్పుడు వీటినికూడా శాసనబద్ధంచేసి కొన్ని నిర్ణీతమైన నియమములక్రింద వీటిని మనము ఉపయోగములోకి తెచ్చుకోగలిగినట్లయితే మనయొక్క ఆరోగ్యం కోసం రక్షణకోసం, పురోభివృద్ధికోసం చాలా సహాయపడినవాళ్ళు మనుతాయి అందువల్ల ఈబిల్లు తమముందర ప్రవేశపెట్టడం జరిగింది ఆయుర్వేదము అంటేనే అమృతమన్నమాట ఇంత అర్థస్ఫూరితమైనటువంటి మాట మందులకు సంబంధించి ప్రపంచములో ఎక్కడా ఏభాషలోలేదు ఒక్క సంస్కృతములోనే ఉన్నది ప్రపంచంలో పుట్టిన ప్రతిమనుష్యుడు కూడా చిరకాలము జీవింపవలెనని కోరడం కూడా సహజమైనటువంటి విషయమే అందులో తప్పేమిలేదు కాని బ్రతికినన్నాళ్లు రోగరాహిత్యంగా బ్రతుకవలెనని కోరుకోవడంకూడా సహజ మైనటువంటి విషయమే దీర్ఘాయువును స్వేచ్ఛ జీవనమును తెలుపునది ఆయుర్వేదము ఆయుస్సును పోషించునదే ఆయుర్వేదము అంటె బ్రతికి ఉండడమేకాదు దానిని సుఖజీవనము క్రిందను రోగరాహిత్య జీవనముక్రిందను నడుపుకోవాలనేటటువంటి భావన చక్కగా రెండు సమాసాలలో చేర్చివేశారు జ్ఞానసంపుటిని వేదమని పిలువడంవల్ల వేదముల స్థాయిలోకూడ దీన్ని పెట్టారు కొంతమంది ఆయుర్వేదమును పంచమవేదమని అనడంకూడా సాంప్రదాయమైనటు వంటి విషయము ధాతువులు వైషమ్యంచెందినవ్యాధి అంటారు ధాతువులుగనుక సమానంగావుంటే ధాతుసామ్యం అంటారు ఈ ఆయుర్వేదంలో ప్రధానమైనటు వంటి మార్గం – స్వస్థవృత్తం అంటే ఆయువును సంరక్షించుకోవడం నిధానం అంటె వ్యాధులను పోల్చుకోవడం చికిత్స అంటె వ్యాధియొక్క నివారణ మూడుదోషముల యొక్క స్థితిని గ్రహించుటయే ఈవైద్యము యొక్క ప్రత్యేకత సాధారణంగా ఏవైద్యుడైన pulse పట్టిచూస్తాడు అలోపతి డాక్టరుకుసంబంధించి నంతవరకు pulse rapid గా ఉన్నదా medium గా ఉన్నదా slow గా ఉన్నదా అని చూచుకొంటాడు ఆయుర్వేదములోఉన్న వాత పిత్త కఫ రోగాల నిర్ణయం

మిగిలిన సిద్ధాంతాలలోలేదు ఈ త్రిదోషాలపద్ధతి ఒక్క ఆయుర్వేదానికే ప్రత్యేకత ఈ విషయము మనము గుర్తించాలి నాడీనిదానం రసప్రక్రియ కూడా ఆయుర్వేదములో ప్రత్యేకమైనటువంటి స్థానాన్ని పొంది ఉన్నాయి విటినన్నిటినికూడా వదలిపెట్టలేదు దీంట్లో ఎప్పుడు ఎవరు research చేశారో తెలియదు పుస్తకాలు చూచుకొంటె ఇప్పుడు modern science ఎంత దూరము వెళ్లిందో కొన్ని విషయములలో అంతకంటె దీనిలో ముందంజవేశారు ధన్వంతరి చరకుడు శుశ్రుతుడు సిద్ధ నాగార్జునుడు బసవరాజ వగైరాలు వీరంతాకూడా చాలాకృషి చేశారు ఈ వైద్యంలో చికిత్సలు ఎనిమిది రకాలు ఉన్నవి కాయచికిత్స బాల చికిత్స భూత చికిత్స శాలాక్య చికిత్స శల్య చికిత్స విష చికిత్స రసాయన చికిత్స వాజీకరణ చికిత్స ఈ అష్టాంగాలతో కూడినటువంటి ఆయుర్వేద వైద్యం చాలా developed stage లోకి ప్రపంచంలో వెళ్లింది ఆధునిక కాలంలో పండిత డి గోపాలాచార్లుగారు చాలా యత్నంచేసి ఈ వైద్యాన్ని చాలా ముందుకు తీసుకువెళ్లి సుమారు 40 50 సంవత్సరాలక్రితం మద్రాసులో విద్యాపీఠాన్ని స్థాపించి ఆయుర్వేద నిలయాన్ని స్థాపించి దీనిని చాలా ప్రాముఖ్యతలోకి తీసుకు వచ్చినటువంటివారు వారు ఒక కాలేజీకూడా నిర్వర్తించేవారు ఆ తరువాత ఆ కాలేజని వర్తమానంలో ఆయుర్వేదానికి అఖండమైన సేవ చేస్తున్న డాక్టరు లక్ష్మీపతిగారు చేపట్టి 1931 సంవత్సరం వరకు నిర్వర్తించడమే కాకుండా అప్పటినుంచి ఈ రోజు వరకుకూడా ఆయుర్వేదాన్ని ప్రోత్సహించి చాల కృషి చేస్తున్నారు శ్లేషాకోశంగా చెప్పితే అసలు లక్ష్మీపతి అనే శబ్దములోనే ఆయుర్వేదము ఉన్నది లక్ష్మీపతి అంటే ధన్వంతరి ఈ ఆయుర్వేద శాఖ కూడా ఆయన పేరుతోటె ఉన్నది అటువంటి ఉత్కృష్టమైన స్థితికి వారు ఈ విషయములో కృషి చేస్తున్నారు 1923–24 సంవత్సరంలో పానగల్ రాజాగారు appoint చేసినటువంటి ఉస్మాన్ కమిటీయొక్క యత్నాల ఫలితంగా మద్రాసులో School of Indian Medicine ను మొదలు పెట్టారు ఆ School లో చదివేవారికి L I M అనే Diploma ఇచ్చేవారు ఆ School నే College of Indian Medicine గా చేసి దానిలో G C I M degree కూడా ఇస్తున్నారు ఈ మధ్యన ఈ G C I M అనే పేరుతీసి College of Integrated Medicine అంటే Allopathy Ayurveda Sidda, Unani కలిపినటువంటిపద్ధతి అని పెట్టారు దీన్నిగురించి చాలా విమర్శలు ఉన్నాయి ఈ G C I M pass అయినటువంటి కొంతమంది గవర్నమెంటుకు petition కూడాపెట్టారు మేము అసలు ఆయుర్వేద వైద్యులమే కాదని మరెవరో తెలియదు! మనము ఇన్నిరూపాయలు మద్రాసు School of Indian Medicine కు ఇచ్చుకొనేది ఇందుకొరకేనా? ఈ రూపాయలే మిగిలిఉంటే ఆయుర్వేద కళాశాల

నైనా పెట్టుకోవచ్చు ఇప్పటికి Allopathy లో మూడు కళాశాలలు పెట్టుకొన్నాము హైదరాబాదుకు వెళ్లితే ఇంకో రెండు కళాశాలలు కలిసవస్తాయి అందువల్ల Integrated Medicine అనేటటువంటి పేరుపెట్టుకొని మద్రాసు గవర్నమెంటు ఈ పేరు మార్చినంతమాత్రంచేత ఈ ఆయుర్వేద వైద్యుల స్థాయిలోనుంచి వారిని తప్పించి వేయడమనే కోరిక ఈ ప్రభుత్వానికి కెంత మాత్రము లేదు ఇది హర్షదాయకంగా లేదు ఇప్పుడు మన ఆంధ్రదేశంలో కూడా ఇంద్రగంటి వల్లభాచార్లు బసవరాజు శరభరాజు పేరవామాత్యుడు మాధవాచార్యులు వగైరాలు అందరూకూడా ఉత్కృష్టమైన గ్రంథాలనువ్రాసు ముఖ్యంగా ఈ ప్రాంతాలలో రసాయనిక ప్రవృత్తిని చాలాముందుకు తీసుకు వచ్చారు ఆధునికంగా ఇప్పుడే మనవిచేసినట్లు పండిత గోపాలచార్లుగారు డాక్టర్ లక్ష్మీపతిగారు కీర్తిశేషులు నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిఖగారు ప్రతివాది భయంకర కృష్ణమాచార్లు వగైరాలుకూడ ఆంధ్రదేశములో ఈ ఆయుర్వేదము యొక్క ప్రోత్సాహానికి చాలా కృషిచేశారు మన ఆంధ్రదేశములో private గా నిర్వర్తింప బడేటటువంటి రెండు ఆయుర్వేద పాఠశాలలు ఉన్నాయి ఒకటి విజయవాడలోను ఇంకొకటి గుంటూరులోను నేను ఇందాక చెప్పినట్లు మద్రాసులో మొట్టమొదట పండిత గోపాలాచార్లుగారిచేతను తరువాత లక్ష్మీపతి గారిచేతను తయారుకాబడినటువంటి మొట్టమొదట కళాశాలలో A M A C అనేటటువంటి పేరుతో training అయినటువంటి ఆయుర్వేద వైద్యులు సుమారు 100 150 మందికి లోపుగా ఉంటారు ఇంతేగాక కొంతమంది degree లు లేకపోయినా ఆయుర్వేదమనేటటువంటి శాస్త్రిన్ని వారు స్వయముగా పరించకపోయినప్పటికీ వారి బుద్ధికుశలతను వినియోగించుకొని వైద్యము చేసేవారు ఉన్నారు కొంచె మించుమించు patent పద్ధతులలో వైద్యం చేస్తున్నారు ఆవిధంగా చాలా పేరుపొందినటువంటి వైద్యాలు ఉన్నాయి పొడ్డూరు పుత్తూరులో bone setting బాగాచేయబడుతుంది కుంకలమర్రిలో cataracts కు piles కు ప్రత్యేకమైన వైద్యమున్నది తాడిపత్రిలో anaemic condition కి ప్రత్యేకమైన వైద్యమున్నది ఎరుకలకూడి చిరుతపూడి పెనికేరు వగైరాలలో ఎచ్చివైద్యమున్నది టెక్కలిలో పిల్లలకు వైద్యమున్నది అంటె liver and spleen enlargement మొదలైనవాటికి అసలు పిల్లలమందు టెక్కల లోనె పుట్టింది దానిని జమ్మి వెంకటరమణయ్యగారు పైకితీసుకువచ్చారు ఈలాగు అనేక రోగాలకు వైద్యమున్నది ఇంకొకవిషయంకూడ చూడండి ఈ ఆయుర్వేద వైద్యులు ఇదివరకు అనేక రకాలైన పేర్లుతోటి ఉంటున్నారు వారి బిరుదులను బట్టి చూచుకొంటే ఎన్నోరకాలవారున్నారని తెలుస్తుంది కవిరాజ భిషగ్రత్న

16th August 1956 ] [ Sri K Venkata Rao

భిషగ్వాచార్య ఆయుర్వేదాచార్య ఆయుర్వేదభూషణ వైద్యావధాని ఆయుర్వేద వైద్యవిద్వాన్ ఆయుర్వేద అలంకార రాజవైద్య వైద్యశ్రీ వైద్యప్రవీణ వైద్యరాజ ప్రాణాచార్య వైద్యభూషణ ఈవిధంగా ఈ list ఇంకా పెద్దదిగా ఉన్నది ఈ బిల్లులోని ఉద్దేశ లను తమముందు పెట్టడానికే ఈ విషయాలన్నీ తమకు చెప్పవలసివస్తున్నది ఆయుర్వేదాన్ని మనం ప్రోత్సహించాలి ఆయుర్వేదాన్ని మనం ఉన్నతస్థాయికి తీసుకువెళ్లాలి కాని ఒక్కసారి రాజుచేత పరిగణింపబడినటువంటి ఈ ఆయుర్వేద వైద్యాన్ని మళ్లీ క్రిందికి పడిపోయేటట్లు చూడకూడదు నాడినిదానం తెలియకుండా మందులుచేయడం తెలియకుండా ఎవరి ఇష్టంవచ్చినట్లువారు వృత్తిని నడిపించుకొని మాకుకూడా పూర్ణమైనటువంటి హక్కులు కావాలని కోరడం ఏవిధంగాను న్యాయంకాదు ఆయుర్వేదానికి గౌరవము అడిగారు ఇస్తున్నాము కని ఆ గౌరవాన్ని ఆ గౌరవస్థానంలో అట్టేపెట్టే ఉద్దేశంతో ఈబిల్లు చేశాము ఇంతేకాకుండా పూర్వకాలములోకూడ శాస్త్రజ్ఞానంలేనివారు ఈవైద్యంచేయకూడదని వ్రాశారు

ఓషజ్ఞ కృతకల్పాస్తు
శస్త్రీ శని విషోపహస్తు
భవంచ ఉపహతస్తాస్త
తస్మాదేతాన్ వివర్జయేత్ అనివ్రాశారు

ఓషధులు అమృతముతో సమానమైనవి గాన వాటియొక్క నామము రూపము, యోగము వీటిని తెలుపు జ్ఞానము లేని వారిచే ఇవి ఉపయోగింపబడినచో అవి కత్తి పిడుగు విషము వీనితో సమానము రోగియొక్క ప్రాణములు తీయును గాన శాస్త్రము తెలియనివారిని ముఖ్యంగా పరిహరింపవలెనని వ్రాశారు శుశ్రూతులు ఇంకా అంతకంటే గట్టిగా వ్రాశాడు ఈ ఆయుర్వేదము అవశ్యముగా అజ్జనము చేయవలెను అజ్జనముచేసియు ధర్మపదాభ్యాసమును ముఖ్యముగా చేయవలెను శాస్త్రాధ్యయనమును ధర్మాభ్యాసమునుచేసిన వైద్యుడే రాజార్హుడు అని అంటే preliminary qualification ఏవిధంగాలేకుండా నన్ను వైద్యుడిక్రింద recognise చేసి అన్ని హక్కులు ఇవ్వడం న్యాయంకాదు ఇది శుశ్రూతుడు ఒప్పుకోలేదు చరకుడు ఒప్పుకోలేదు ప్రాచీన వైద్యశాస్త్రం ఒప్పుకోలేదు కనుక ఈ రోజున ఏమోజరిగితే దానిని గురించి మనం ప్రత్యేకంగా ఆలోచించవలసినటువంటి అవసరంలేదు అనేటటువంటి విషయం నిరూపించడానికి ఇది మనవిచేశాను

ఇంక Homeopathy ఉన్నది దీనిని జర్మన్‌దేశంలో Honiman అనేటటువంటి ఆయన మొట్టమొదట ప్రవేశపెట్టారు ఈనాడు మనం సాంప్రదాయంగా

Sri K Venkata Rao] [16th August 1956

చూస్తున్నాము అందరిదగ్గర Allopathic Doctors వద్దకూడా ఒక చిన్న Homeopathy case ఉంటుంది గ్రామాలలోకూడా చాలామందిదగ్గర ఉన్నాయి మనలోకూడా చాలామంది ఈ Homeopathy మాత్రలు వేసుకొంటూ ఉంటాము ఏమి వేసుకొన్నా పరవాలేదు దీనివల్ల జబ్బురాదని సాధారణంగా అనుకొంటారు కాని ఒక million potency ఉన్నమాత్రను వేసుకొన్నట్లయితే rash వస్తుంది

Homeopathy is the only international system of medicine based on natural laws but it takes note of the patient as a whole, and effect the cure of the diseases in a rapid, gentle and perfect manner ఇప్పుడు ఆయుర్వేదంలోనూ యితర వైద్యములలోనూ ఫలానారోగము అని నిరూపించుకుని దానికి మందు వేస్తారు హోమియోపతి వైద్యము యొక్క పద్ధతి ఏమిటంటే మనిషినంతటని పరిశీలించటములో (treats the patients and the disease) యితని మనోవైకల్యము ఎల్లాఉంది శరీరములోని రోగము యొక్క లక్షణము ఎట్లాఉంది యీరకంగా అనేక విధములుగా సమగ్రంగా తెలుసుకుని దానికి మందు వేసే పద్ధతి హోమియోపతి వైద్యము (It has not only clinical but also mental symptoms) రోగికి యున్న ఆ particular వ్యాధి నిర్ధారణ కాకుండా ఆయన యొక్క మనస్సు శరీరములోని యితరపరిస్థితులుగూడ ఆలోచించి మందుయివ్వాలి ఈహోమియోపతిక్ వైద్యవిధానమునకు భారతదేశములో 8 రాష్ట్రాలలో యింతవరకు recognition యిచ్చారు కాని మనము అనుకునే పద్ధతిలలో వాటిని దోవలోనికితీసుకుని వెళ్లలేదు భారతదేశములో కంతటికీ పశ్చిమబెంగాల్ రాష్ట్రములో యీవైద్యము చాలా ప్రాధాన్యతను సంపాదించింది ఆరాష్ట్రములో statutory Bill ను పెట్టుదామని అనుకున్నారేగాని ఇంతవరకు ఏదీరాలేదు అయితే అక్కడ General Council ఒకటి State faculty Board అనేది ఒకటి పెట్టి Colleges కు Hospitals కు, Dispensaries కు Curricula of Examination for registration of practitioners faculty of medicine కు అప్పజెప్పారేకాని State recognition యింకారాలేదు బొంబాయిలో 1951 సంవత్సరములో ప్యాసుచేసిన యాక్టులో State recognition యిచ్చారు కాని యింతవరకు దానికి సంబంధించిన rules తయారుచేయకపోవడమువల్ల అది అమలులోనికి రాలేదు U P లోకూడా 1951 వ సంవత్సరంలో ఒకయాక్టు ప్యాసుఅయింది కాని అక్కడకూడ Rules ను పెట్టి అమలులోనికి తీసుకునిరాలేదు మధ్యప్రదేశ్‌లో State recognition ఉన్నదికాని ఇంకా అది అమలులోనికి రాలేదు హైదరాబాదులో Board of Registration అని ఒకటి పెట్టారు కాని ప్రభుత్వము యొక్క డిపార్టుమెంటుక్రింద

ఒకపద్ధతిలో నడిపించ బడడములేదు Travancore Cochin లో qualifications regulate చేసి registration కు మాత్రము provide చేశారు ఇవికాకుండా అస్సాములోనూ బరోడాలోనూకూడ ఉన్నట్లుగా తెలుస్తున్నది వాటి యొక్క ప్రణాళిక నాకు తెలియదు భారతదేశములో 8 హోమియోపతి వైద్యమును బోధించే ప్రైవేటుసంస్థలున్నవి అయిదు కలకత్తాలోనూ ఒకటిమద్రాసులోనూ ఒకటి లక్నోలోనూ ఒకటి మనఆంధ్రదేశములోవున్న గుడివాడలోనూ ఉన్నది Practitioner s institutional training అయినవారు భారతదేశమున కంతటికినీ మొత్తము 1050 మంది మాత్రమే యున్నారు untrained and unqualified గా practice చేసేవారు అంటే ఏలాంటి training లేకుండా practice చేసేవారు 50 వేలు మొదలు 75 వేలదాకాఉన్నారు అలాటివారు నూటకి 60 మందిదాకా బెంగాలులోనే ఉన్నారని చెబుతున్నారు పశ్చిమ బెంగాలులో faculty register అయినవారు 6 401 మంది U P లో 2 018 మందిఉన్నారు ఇది హోమియో పతి వైద్యానికి సంబంధించిన విషయము

ఇక మూడవది యూనానీ వైద్యము ఉన్నది ఇదికూడ ఆయుర్వేద వైద్యమువంటిదే కొంచెము ఎక్కువగా హకీములు యీ యూనానీ వైద్యము చేస్తూ ఉంటారు అదికూడ ఆయుర్వేదముతో సమానముగా గౌరవించదగినదే దానిని recognise చేయటానికి మనము నిర్ణయించాము ఇన్నింటికీ మధ్య మూర్తిరాజుగారు ఉన్నారు ఆయనకు ఉన్న జబ్బు ప్రకృతి వైద్యమువల్ల తగ్గి కుటుంబములో ఎల్లలుకలిగి వృద్ధికివచ్చి శరీరము బాగుపడ్డదట కాబట్టి ప్రకృతి వైద్యము చాలామంచిదని ఆయనకు గట్టినమ్మకము కలిగిందట అందువల్ల ప్రకృతి వైద్యముకూడ ముందుకు తీసుకుని రావాలని అంటున్నారు ఆయన చేసే డిమాండు యిది ఒక్కటే

SRI R B RAMAKRISHNA RAJU — ఈ ప్రకృతి వైద్యము మంత్రిగారు అవలంబించారా ?

THE HON SRI K VENKATA RAO — అది నేనుకూడ అవలంబించానుగాని లాభంలేదని నేను వదిలిపెట్టాను దీనిని వైద్యము అనకూడదని మూర్తిరాజుగారి కోరిక కాని వీటినన్నిటినీ కలిపిన తరువాత దీనినికూడ అన్నింటితోబాటు వైద్యముఅని అనకతప్పదు

Naturopathy teaches you how to correct improper eating habit and how to use food in a very scientific manner ఆయన సిద్ధాంతాన్ని తీసు కుంటే తినే తిండిమీదనే ఆధారపడడం, ఫలాహారకం భోజనమే చెయ్యాలి, అలా

చేస్తేనే ఈ జబ్బు కుదురుతుంది అనే సిద్ధాంతం The proper food purifies blood and supplies the material with which the body develops blood opens nerves and tissues Under expert advice surprising results are realised కాబట్టి వారు చెప్పిన ప్రకారము ఏమనగా అయినా సరియైన భోజనముచేస్తే శరీరములో ఉన్న రక్తనాళములు మాంసాదులు అన్నీ బాగుపడి పనిచేస్తాయని అంటున్నారు "The elimination of waste and marbid matter in the body is increased' అంటే శరీరంలో ఉన్న జబ్బుచేసే కల్మషపదార్థములన్నీ బైటకు నెట్టివేస్తుందని అంటారు The seuvers of the body are cleaned అనగా రక్తనాళములు బాగుపడతాయి Constipation పోతుంది చర్మం చాలా బాగుపడుతుంది ఇలాంటి results ను యిస్తుంది యీ ప్రకృతివైద్యము ఇది యిందులోని విషయము "Nature cure methods have been used since time immemorial In India the use of natural agencies is as ancient as we can think of అంటే యిది చిరకాలమునుంచి భారతదేశములో జరుగుతూ వస్తున్నది తరువాత fasting అంటే ఉపోష్యము River bathing— నదులలో స్నానము sun bathing— ఎండలో సూర్యాస్నానము యిలాంటివి కూడా ఎప్పటినుంచో అమలులో ఉన్నవి Nature alone possesses the power of healing and this healing power of nature resides within the body by which it always makes war against the disease అసలు శరీరములో ఉన్న వ్యాధిని బైటకు వెళ్లగొట్టే శక్తిగల పదార్థములు ఉన్నవి వాటివల్ల బాధపడే రోగులు మందులు అక్కరలేకుండా శరీరాన్ని బాగుచేసుకోవచ్చును అనే నమ్మకము కలగబట్టి యీ ప్రకృతి వైద్యముకూడా చాలామంది అవలంభిస్తున్నారు అందువల్ల దీనినికూడ యీ బిల్లులో చేర్చాము ఈ బిల్లును మొట్టమొదట ప్రచురించాము దీనికి ఏమైనా ఆక్షేపణలు అభిప్రాయములు ఉంటే ఒక నెల లోపుగా తెలుపవలసిందిగా కోరాము చాలా విషయాలు చాలాచోట్లనుంచి పంపించారు ఇరవై రోజులుగా వాటి నన్నింటినీ సంపుటీకరించి ఇండియాలో మనము అనుకునేటటువంటి సిద్ధాంతాన్ని అమలులోనికి తీసుకునివచ్చే కొన్ని ముఖ్యమైన మార్పులను అంగీకరించడమైంది అసలు ప్రధానమైన మార్పు ఏమిటంటే మొట్టమొదట బిల్లుకు Indigenous system of medicine అని పేరు పెట్టాము ఇప్పుడు ఆపేరు తీసివేశాము ఎందుకంటే Native అనే పదము పెట్టేటట్లైతే ఎవ్వరికినీ కష్టముగాఉండదు అంటే మనము స్వతంత్రులము స్వతంత్రము సంపాదించుకున్నవారము గనుక 'Native' అనేదానికి బదులు 'Indiginous" అనేపదము ఉపయోగిస్తే కొంచెము ఆంధ్రులకు గౌరవప్రదముగా ఉంటుందని గర్వమైన అర్థంయిందులోనుంచి స్ఫురిస్తుందని కొంతమందికి తోచ

డంవల్ల మనదేశములో ఆయుర్వేదమునకు చాలా అభిమానము ఉన్నందున ఆయుర్వేదం అనే పదమును యీ బిల్లులో ప్రధానస్థానమిచ్చి అందుకు తోడు యూనాని ప్రకృతి అనే పదములుకూడా చేర్చాము Legal గా కూడా ఆయుర్వేదము అనేమాట అవుతుందిగనుక దానికి ఆ పేరుపెట్టాము Legal name Ayurvedum తరువాత Homeopathy తరువాత మెంబర్లలో కొంతమంది ఆయుర్వేద వైద్యము చేసేవారు ఉన్నారు కాబట్టి వారిని తృప్తిపరచడానికి యీ బిల్లుయొక్క యిదివరకటి స్వరూపము మార్చాము

మద్రాసు రాష్ట్రములో registration కాకుండా యితరరాష్ట్రాలలో ప్రభుత్వంగుర్తించిన రిజిష్టరులో పేరువుంటే అది మన రిజిష్టరులోకూడా చేర్చుకుంటామని చెప్పాము అంతేకాకుండా మేము యింకొకచోట చదువుకుని వచ్చినందువల్ల మమ్ములను చేర్చుకోవడములేదు అనేమాటకూడ రాకుండా చేశాము ఇదివరకు A Class అని B Class అని C Class అని మూడుతరగతులు ఉండేవి అందులోది చివరిది (c) క్లాసు తీసివేసి పై రెండు తరగతులనే ఏర్పాటు చేశాము అంటే Institutions లో చదివేవాళ్లను A క్లాసువారని మిగిలిన వాళ్లను B Class వారని ఏర్పాటుచేశాము కాని courses లో ఏమాత్రము తేడాలేదు బిల్లులో కొత్తగా పెట్టిన క్లాజు మీరుచూస్తే అది అర్థమవుతుంది A Class list లో ఎటువంటివారిని చేర్చుకోవాలి ఎటువంటి పరీక్షలు పెట్టాలి అనే విషయాలన్నీ కొత్తగా స్థాపించబోయే బోర్డుచేతులలో పెట్టుతున్నాము అందుచేత ఎవరూకూడ బాధపడనక్కరలేదు ఈ రోజున వైద్యాలంకార అని వైద్యవిద్వాన్ అని భిషగ్రత్న అని యీ విధరిగా బిరుదులు సంపాదించిన వారిలో ఎవరు గొప్పవారో అది నన్ను తేల్చమని అంటూ ఆ పేర్లు చేర్చమని యీపేర్లు చేర్చమని నన్ను బాధపెట్టితే లాభములేదు దానికే Ayurveda Board అనేది పెట్టబడుతున్నది Register చేయుటానికి ఎవరైతే అర్హులో ఎవరుకారో అది పరిశీలించటానికి ఆ బోర్డు ఉంటుంది ఎటువంటి Schools, Courses పెట్టాలి ఏలాగు training యిచ్చి యీ దేశములో ఆయుర్వేదము వగైరాలకు గౌరవ ప్రపత్తులు సంపాదించాలి అనేవాటిని పరిశీలించడానికి ఆబోర్డు ఉంటుంది ఎవరైనా ధరఖాస్తు పెట్టుకుంటే ఆ బోర్డు ఎవరినైతే సిఫార్సు చేస్తుందో ఆయా సిఫార్సులను అనుసరించి ప్రభుత్వం ఉత్తరువులు యిస్తుంది ఈ విషయములన్నియు సక్రమంగా నడిచిపోతాయి ఇకపోతే వచ్చిన తగువు అల్లా ఎక్కడంటే ముఖ్యంగా authenticated certificates యిచ్చే విషయములో ఈ certificates మేముయిస్తామంటే మేముయిస్తాం అంటారు ఈ మనిషికి జబ్బుగాఉందని యీమనిషికి యీవిధమైన గాయము తగిలించని

యింకను కోర్టుముందుకువెళ్లి వ్యవహారాలు సెలవలు తెచ్చుకోటానికి యీలాంటివి మామూలుగా యిచ్చే certificates విషయములో యీ రోజున రాష్ట్రములో ఉన్నపరిస్థితులు గుర్తించాలి ఈ రోజున అలాంటి Certificates Allopathy Doctors యిస్తేనేగాని వారియొక్క కష్టములనుబట్టి వ్యవహారము చేయటానికి వీలుండదు ఎవరికైనా జబ్బుగాఉన్నదని అయనకు 15 దినములు సెలవుయివ్వాలని certificate యిస్తే ఆవ్యక్తి సాయంకాలమునకు Tennis Court లో కనబడితే అలాంటప్పుడు ఏమిచేస్తారని అంటే యీవ్యక్తికి జబ్బు నిజమేనా అని పరిశీలించటానికి ప్రస్తుత పరిస్థితులనుబట్టి Allopathy advanced Science కాబట్టి ఆవ్యక్తిని వెంటనే Medical Board కు వెళ్లమని చెపుతున్నాము విశాఖపట్టణములో Medical Board ఉన్నది అందులో Special ప్రవీణత సంపాదించినవారు ఐదుగురో ఆరుగురో ఉంటారు వారు సంపూర్ణమైన పరీక్షచేసి యిప్పుడు యిచ్చిన certificate నిజము అవునో కాదో తెలుసుకోగలిగినవారు ఉద్యోగి వారివల్ల పరీక్షించబడుతాడు అయినప్పటికినీ మనము యింకా ఆ స్థాయికి రాలేదు కానిముందు ముందు తప్పక ఏస్తుంది ఈ distinction పోగొట్టి వేస్తాము కాని దానికి సరియైన మార్పు చూస్తే బాగాఉంటుందికాని ఊరకనే గాలికి అందరిని వెళ్ళగొట్టడము న్యాయముకాదు ఈరోజున చాలామందిమిత్రులు నన్ను press చేస్తున్నప్పటికినీ ఉన్న పరిస్థితిని అంగీకరించే పరిస్థితిలో ప్రభుత్వం లేదు దీనివల్ల ban అనేది మాత్రంపెట్టడం లేదు ఈరోజున కోర్టువారు డాక్టరు యిచ్చిన certificate అంగీకరిస్తూంటే వద్దు అనేస్థితిలో యీశాసనసభ లేదు కాని అధికార రూపకంగా మాత్రము యివ్వటానికి లేదు అనే భేదాభిప్రాయం ఒకటి మిగిలిపోయింది ఇప్పుడు వచ్చే amendments అన్నీ ముఖ్యంగా యీ సమస్యమీదనే వస్తాయి మరొక విషయము Herbanivms యింకా యితరమందులు వైద్య సంస్థలు తయారుచేస్తే అవి అమ్ముకోటానికి License తీసుకోవాలని అంటున్నాను అందుకు registration అవసరమంటున్నాను ఎవరి మందు వారు నూరుకుని తయారు చేసుకునివచ్చి రిజిష్టరు చేయమని అంటే కష్టముగాదా? దాని విషయములోనే పద్ధతి మార్చాము ఎవరిమందు వారు నూరుకుని ఏచ్చి ఎవరి యిష్టమువచ్చినవారివద్ద వారు వైద్యము చేసుకోవచ్చు కాని మందులు తయారు చేసుకునివచ్చి బజారులో అమ్మటనికిమాత్రం licence కావాలి అని ఉన్నది Society ని రక్షించాలిగదా! Allopathy వైద్యానికి Control Act ఉన్నది అదే విధముగా దీనికికూడా control పెట్టవలెనని ప్రభుత్వోద్దేశ్యము లేకపోతే అసలు అమెరికాలోనే యిలాంటిది సాగకపోతే యిక మనభారతదేశములో మాత్రం సాగుతుందా? ఏదో ఒకమందు నూరుకునివచ్చి మకరధ్వజం అని చెప్పితేస్తే అది

gold తో తయారు చేసిందా లేదా అనే ఒక test ఉండవలసిన న్యాయం ఉన్నది గదా ? అందవల్ల అల్లం జీలకర్ర వగైరాలు మందులలోనికి అవసరముంటాయి ఇవి చిల్లర కొట్లల్లో అమ్ముతారు వాటికి మాత్రం License అక్కరలేదని బిల్లులో మార్పుచేస్తూ revised section ఒకటి provide చేశాము

ఇప్పుడు ఈ బిల్లుయొక్క స్వరూపం మనవిచేశాను ఈ సెక్షన్లుచూస్తే ఆయుర్వేదం హోమియోపతి టిబ్బి యునాని ప్రకృతిసిద్ధాంతములను ప్రభుత్వం గుర్తిస్తున్నదని తెలుస్తుంది Practitioners ఔషధశాలలు stores, vendors వానినికూడా గుర్తించి register చెయ్యడానికి teaching institutions recognize చేసి Degrees, Diplomas Certificates ఇవ్వడానికి ఏర్పాట్లు చెయ్యడానికి 24 మెంబర్లు గల్గినట్టి Advisory Board 11 మెంబర్లుకల్గినట్టి Homeo Board పెట్టడం కొంతమందికోరిక కొందరు వేరేబిల్లు పెట్టవలెను అని అంటున్నారు ముందు Registration జరుగవలెను కనుక మొదట Board Nominate చేస్తారు తరువాత Board ను దాని Law ప్రకారం election కు వప్పచెపుతాము అయితే దానిమీద కొందరుసభ్యులు University వారికి Local Board లకు ఎందుకు ప్రాతినిధ్యం ఇస్తున్నారని విమర్శిస్తున్నారు శాసనసభ్యులు రేపుప్రొద్దున్న వారి గౌరవాన్ని వారు రక్షించవలెను వారియొక్క అవసరం చాలా ఉన్నది అందువల్ల వారిని పెట్టవలసిఉంటుంది తరువాత Practioners గురించి చెప్పినాను ఇంకా ఒక విషయము Prohibition of Practioners by unregistered men after 5 years అనేది చాలమంది 5 సంవత్సరముల practice అనంతరము register లో పేరు వ్రాయించుకొనకుండా practice చేస్తున్నారని తమందరికి తెలుసును పల్లెటూరుకు వెళ్లితే Penicilin పొడుస్తూఉంటారు Ex compounder, Ex male nurse, Ex female nurse అందరూకూడా డాక్టర్లు అయినారు ప్రజలను రక్షించడానికి నేను ఈ విషయములో చాల గట్టి stand తీసుకొనడానికి దానిని పెట్టినాను Research కోసము Government of India రెండవ పంచవర్ష ప్రణాళికలో 19 లక్షల 50 వేలు పెట్టాయి మన ఆంధ్రలో లక్ష్మీపతిగారి సలహా ప్రకారం మనముకూడా గ్రాంట్లు ఇవ్వాలని దరఖాస్తులు పెట్టేము మనముకూడా Research Institute పెట్టవచ్చును Ayurveda Expert Committee వారు college పెట్టవలెనని report లో వ్రాశారు ఈనాడు కాలేజీపెట్టే సామర్థ్యంలేదు 60 70 లక్షలుకావలెను ఇప్పుడు దేశములో రెండు Institutions ఉన్నవి వాటిని recognize చెయ్యవచ్చును కాని ఏపద్ధతిమీద ఏ curricula మీద అనేది బోర్డుకు వప్పచెపుతున్నాం బోర్డువారు సిఫార్సుచేస్తే వాటిని recognize చేసి వాటిలోనుంచి వచ్చిన graduates ను బైట పెట్టవచ్చును అలాగే హోమియోపతికికూడా ఒకటి

Sri A Kaleswara Rao] [16th August 1956

చెప్పిన ... వేదంలోపాటు ఆయుర్వేదం ఉన్నదని భాగవతంలో చెప్పారు ...మ ...థనం చేస్తూఉంటె సముద్రంలోనుంచి పాలకడలిలో ధన్వంతరి అమృత కలశం తెచ్చేడని జరామరణరహితం అయినట్టి అమృతంకూడా సంపాదించి ...ట్ల మన గ్రంథాలు చెప్పుచున్నవి అంత ప్రాశస్త్యం రోగవిధానము రోగం రాకుండా చెయ్యడానికి మన భరతవర్షం వేలకొలది సంవత్సరాలనుంచి ఉన్నది దానిని ఆయుర్వేద వైద్యంలో అనేక గ్రంథకారులు ఉన్నారు సిద్ధనాగార్జునుడు ఒక గొప్ప ఆయుర్వేద మహాపండితుడు ఆయన 4000 సంవత్సరాల పూర్వం వాడు అవి వారి జాతకకథలో వ్రాసిఉన్నది అంతెకాకుండా మన దేశంనుండి ఇతర దేశాలకు కూడా ప్రాకింది

అంతేకాకుండా ఆయుర్వేదాన్ని మన భారతవర్షము ఇతరదేశాలకు కూడా పంపించినది మన అమరావతి విశ్వవిద్యాలయం నలంద తక్షశిల అనేవి వుండేవి తక్షశిలనుంచి ఈజిప్టుకు గొప్ప ఆయుర్వేదాచార్యుణ్ణి పంపారు ఈజిప్టులో టాలమికాలములో ఆయుర్వేద పీఠము స్థాపింపబడినది అంతేకాకుండా 13—14 శతాబ్దాలలో మన భారతదేశమునుంచి వైద్యశాస్త్రాలన్నికూడా అరబ్ దేశాలకు పోయినాయి అక్కడ అరబ్ భాషలోనికి పర్షియాభాషలోకి తర్జుమా అయినాయి అదే యునాని అయింది ముస్లిం ప్రభుత్వం ఇక్కడ ఏర్పడినతర్వాత ముఖ్యముగా మొగల్ రాజ్యము ఏర్పడినతర్వాత అక్కడవుండే పర్షియా అరబ్ దేశాలలో వుండే టటువంటి సంబంధమువల్ల దానిని మళ్లీ భారతదేశానికి తీసుకొచ్చారు కాబట్టి అటువంటి దానిని మెకాలే 1833 సంవత్సరంలో ఒక విద్యావిధానము ఏర్పాటు చేసిన తర్వాత భారతదేశ దురదృష్ట వశాత్తు పాశ్చాత్య సామ్రాజ్యవాదులక్రింద వారి బానిసత్వం క్రింద కృంగినటువంటి కాలములో 1833వ సంవత్సరంలో విశ్వవిద్యాలయాలు పెట్టడంలో వైద్యవిధానాన్ని నాశనముచేసి Director of Public Instruction Surgeon Gernal ను రాష్ట్రాలలో వేసి మా ఆయుర్వేదాన్ని నాశనముచేశారు మనమిపుడు ఇంగ్లీషువాండ్లను వెళ్ళగొట్టినప్పటికీ ఆ బానిస mentality మనలను ఇంకా పట్టుకుంది కాంగ్రెస్ ప్రభుత్వాలు వచ్చాయి రాజగోపాలాచార్లవంటి సుప్రసిద్ధ రాజ్యాంగవేత్త వున్నటువంటి కాలములో కూడా ఏమి జరుగలేదు పాపము పానగల్ రాజామాత్రం ధైర్యంగా ఒక ఆయుర్వేద పాఠశాలను స్థాపించాడు ఆయనఒక్కడే Govt School of Indian Medicine ను ధైర్యంగా స్థాపించినవాడు కాబట్టి యీ ఆయుర్వేదాన్ని పునరుద్ధరించడానికి పూనుకోవాలి ఈవేళ చాలమంది ఆయుర్వేద వైద్యంవల్ల బ్రతుకుతున్నారు ఆయుర్వేదంలో రెండుభాగాలున్నాయి పరిషత్తులలోకూడా వుంది 'నూరుసంవత్సరాలు కోరుకోమనండి ఆరోగ్యముతో వుండి అట్టి శరీరము అటువంటి విచక్షణలో వుండేటట్లు కోరుకోండి మాకు బుద్ధి

లము యివ్వవలసి వుంది ఇది మన నాగరికతయొక్క పునాదిగా ఏర్పాటు చేసుకున్నారు పాపము రుక్మిణీ లక్ష్మీపతి గారు ఏదో నాలుగు కళాశాలలు పెట్టాలని ప్రయత్నం చేసినది తర్వాత ఒకబోర్డును పెట్టింది ఇంతలోగా ఆప్రభుత్వం పోగానే అది సొంతమైపోయింది ఎన్నోసార్లు Composite Madras State లో చెప్పుకొన్నా లాభము లేకపోయింది Board మాత్రమే ఒక కమిటీవేసి ఒక report యిచ్చింది హైదరాబాదులో ఒక ఆయుర్వేద కళాశాల వున్నదో లేదో నాకుతెలియదు అది కళా వెంకట్రావుగారు చెప్పాలి Travencore లో మాత్రము కళాశాలవుందని నాకుతెలుసు అక్కడ డాక్టర్ లక్ష్మీపతి గారు పనిచేస్తున్నారు ఆంధ్రప్రభుత్వం యీ ల క్ష్మీపతి కమిటీ సిఫార్సునుబట్టి వైద్య కళాశాలకు కోటిరూపాయల పైచిలుకు ఖర్చుచెస్తున్నారు అంతాకూడా Allopathy కి ఖర్చుపెడుతుంది ఆయుర్వేదానికి ఏమిఖర్చు పెట్టడంలేదు ఇదివరకు జాతీయ నాగరికతకు పునాది అయినటువంటి శాస్త్రము ఊరకే సంస్కృతమంటున్నారు కొండెక్కిఎక్కి దిగుతున్నారు అక్కడినుంచి సంస్కృత విద్యార్థులు కూడా లేచిపోతున్నారు అని complaints వస్తున్నాయి చదువుకోకముందు కారకాయ చదువుకున్న తర్వాత టాకరికాయ అయిందనే మాదిరి సంస్కృతము చదువుకున్న ఆ కొద్దివిద్యార్థులు లెకుండ పోతున్నారు ఇపుడు చాల ఆయుర్వేద పుస్తకాలు వ్రాస్తున్నారు అటువంటప్పుడు కొన్నిలక్షలు ఖర్చుచేసి అయినా ఒక ఆయుర్వేద కళాశాలను పెట్టుకోక పోవడము చాల శోచనీయము కొన్ని ఆయుర్వేద సూత్రాలున్నాయి అవి preventive measures 1926 సంవత్సరంలో మేము Council లో వున్నపుడు ఒక Surgeon general అన్నాడు ఆయుర్వేదానికి recognition యివ్వడమంటే the clock of civilisation ను 150 సంవత్సరాలు వెనుకకు తీసుకపోవడమని చెప్పారు నిజమే 150 సంవత్సరాలు వెనుకకు తీసుక పోవలసిందే ఈ 150 సంవత్సరాలు విదేశ సామ్రాజ్యవాదుల క్రింద వచ్చినటువంటి దాస్యము దుఃఖము దారిద్ర్యము అజ్ఞానము పోవడానికి వెనుకకు పోవలసిందేనని చెప్పవలసి వచ్చింది యీ ఆయుర్వేద ఆందోళన దేశంలో జరుగుతున్నది ప్రతిదానికి అభ్యంతరము వస్తున్నది ఇపుడు అలాంటి అభ్యంతరాలు లేవుకాని యీ పంచవర్ష ప్రణాళిక ద్వితీయ పంచవర్ష ప్రణాళిక వచ్చేటప్పటికి Director of Medical Services వస్తాడు వాండ్లంతా మేమే వైద్యులమంటున్నారు Allopathy వైద్యులంతాకూడా ఆయుర్వేదమందులవల్ల రోగాలు chronic complaints-కుదురుకున్నాయి ఇపుడేమిచేస్తున్నారు ఈ Allopathy వైద్యులు? ఏదో చీటిమీద వ్రాసి ఈమందులు బజారులోకిపోయి తెచ్చుకోండి అంటున్నారు చాల ఖరీదైనమందులను ఆ medical storesలో కొనవలసివస్తుంది

A Kaleswara Rao ]　　　　　　　　　　[ 16th August 1956

ఇప్పుడేవో సెప్టామైసిన్ అప్పెన్సోరకాలువచ్చాయి ఈదౌర్భాగ్యస్థితిలోనికి మనదేశం వచ్చింది ఆయుర్వేదసూత్రాలను పునరుద్ధరించడము చాల ముఖ్యం ప్రొద్దున లేవ నే ముఖము కడుగుకోవటం మనవాండ్లకు నేర్పాలి నేనొకసారి Train లో travel చేస్తూవుంటే పాపమొక యువతి పల్లలను ప్రొద్దునే Bed coffee పుచ్చుకోమంటుంది ఆమె ఒక tamil యువతి ఆమె చీరె కట్టుకొన్నటువంటిదే ఆమె ఒక Major యొక్క భార్య ఈఆరోగ్యసూత్రాలకు ఒక ఆరోగ్యకళాశాల పెట్టవలసిందె దాని డబ్బులేదన్నారు కళా వెంకటరావుగారు ఏమిచేయలేకుండ పోయినా చివరకు ఒకబిల్లుపెట్టారు ఇందుకు నేను వారిని అభినందిస్తున్నాను విషయం ఏమిటంటె ధైర్యంగా ఆయుర్వేదిక్ అనేమాట ఉపయోగించారు దానికమాత్రం కళా వెంకటరావుగారిని అభినందిస్తున్నాను నా కేమిటంటె ఆయుర్వేదాన్ని ఇంకొకదానిని కలిపేటటువంటి ఈ Act నాకు ఇష్టములేదు హోమోపతి—ఇవన్నీ విదేశపద్ధతులు మంచికే కావచ్చును వాటివల్ల ఉపయోగముపుండవచ్చును ఆయుర్వేదము ఈగడ్డలో పుట్టింది ఈగడ్డలో పెరిగింది దానికోసమని ప్రత్యేకమైన Act వుంటే బాగుండేది ఐనప్పటికి ఆయుర్వేదమనేమాట వున్నందుకు నేను వారిని అభినందిస్తున్నాను ఇప్పుడేదైనా Board పెట్టుతారు ఆ Board composition ఏమిటి ? ఆ Board లో హరిజనులను పెట్టాలనో ladies ను పెట్టాలనో ముస్లిమ్‌లను పెట్టాలనో ఈవిషయాలు మామూలుగా వస్తుంటాయి అది ఒక పెద్దవిషయంకాదు ముఖ్యమైనటువంటిది ఏమిటంటే ఒకబోర్డు పెట్టుతున్నారు ఆ Board కు qualification అని ఒక chapter యిచ్చారు బాగానేవున్నది ఆబోర్డుచేసేది ఏమిటంటే ఎవరైనా schools పెట్టుకుంటే ఆయుర్వేద schools కాని కళాశాలలుగాని పెట్టుకుంటె recognition ఇస్తుంది గవర్నమెంటుకొంతgrant యిస్తుంది ఇదిఒకstep in the right direction ఈబిల్లులోGovernment ఒక్కదమ్మిడీ ఖర్చుపెట్టుతామనిగాని –grants ద్వారా తప్ప—లేక ఒకకళాశాల పెట్టుతామనిగానిలేదు ఆఖరుకు రుక్మిణీలక్ష్మీపతిగారి scheme ఐనా లేకుండావుంది ఇక మిగిలినదేమిటంటే register of medical practitioners అని పెట్టారు దానిలో ఒకటో రెండో చిన్నచిన్న సవరణలు చేసుయిచ్చాను ఎందుకంటే 40 ఏండ్లయినతరువాత పరీక్ష అక్కరలేదు తక్కిన వాళ్లంతా పరీక్ష pass కావాలన్నారు ఐతే నేను చెప్పింది ఏమిటంటే చాల ప్రసిద్ధమైన వైద్యులున్నారు 40 ఏండ్లు వుండినా 40 ఏండ్లలోపున వుండినా ఇదికూడా ఒక clause గా పెట్టవలసివుందని అన్నాను • అట్లాగే A Class పెట్టే దానిలోకూడా ప్రసిద్ధమైన వైద్యులను యీ Board కనుక recognize చేస్తే అటువంటి వాండ్లను A Class లో చేర్చాలి దీనిని ఎంతవరకు అంగీకరిస్తారో ప్రభుత్వంయొక్క విద్యామంత్రిగారియొక్క దయ అంతకంటె నేను చేయ

గల్గింది ఏమీలేదు అందులో నేను Party Member ను నుక వారు నిశ్చయించి నది ఒప్పుకొనో లేకపోతే withdraw చేసుకుంటాను దానిని గురించి ఆలోచించ మని వారిని కోరుతున్నాను కనుక యీబిల్లు ఇంతవరకు వచ్చినందుకైనా ఆయుర్వేదమనే ఒక్కమాట ఉపయోగించినందుకైనా యీ బిల్లు వెళ్లినంతవరకూ బాగానే వున్నది బిల్లులో recognition పెట్టడము recognized అయినవాండ్లు వున్నారని దేశంలో ఒక ప్రతిష్ఠగా వుంటుంది అంతకంటే ఏమీలేదు నేను Health Minister గారిని కోరేది ఏమిటంటే ఆరోగ్య సూత్రాలు అయుర్వేద సూత్రాల ప్రకారం ప్రొద్దున్నే ముఖము కడగాలని చెంబుపట్టుకొని యూరంగా పోవాలని స్నానము చేయాలనేటటువంటివి చేయమని కోరుతూ యీ బిల్లు తెచ్చి నందుకు వారిని అభినందిస్తూ నాచిన్న సవరణను తర్వాత చెప్పుతాను ఇది ఇష్ట ముంటే ఒప్పుకోవలసింగని కోరుతూ విరమిస్తున్నాను

-

SRI B RAMA REDDI —ఉపాధ్యక్షు మహాశయా మొట్టమొదట ఒక విషయం చెప్పదలచుకొన్నాను ఆదరించేవారులేక ప్రభుత్వ సహాయంలేక అట్టడుగున పడిఉన్నటువంటి భారతీయ వైద్య విద్యా విజ్ఞానాన్ని ప్రకాశ వంతంగా చేయుటకు ప్రయత్నించినందుకు ముఖ్యంగా మన Planning Minister గారిని అభినందించవలసియున్నది ఈ విషయములో చాల ఆలోచించి ఏ విధమైన లోటుపాటు లేకుండా ఈ బిల్లును ప్రతిపాదించు చున్నారని అభినందిస్తున్నాను కాని కొన్ని సూచనలుమాత్రం నేను వారికి చేయదలచు కొన్నాను వంశపారంపర్యంగా వైద్య విధానములో ఎక్కువ ఆసక్త అనుభవం ఉన్నవారికి ఈ 40 ఏండ్లు 10 సంవత్సరాల అనుభవం అని పెట్టడం వారికి అవమానంగా ఉంటుంది కబట్టి సుప్రసిద్ధమైన వైద్యులు వంశానుగతంగా వైద్యం చేస్తున్నప్పుడు వారిపిల్లలు ఎక్కువ ప్రజ్ఞావిశేషాలు కలిగినవారు అనేకమంది ఉన్నారు అట్టివారికి 10 ఏండ్లు అనుభవం ఉండవలెనని చెప్పితే బాగుండునేమో గాని ఆటువంటివారికి వయోపరిమితి నిర్ణయించినపుడు 20 30 ఏండ్లు ప్రజ్ఞా విశేషాలు ఉన్నవారికి ఇది ప్రతిబంధకంగా ఉంటుంది కాబట్టి 10 ఏండ్ల అనుభవం ఉంచి 40 ఏండ్ల వయోపరిమితిని తీసివేస్తే బాగా ఉంటుందని వారికి చెప్పు తున్నాను ఆయుర్వేదివైద్య విశిష్టతను గురించి వారు చెప్పినపుడు అందులో ఆసవారిష్టములను ఆయుర్వేదంలో ఒకభాగంగా మంచిపద్ధతిగా పెట్టుకొన్నపుడు ఆసవారిష్టాలమీద ఒకవిధమైన నిషేధం ఉంచడంకూడ బాగాఉండదని మనవిచేస్తు న్నాను ఏవైద్యవిధానంలో అనుభవంఉంటుందో వారు ఆవైద్యవిధానముచేగాక అనేక ఆయుర్వేదవైద్యులు injections ఇవ్వడం పెట్టుకొంటున్నారు కాబట్టి

Sri B Rama Reddi ] [ 16th August 1956

ఉభవ రాష్ట్ర్యంవల ఇది చెడుపుచేస్తుంది కాబట్టి వారు ఆలాచేయకుండా వాంఛిస్తి నిషేధం పెట్టితే బాగుంటుందని మనవిచేస్తున్నాను ఆయుర్వేద వైద్య విధానం Homeopathy వైద్యవిధానం చెప్పారుగాని ప్రకృతి వైద్యవిధానం అనేది అన్నివిధాలా ఆయుర్వేద Homeopathy విధానాలకు పత్యవిధానంలో గాని మరి ఏవిధానాలలోగాని భేదించి ఉన్నప్పుడు దానికి సరియైన representation లేనప్పుడు ఒక మెంబరునుమాత్రం పెట్టేదానికంటే వారుకోరినట్లు దానికికూడ ప్రత్యేకమైనబోర్డు ఏర్పాటుచేస్తే బాగుంటుందేమో అని ఈవిషయాలను వారి యొక్కదృష్టికి తెస్తూ ఈబిల్లును ప్రవేశపెట్టి దేశానికి వైద్యులకు సేవచేసినందుకు మరొకసారి వారిని అభినందిస్తున్నాను

SRI N C SESHADRI —ఉపాధ్యక్షా వైద్యశాఖామంత్రిగారు ప్రవేశపెట్టినబిల్లును నేను బలపరుస్తున్నాను చాలరోజులుగ ఆయుర్వేద Homeopathy practise చేస్తూ ఉండేటటువంటి వైద్యులు నానా ఇబ్బందులకు గురి అయి గవర్నమెంటు recognition లేకుండా బాధలు పడుతూవచ్చినారు అయితే వీరందరిని కూడ ఈరోజ రిజిస్టరుచేసి ఏదో క్రమమైన పద్ధతులలో ఈ వైద్య విధానాన్ని అంతానడిపించ పూనుకొన్నట్టి వైద్యశాఖామంత్రిగారిని ఈసందర్భం లో అభినందిస్తున్నాను అయితే ఈబిల్లుకు సంబంధించినంతవరకు కొన్ని చిన్న భేదాభిప్రాయాలు ఏర్పడుతున్నాయి మొదట publish చేసిన draft బిల్లులో చాలమట్టుకు సవరణలు జరిగినాయిగాని ఇంకా కొన్నికొన్ని చిన్నచిన్న సవరణలు మిగిలిపోయినాయి అవి అంత పెద్ద సవరణలుకావు మంత్రివర్గం దీర్ఘంగా ఆలోచించినట్లయితే వాటిని ప్రవేశపెట్టడానికి అనుకూలంగా ఉంటుంది ఈసందర్భంలో నేను 2 3 చిన్నసవరణలు ఇచ్చాను వాటిని గురించి మాత్రం

THE HON SRI K VENKATA RAO —ఒకమాటు general discussion లో సవరణమీద మాట్లాడడం మొదలుపెట్టితే ఈ బిల్లు ఈవేళ అవదు సవరణలు ఇచ్చినవారు సవరణలు వచ్చినపుడు మాట్లాడవచ్చు

SRI N C SESHADRI —General discussionలో నేఅవి అన్నీ మాట్లాడ దలచుకొన్నాను

THE HON SRI K VENKATA RAO — సవరణలు వచ్చినపుడే మాట్లాడాలి

Mr DEPUTY SPEAKER —General discussion లో 5 నిమిషాలే చాలమంది మాట్లాడేవారు ఉన్నారు ముగింపు చేయండి సవరణలు ప్రతిపాదించండి

16th August 1956 ]

SRI N C SESHADRI — ఈ Homeopathy practitioners కు సంబంధించినంతవరకు ఒక ప్రత్యేకమైనబోర్డును ఏర్పాటుచేసి వాండ్లందరిని రిజిస్టరుచేయవలెననే టటువంటి ఉద్దేశం ఈబిల్లులో కనపరచినందున మంత్రిగారిని అభినందిస్తున్నాను తర్వాత ఈ Homeo వైద్య విధానంలో recognition కు సంబంధించినంతవరకు A, B schedules కు సంబంధించినంతవరకు వారు clear గ institutions ను mention చేయకుండా ఉండడంవల్ల కొంతఇబ్బంది ఉంటుందని నేను భావిస్తున్నాను ఆయుర్వేద వైద్యానికి సంబంధించి నంతవరకు వారు G C M L I M మొదలైనటువంటి కోర్సులు schedule లో mention చేశారు అయితే ఈ Homeo వైద్యవిధానం impart చేస్తూ చాల institutions కొన్ని గవర్నమెంటు recognise చేసిఉన్నప్పటికి కూడ ఈ schedule లో clear గ కనపరచలేదు

THE HON SRI K VENKATA RAO — గవర్నమెంటుచే recognise అయినటువంటి Statutory institutions భారతదేశంలో ఎక్కడ ఉన్నా దానిలో ప్యాసు అయినవారిని తీసుకొనడానికి అభ్యంతరంలేదని చెప్పాను అవి ఉంటే మెంబరు practical గ suggest చేయడం మంచిది

SRI N C SESHADRI —చాల సంతోషం గవర్నమెంటు recognise చేసిన Institutions ను కూడ ప్రభుత్వం recognise చేస్తామని చెప్పారు కాబట్టి దాని విషయంలో ఎక్కువగ భేదాభిప్రాయం మనకులేదని భావించవలసి ఉంటుంది

SRI CH S R V P MURTHY RAJU —అధ్యక్షా ! మన భారతదేశంలో ప్రకృతి వైద్యాన్నిగురించి దేశీయ వైద్యాన్నిగురించి ప్రథమ చట్టాన్ని తీసుకొనివచ్చిన శ్రీ కళా వెంకటరావుగారికి నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను ఇదేకాకుండా ప్రకృతివైద్య సిద్ధాంతాన్ని మన భారతపిత అయినటువంటి గాంధి మహాత్మునకు ఎక్కువగ ప్రోత్సహించి చివరవరకు తీసుకొనిరావడానికి కాలం సరిపడకపోవుటవలన వీలులేకపోయింది ఇప్పటికైనా వారి సిద్ధాంతాలను వారి శిష్యులైన మనము శ్రీ కళా వెంకటరావుగారు అందరము మరచిపోకుండా ఉంచినందుకు చాల సంతోషం ఈ ప్రకృతివైద్య సిద్ధాంతాన్నిగురించి ఎక్కువగ చెప్పవలసిన అవసరం లేదు ఎక్కువగా ఈ బిల్లులో ఉన్నటువంటి పరిస్థితులనుబట్టి చూస్తే ప్రకృతి వైద్యాన్ని అన్నిటితోపాటు సమానంగా చూచినందుకు చాల సంతోషం ప్రకృతివైద్య చికిత్సా విధానాన్నిగురించి అందరికి తెలియకపోయినప్పటికికూడ సరియైన ప్రాతినిధ్యం ఇచ్చినందుకు చాల సంతోషం ప్రాతినిధ్యము అంటే, బోర్డులో ఒకసీటు ఇచ్చారని చాలమందికి కష్టంగా

Sri Ch S R V P Murthy Raju] [16th August 1956

ఉన్నప్పటికీ దానివల్ల నేనేమి బాధపడడంలేదు అసలు ప్రాతినిధ్యం వచ్చిన తర్వాత ఏ చికిత్స అయినప్పటికీ ఏ విధానం అయినప్పటికీ దానికిఉన్న శక్తిని బట్టి పైకిరావలసిందే తప్ప ఈమెంబర్లనుబట్టి వస్తుందని ఎక్కువబాధపడడంలేదు కాని సాధ్యమైనంతవరకు ఈబోర్డు resolution తీసుకొనేటప్పుడు ఏవైద్యానికి ఆవైద్యం వారు చెప్పినదానికే ఎక్కువ విలువ ఇవ్వడం చాల ముఖ్యావసరం దీనికి గవర్నమెంటువారు సరియైన నిర్ణయం తీసుకొంటుందని ఆశిస్తున్నాను ఈ వేళ మన ఆంధ్రదేశంలో ప్రకృతివైద్యము ఇతరరాష్ట్రాలకంటే ఎక్కువ ప్రచారంలోవుంది అందులో ముఖ్యంగా పశ్చిమగోదావరి జిల్లాలోని భీమవరం ప్రకృతి ఆశ్రమం సంగతి మన ఇండియాలో అందరికి తెలిసిన విషయం అక్కడ అనేక రోగులకు చికిత్సచేస్తున్నారు ఈసిద్ధాంతాలలో ఆరోగ్యం ముందు చూసుకోడానికి కావలసిన విధానాలను ప్రచారంచేయడం ఎక్కువలాభంగా ఉంటుంది కాబట్టి అది ప్రచారంచేస్తూ దానికి కావలసినఆహారనియమాలు ఒకపద్ధతిలోఉండడంకోసం నిర్ణీతం చేసి ఏర్పాటుచేస్తే రోగాలురాకుండాపోతాయి ఇతరదేశాలనుండివచ్చే మందుల కంటే మనకుసహజంగాఉండే శక్తివిషయాన్నిగురించి ఆలోచించుకోవడంమంచిది ప్రకృతివైద్య సిద్ధాంతాలనుగురించి fundamentals అన్నీ ఎక్కువగ మన కళా వెంకట్రావుగారు చెప్పారు ఎక్కువకాలం తీసుకోకుండా ఇటువంటి బిల్లుకోసం ఎక్కువ చర్చలు అక్కరలేకుండా ఇది pass చేయడానికి support చేయడమే కాకుండా ఇకముందు మనకు కావలసింది తల్లులను ఆరోగ్యవంతులనుగా చేసినట్లయితే పిల్లలకుకూడ ఆరోగ్యం తప్పకుండా ఉంటుంది కాబట్టి ఆహార నియమాలు ప్రత్యేకంగా గర్భిణీ స్త్రీలకు సరియైన పద్ధతులలో ఏర్పాటుచేయడం అన్ని వైద్యాలకు ముఖ్యం కాబట్టి ఇకముందు అన్నివిధానాలు ఈబోర్డులో చర్చించడానికి వీలుంది ఎక్కువకాలం వృథాచేయకుండా ఈ బిల్లును ఏకగ్రీవంగా ఆమోదించడమే కాకుండా పూర్తి సహకారం చేస్తామని చెప్పి కళా వెంకట్రావుగారికి ధన్యవాదాలు అర్పిస్తూ విరమిస్తున్నాను

SRI VAVILALA GOPALAKRISHNAYYA —అధ్యక్షా! దేశీయ వైద్యమును ఒకస్థాయిలోనికి వచ్చేందుకు వీలుగా ఈనాడు బిల్లును తీసుకువచ్చిన శ్రీ వెంకట్రావుగారిని అభినందిస్తున్నాను

ఇది ఆయుష్కు సంబంధించిన వేదంకాబట్టి దీనిని ఆయుర్వేదం అంటున్నారు భారతదేశంలో ఈ ఆయుర్వేదం చాలా మార్పుచెందింది దీనిని వ్యాపారంగా చేసినవారున్నారు దీనిపేరు చెప్పుకొని జీవించేవారున్నారు దీనికోసం నిరంతరం కృషిచేసి ఆహుతి అయిపోయినవారుకూడా అనేకమంది ఉన్నారు ఒక

నూతనాధ్యాయమును ప్రారంభిస్తున్న ఈ సమయంలో మనం శక్తివంతంగా కృషి చేయవలసిన అవసరంఉన్నది పానగల్ రాజాగారు మంత్రిగా వున్నప్పుడు తీసుకు వచ్చిన దేశీయ వైద్య విద్యావిధానాన్ని పాఠశాలలలోనూ కళాశాలలలోనూ ప్రారంభించినారు కాని దేశంలో ఉన్నటువంటి ఆధునిక వ్యామోహంతోపాటుగా ప్రజలకు ఇంగ్లీషువైద్యంమీదకూడా వ్యామోహం బయలుదేరింది ఈ విషయం యిప్పుడు చెప్పకపోయినట్లయితే నేను న్యాయం మాట్లాడలేదేమో అనుకుంటాను కొందరు తమకు Diploma కావాలని కోరి ఉపయోగించవలసి వచ్చినప్పుడు ఆయుర్వేదం అనేపేరుతో ఇగ్లీషుమందును ఉపయోగించడం దేశానికి ద్రోహం చేయడమే అవుతుందని ప్రభుత్వానికి తెలియచేస్తున్నాను

ఈనాడు ఆయుర్వేదము నభివృద్ధి చేయవలసిన బాధ్యత ముఖ్యంగా ఆయుర్వేద వైద్యులమీదనే వుంది ప్రపంచమంతా మంచి ఉన్నత స్థాయిలోవున్న ఇంగ్లీషువైద్యులతోపాటు ఆమందులుచేయడంనేర్చుకొని పెద్ద doctor ను అనుకునే వారు కొంతమంది ఉన్నారు ఈబిల్లును తీసుకురావడానికి ఉపకరించిన ప్రజాభిప్రాయం శాశ్వతంగా ఉండాలన్నట్లయితే తప్పకుండా ఆయుర్వేదాన్ని అభివృద్ధి చేయాలి ఏదైనా అత్యవసరపరిస్థితులలో ప్రథమ చికిత్సగా ఇంగ్లీషుమందును ఉపయోగిస్తే నాకు అభ్యంతరంలేదు

నేను ఒకసారి జబ్బుపడి ఆసుపత్రిలోవుండగా ఇంగ్లీషుమందువల్ల నాకు ఆరోగ్యంచేకూరలేదు నేను నవరతకేశి పంచకర్మ సిద్ధాంతం ప్రకారంయిచ్చే treatment పొందుతాను నన్ను హాస్పటలునుంచి relieve చేయండి అని doctor గారిని అడిగాను

You want that matty అన్నారు ఆడాక్టరుగారు అయితే నిజవాబుదారీ మీద విడిచిపెడతాను వెళ్లు అన్నారు

నేను "నాజవాబుదారీమీదనే permission ఇవ్వండి అనివెళ్లి దేశీయవైద్యం పొందినాను ఆమందు నాకు జబ్బుతగ్గించి నాకు దీర్ఘాయువునిచ్చింది నేను 3 సం॥లు అన్నంతినకుండా ప్రకృతివైద్యంపొందినాను

నేను ప్రకృతిమాతకే కృతజ్ఞత తెలియజేయవలసివుంటుంది ఇంచుమించు ప్రతివారి జీవితంలోను యిటువంటి ఘట్టాలుంటాయి యూనానివైద్యం ప్రకృతి వైద్యం ఉన్నది హోమియోపతి వైద్యం ఒక స్థాయినందున్నది హోమియోపతివైద్యాన్ని చాలా తేలికగా ఆలోచిస్తారు అందువల్ల చాలా నష్టంవుందని మనవిచేస్తున్నాను దానియొక్క అసలుసిద్ధాంతాన్ని తీసుకోకుండా ఏదోఒక

Sri Vavilala Gopalakrishnayya] [16th August 1956

పుస్తకంకొని దానిని ఆధారంచేసుకొని వైద్యంచేయడం ప్రారంభిస్తే చాలా ప్రమాదముందని మనవి చేస్తున్నాను

మామందు వాడండి రోగాన్ని నయంచేస్తుంది అంతకన్నాచెడుగు ఏమీ చేయదని ఆవైద్యులుచెబుతారు

Chemical process లో పొరపాటుంటే చెప్పలేము కాని ఒకరసాయన మును వాడినప్పుడు అది మంచిచేయకపోతే చెడుచేసేస్వభావంవుంది

హోమియోపతి యునాని రెండూ కలిపి దేశీయవైద్యంక్రింద చేసినారు హోమియోపతి చాలాఉత్తమమైనది భారతదేశమే ప్రప్రథమంగా తిసుకువచ్చింది భారతదేశంలో హోమియోపతి వైద్యులు చాలామంది ఉన్నారు

మనవైద్యులు రణవైద్యులుకూడా వున్నారు భారతదేశంలో ఈవైద్య మును ఉన్నతస్థాయికి తీసుకురాగలిగినప్పుడే శాసనసభలో ఈబిల్లు ప్రవేశపెట్టిన గౌరవం నిలుస్తుంది ఆయుర్వేదానికి ప్రత్యేకమైన స్థానంఇచ్చి ఏవిధమైన పొర పాట్లు లేకుండా దానిని అభివృద్ధిలోకి తీసుకురావాలని మిత్రులందరినీ కోరుతూ ప్రభుత్వాన్ని అభినందిస్తూ ఈ బిల్లును బలపరుస్తున్నాను

(At this stage Mr Speaker resumed the Chair)

SRI RAJA V V KRISHNAM RAJU BAHADUR —అధ్యక్షా ! ఆంధ్రదేశంలో ఆయుర్వేదవైద్యాన్ని పునరుద్ధరించుటకుగాను మనమంత్రివర్గంలోని గౌ॥ శ్రీ కళావెంకట్రావుగారు బిల్లును ప్రతిపాదించిన సుదినమిది ఈ ఆయుర్వేదం భవిష్యత్తులో మంచి అభివృద్ధిచెంది ఆదర్శవంతంగా ఉండాలని ప్రజలు వాంఛి స్తున్నారు

పూర్వకాలంలో మనదేశంలో ఈ ఆయుర్వేదం విజ్ఞానవేత్తలచేతనూ ఋష్యాదులద్వారానూ సద్ధీకరించబడి తద్వారా దేశవ్యాప్తంగా అమలులోకి వచ్చి అగ్రస్థానంవహించింది మనదేశం పరరాజుల చేతిలో కొంతకాలం వుండుట వలన అన్నివిధాలా అడుగంటి పోయింది ఇప్పుడు ప్రజారాజ్యం యేర్పడినందు వలన మన దేశాభివృద్ధికొరకు ఈవైద్యాన్ని పునరుద్ధరింపచేస్తున్నందుకు చాలా సంతోషిస్తున్నాము వర్తమానకాలంలో ఆయుర్వేదం హోమియోపతి కూడా కావాలని నేను మద్రాసు ఉమ్మడి రాష్ట్రంలో వుండగా చెప్పాను మానవునికి ఆరోగ్యం ప్రధానం ఏదైనారోగం వచ్చినట్లయితే ఆరోగంఎట్టిదో తెలిసికొని దానిని నిర్మూలించుటకు తగిన సావకాశం ఒక్క ఆయుర్వేదంలో మాత్రమే వుందని ఘంటాపథంగా చెప్పగలను

ఎలోపతిలోని శస్త్రచికిత్సలో వారికి తగిన రాజపోషణ వుండుటవలనవారు ఉన్నతస్థాయికి వచ్చారు రోగాన్ని తెలుసుకోవడం దాన్ని నిర్మూలించుటకు తగినమందు ఫలానా అని ఈ drugs, medicines వచ్చిన తర్వాత తప్ప అంతకు ముందు Allopathy లో natural గా రోగాన్ని నిర్మూలించుటకు తగినమందు లేదనే చెప్పాలి ఈరోజున ఆయుర్వేదాన్ని మనం ప్రజారంజకంగా అమలు చేస్తున్నందుకు ప్రజానీకం సంతోషిస్తున్నది ఈ రెండు విధావాలద్వారానే సమస్త రోగములను నివారించుటకు అవకాశముంటుందని నా అభిప్రాయం ఈ బిల్లును తీసుకువచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను

హోమ్యోపతి అంటే ఏదో క్రొత్తగావచ్చింది అనుకొంటారెమోగాని అది ఇదివరకే ఉన్నది మొట్టమొదటగా ఆయుర్వేదంలో సుశ్రుతుడు అనేవాడు ప్రతి దానికి కూడా ఓషధిమూలంగానే వైద్యాలు ప్రారంభించాడు ఇటీవల బసవరాజు వచ్చినతరువాత రసగంధకాలతో వైద్యం ప్రారంభించాడు అంతెగాకుండా రోగ నిదానంలోను నివారణ విధానంలోనుకూడా మన Pathology అంతా సక్రమంగా ఉన్నది ఇదివరలో ఋష్యాదులద్వారా మనం గ్రహించిన గ్రంథాలను తీసుకొని పరదేశస్థులు వాటిని ఆచరించి అగ్రస్థాయికి వచ్చారు కాబట్టి నాంది మన ఆయు ర్వేద మేనని చెప్పకతప్పదు సాధారణంగా మందుఅంటే ఒక చైతన్యశక్తి చైతన్య శక్తి ఏదైన లోపించితే దానిని తిరిగి శరీరంలో ప్రవేశపెట్టడమే దానియొక్క సిద్ధాంతము అందులో బయోకెమిక్ అనేది ఒకటి పంచభూత భూయిష్టమైనటు వంటి భౌతికనిర్మాణమే బయోకెమిక్ యొక్క సిద్ధాంతము ఆ బయోకెమిక్‌లో 12 క్షారాలు ఉన్నాయి ఆ 12 ఉప్పులద్వారానే ఈ భౌతిక శరీరంయొక్క ఉత్పత్తి జరుగుతుంది దానిలో ఉండే లోపాలవల్లనే రోగాలకు కారణం అవుతోందనే ఉద్దేశ్యంతో తిరిగి దానిని పూర్తిచేయుటకు బయోకెమిక్ సిద్ధాంతముద్వారా సామాన్యంగా వైద్యం చేయబడి రోగం నివారించబడుతోంది దానివల్ల పూర్తిగా రోగనివారణ జరుగుతోంది మరియు చాల తక్కువ డబ్బుతో ఎక్కువమందికి మందులు సరఫరా చేయడానికి అవకాశం ఉంటుంది సిద్ధాంత రీత్యా చూస్తే ఆయుర్వేదానికి హోమ్యోపతికి చాల సన్నిహిత సంబంధం ఉన్న దని చెపుతున్నారు ఆయుర్వేదంలో ఉండే సుశ్రుతునియొక్క సిద్ధాంతాన్ని పుచ్చు కొనే ఆనాడు హానిమన్ ప్రప్రథమంగా ఈ సిద్ధాంతాన్ని స్థిరీకరించి ప్రపంచ వ్యాప్తం చేశారు అట్టి పరిస్థితిలో ఈ రోజున ఈ సభావేదికమీద మన మంత్రిగారు హోమ్యోపతిని ఆయుర్వేదాన్నికూడా దేశవ్యాప్తంగా అమలు చేయడానికి అవ కాశం ఇచ్చారు ఇది ఆయనయొక్క ఆశీస్సులవల్ల దేశవ్యాప్తంగా ప్రజారంజ కంగా అమలు జరుగుతూ బీద ప్రజలందరికి అందుబాటులో ఉండి, అందరికి

ఆరోగ్యాన్ని చేకూర్చుతుందని ఆశిస్తున్నాను ఆరోగ్యం మీదనే దేశం యొక్క భవిష్యత్తు ఆధారపడి ఉన్నది గనుక దానికి అమూల్యమైన అవకాశం ఇచ్చినందుకు వారిని అభినందిస్తూ ఇది అంతా సక్రమ పంథాలో జరగాలని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

Mr SPEAKER —I shall now put the motion to the vote of the House The other Members who wish to participate in the debate may speak when the clauses of the Bill are taken up for discussion There is no need for a reply by the Hon Minister as he has received only encomiums The question is

'The Andhra Ayurvedic and Homeopathic Medical Practitioners Registration Bill, 1956 be taken into consideration

The motion was carried

Mr SPEAKER – There are no amendments to clauses 2 and 3 So I shall put them to the vote of the House straightaway

Clause 2 was put and carried

Clause 3 was put and carried

*Clause 4*

Mr SPEAKER — Motion moved

That clause 4 do stand part of the Bill

SRI T JIYYAR DASS — Sir I move

'After sub-clause (1) (d) of clause 4, add the following representing ladies, Harijans and other unrepresented interests '

అధ్యక్షా మొట్టమొదటగా మంత్రిగారు ఈవిషయాన్ని గురించి ప్రస్తావన చేసినపుడు వారివద్దనుంచి సరైన ఒకఅభిప్రాయంగాని లేక హామీగాని వస్తుందేమోనని ఆశించాము మద్రాసువారి G O క్రింద నిర్మించినటువంటి Central Board లో 9 సంవత్సరాలు నేను సభ్యుడుగాఉన్నాను Board నిర్మించిన ౨ సంవత్సరాలకు elections జరిగినాయి ఆ election లో అక్కడ ఉన్నటువంటి సభ్యులలో సమాన సంఖ్యవారు వచ్చారు ఒక్కరుమాత్రం ఎక్కువఅయ్యారు ఎక్కువఉన్నటువంటి సభ్యుడు హరిజనులకొరకై ఉపసంహరించుకొన్న కారణంచేత సభ్యత్వంలభించింది అటువంటి హరిజనులు అనువంశికంగా సుప్రసిద్ధంగా సంస్కృతము నేర్చుకొని గురుకులసిద్ధాంతంప్రకారం ఆయుర్వేదాన్ని అభ్యసించినవారనేకులు register లో కూడా ఉన్నారు కాని అల్పసంఖ్యాకులుగాఉన్న కారణంచేత హరిజనులు స్త్రీలు,

ఇంకా ఇతరంగా శాస్త్రప్రావీణ్యత కలిగినవారు election లో రాలే మోనన్న భీతితో నేను ఈ సవరణను ప్రవేశపెట్టాను దానిని సభవారందరు ఆమోదించవలేనని మనవి చేస్తున్నాను

SRI N SRINIVASA RAO — అధ్యక్షా వైద్యవిషయంలో జియ్యారు దాసుగారి వైద్యానికి మెచ్చి జగతినే విస్తరిచేయు జియ్యరుదాసు అని ఒక పద్యముకూడ వ్రాశారు అలాగే వెంకటరావుగారికి elections లో తలనొప్పి వచ్చినపుడు Kala Balm ను తయారుచేసి 1935 వ సంవత్సరంలో వారికి నేను present చేశాను అట్లాగే రజిత సాలమిశ్రితేహ్యాన్ని అనేక వందలమంది స్త్రీలకు ఇచ్చుటవల్ల వారికి సంతానప్రాప్తి కలిగింది అట్లాంటివాళ్లు రాజకీయాలలోపడి డబ్బులేక అనుభవం ఉండికూడా అడుగున పడిపోయారు మా తాతముత్తాతల నుంచికూడా వైద్యము ఉన్నది హరిజనులు సంస్కృతము నేర్చుకొని శాస్త్రయుక్తంగా వైద్యం చేశారనేసరికి చండాలప్రవృత్తులైనవారికి సంస్కృతం ఏమిటన్నట్లు కొంతమంది నిశ్చేష్టులై చూస్తున్నారు

'పంచములను వైష్ణవులను విష్ణుభక్తి నరస వైష్ణవుల పూజచేయ ఆళ్వారులైరి మంగయాళ్వారు ఒకమ్లేచ్ఛ అనిఉంది

రామానుజాచార్యులువారు ఈదేశానికి వచ్చినపుడు హరిజనుల దగ్గరకువెళ్లి వాళ్లకు వైష్ణవమతం ఇచ్చి ఆయుర్వేదము సుస్వంతము అంకతంత్రము రణతంత్రము మొదలగు సమస్తమైనటువంటి వైద్య విషయాలన్నీ వారికి నేర్పించారు పల్లెల్లో ఉన్నందువల్ల మీరు మమ్మల్ని దూరముగా ఉంచినప్పటికి మాలో గురువులుగా ఉండేటటువంటివారు పెద్ద వైద్యులు కాకపోయినప్పటికి శాస్త్రోక్తమైనటువంటి రససిద్ధమైనటువంటి వైద్యాలు చేసేవాళ్లు ఉన్నారు ఇప్పుడు హరిజనులకు ప్రతిదాంట్లోను reservation అని అంటున్నారు మా ఖర్మకాలి మాకు ఉండేటటువంటి అనేక కళలలోను చేనేతలోను అట్లానే వచ్చింది చెప్పుల వృత్తిలోను అలాగేవచ్చింది వైద్యంలోను కవిత్వంలోను అలాగేవచ్చింది Cinema Actors లో ప్రహ్మాండంగా పాడేవాళ్లు ఉన్నప్పటికి అక్కడకూడా మాకు నిషేధమే బ్రహ్మయ్యగారికి దొరికిన స్థానం నాకు దొరకలేదు అందుచేత సభ్యులందరూ సానుభూతితో ఆలోచించాలని మనవి చేస్తున్నాను ఈనాడు పల్లెప్రాంతాలలో వేలాది వైద్యులు మాలమాదిగ జాతులలో ఉన్నారనేటటువంటి విషయాన్ని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను ఈరోజున రాయి కల్వము కొనుక్కోలేని స్థితిలో వారుఉన్నారు ఇది చాల స్వల్పఖర్చుతో ఎక్కువమందికి ఉపకారము చేసేటటువంటి వైద్యవిధానం అని తమకు తెలుసు సంచీవిప్పితే

బిల్లు మూస్తె బిల్లు ఎరంజె పైకితీస్తే బిల్లు అనేవిధంగా గాకుండా ఒక్కరూపాయి మందులో వెరాది మందికి వైద్యం చేయడానికి సావకాశంఉంది కాబట్టి దీనిలో ఆ provision కల్పించవలసిందిగా కోరుతున్నాను ఒక నిమిషము అనిచెప్పి రెండు నిమిషాల time ఎట్లా ఇచ్చారో అట్లాగే మేముకోరిన కోర్కెలను కూడా మంత్రి గారు మన్నించి కళాశాలమ్ ను దృష్టిలో పెట్టుకొని ఈసావకాశం కలిపించవల సిందిగా కోరుతున్నాను

SRI V KURMAYYA —అధ్యక్షా! Nominations విషయమై మొన్న నే అంతా వివరంగా చర్చించామని ముఖ్య మంత్రిగారు చెప్పారు 20 సంవత్సరాలకు పూర్వము బెజవాడలో రామమోహన వైద్యకళాశాల క్రింద నోరి వెంకటేశ్వర్లుగారు ఒక పాఠశాల పెట్టారు దానిలో మా ఎల్లలను తీసుకొచ్చి చేర్చబోతే వారు చేర్చుకోలేదు న్యాయంగా ఆయుర్వేదంలో ఎక్కువగుంది పండితులు బ్రాహ్మణులనుంచే వస్తారు హరిజనులలో కొన్ని కుటుంబాలు మాత్రమే దీనిలో ప్రావీణ్యతకలిగి ఉంటారు Recognition ఇవ్వడానికి grant లు ఇవ్వడానికి certificates ఇవ్వడానికి పనికివస్తుంది Healthy convention ను create చేసేటటువంటి పద్ధతే లేదు Unrepresentative communities ను పైకి తేవడానికిగాను ప్రభుత్వము nominations ను పెడుతున్నారు స్వరాజ్యం రాకపూర్వం ప్రతిదాంట్లోనుకూడా nominations లో హరిజనులు ఉండాలనేటటువంటి పద్ధతిఉన్నది అప్పుడు హరిజనులు M L As గా కూడా ఉన్నారు మన కాంగ్రెసు ప్రభుత్వము వచ్చిన తరువాత nominations పద్ధతినే రద్దుచేసినది చాలమంచిదే కాని హరిజనులు కావాలనడంలో తప్పలెదు మంత్రిగారు ఉదారంగా గౌరవంగా హరిజనులలో ఒక member ను వేసినట్లయితే ఆయన అక్కడ కుర్చుని పాఠశాలలో admissions grants మొదలైనవి చూచుకోడానికి వీలుగాఉంటుంది వారంతా ఛాందసులైన పండితులు కాబట్టి హరిజనులను ఆయుర్వేదములోకి రానీయకుండా ఉండుటకు ప్రయత్నాలు జరుగుతున్నాయి కాబట్టి మంత్రిగారిని హరిజనులకు కూడా స్థానముఇవ్వాలని కోరుతూ నాకు ఈ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షుల వారికి నమస్కారములు తెలియజేస్తున్నాను

SRI T G THIMMAIAH SETTY —అధ్యక్షా Reservation విషయము ఒకరకంగా అవసరమేమోనని అన్పిస్తోంది ఇదివరలో నిపుణుల సంఘం నివేదించినపుడు 11 మంది నిపుణులలోను రాయలసీమవారు ఒకరుగూడ లేరు 4 గురు విజయవాడవారు ఇతరులు ఉత్తర సర్కారులవాళ్లే రాయలసీమలో వైద్యులు వట్టిపోయినట్టే అర్థం అవుతున్నది ఇలా ఉన్నప్పుడు రాయలసీమకు

హరిజనులకు ఒక్కొక్క సీటు ప్రత్యేకంగా ఉంచి మిగతా వాటికి వాళ్లనువేస్తే బాగుంటుందని నేను కోరుతున్నాను

THE HON SRI K VENKATA RAO —అధ్యక్షా ఇంక పదేళ్లలో అసలు special representation పోతుంది హరిజనులకు స్త్రీలకు రాయలసీమకు అనేటటువంటిదిఉండదు అమలాపురంతాలూకాకు ఇదివరకుఎప్పుడూ representation లేదు ఇంత పెద్ద కళా వెంకటరావుగారు ఉన్నప్పటికికూడాను ఈ భావాలు మరచిపొమ్మని వారిని కోరుతున్నాను ఇప్పుడు హరిజనులకు representation కావాలంటే minority representations అనా ? ఊరకే మళ్లీ భిషగ్వర్ భిషగ్రాజ భిషగ్అలంకార ఇవన్నీ పట్టుకెళ్లి వారందరికి ఇద్దామనా ! కాదే ! ఇక్కడ ఈ balance ఎక్కడ తప్పుతోందో అక్కడ ఆ balance ను restore చేద్దామనే టటువంటి ఉద్దేశంతోనే Homeopathy లోను దీనిలోను పెట్టకొన్నాము దానియొక్క ఫలితము వీరికి ఉపకారములేకుండా చేయడమనేదికాదు ప్రతిచోట reservation అనేటటువంటిది నాబోటివానికి గిట్టదు అందువల్ల ఇటువంటి పరిస్థితులలో ప్రస్తుతము ఆకళ తీసుకురావటం న్యాయంకాదు హరిజనులకు ప్రాతినిధ్యం కావాలన్నారు ప్రాతినిధ్యంవచ్చేటట్లు ప్రభుత్వంచేస్తుంది తరువాత శ్రీనివాసరావు గారు కళాబామ్ పెట్టారని చెప్పారు ఎప్పుడో నా election లో నా తలనొప్పి తీసివేయడానికా ? కళా వెంకటరావుగారి తలనొప్పి తీయడానికి కళాబామ్ కావలసివస్తే, దేశముయొక్క తలనొప్పి తీసేదానికి ఇంకొక balm కనిపెట్టవలెనని కోరుతున్నాను

Mr SPEAKER —Is Sri T Jiyyar Dass pressing his amendment ?

SRI T JIYYAR DASS — మంత్రిగారు హామీ ఇచ్చినారు కాబట్టి నా సవరణను withdraw చేసుకొంటున్నాను

Sir, I beg leave of the House to withdraw my amendment

The amendment was by leave of the House, withdrawn

Clause 4 was put and carried

Clauses 5 and 6 were put and carried

*Clause 7*

Mr SPEAKER — Motion moved

'That clause 7 do stand part of the Bill '

SRI P RAJAGOPAL NAIDU — ఇందులో పశువైద్యముకూడా చేరిస్తే బాగుంటుందని మంత్రిగారికి మనవి చేస్తున్నాను ఈ ఆయుర్వేదమునకు సంబంధించి పశువైద్యముకూడ దీనిలో ఒకభాగము కాబట్టి పశువైద్యముకు సంబంధించికూడ ఒక Board పెట్టితే బాగుంటుందని మనవి చేస్తున్నాను

THE HON SRI K VENKATA RAO — ఆయుర్వేదంలో పశువైద్యం ఒకభాగమైతే దాన్ని ఇక్కడనే mention చేస్తాము వేరే mention అక్కరలేదు అప్పుడు పశువైద్యము మనుష్యులలో కలిసిపోతుంది

SRI T JIYYAR DASS — Sir I move

'In lines 5 and 6 of clause 7 after the words 'such persons as they deem fit insert the words from that electoral body'

Clause 7 లో nomination of members గురించి ఉన్నది దానిలో వారు nomination చేయడానికి సర్వాధికారాలు ఉంచుకోవచ్చునని అన్నారు ఆ ఖాళీలను భర్తీచేసేటప్పుడు electoral నుంచి రాలేదు ఆ electoral నుంచి తీసుకొని భర్తీ చేయవలెనందని నామనవి దీనిని బహుశ ప్రభుత్వంవారు అంగీకరిస్తారనుకొంటాను

THE HON SRI K VENKATA RAO — అయితే ఒక difficulty ఉన్నది ఇప్పుడు members ను ఎన్నుకోవలెనందని అన్నాము జిల్లాబోర్డులు లేవు అందుచేత ఏదో ఒక nomination చేయాలి 'Such అంటె జిల్లాబోర్డులు లేనిదే ఎవరిని nominate చేయాలి ? అందుచేత అది preventive clause మాత్రమే ఒక extraordinary situation కోసం ఈ clause ఉన్నదిగాని ఇది normal గా జరిగేది కాదు, జరుగదు

SRI T JIYYAR DASS — ప్రమాదవశాత్తు సంభవిస్తే writs కూడా వేసేటటువంటి పరిస్థితులుకూడా వస్తాయేమో అనే భీతిఉన్నది ఆభీతిని నివారించమని కోరుతున్నాను

THE HON SRI K VENKATA RAO —Writs దాకావస్తే అప్పుడు చూస్తాము దానికి ఇంత తొందర ఎందుకు ?

SRI T JIYYAR DASS —Sir I beg leave of the House to withdraw the amendment

The amendment was by leave of the House withdrawn

Clause 7 was put and carried

16th August 1956]

*Clause 8*

Mr SPEAKER —Motion moved

That clause 8 do stand part of the Bill '

SRI T JIYYAR DASS —Sir I move

In line 2 of sub-clause (2) of clause 8 for the word 'three, substitute the word two '

This is very impartant Sir నేను మొట్టమొదటే మనవిచేశాను మనకు పొరుగురాష్ట్రంగా ఉన్నటువంటి మద్రాసురాష్ట్రంవారు ఒక జి ఓ క్రింద ఏర్పాటు చేసినటువంటి బోర్డును వారు ఒక సంవత్సరములోనే ఏర్పాటుచేయాలని అప్పుడు ఉండేటటువంటి పానగల్ రామారాయణంగారు ఇంకాముఖ్యులు అందులో దీనిని రచించినటువంటి captain శ్రీనివాసరావుగారు అవిరళ కృషిచేశారు అయినప్పటికి వారికది సాధ్యం కాలేదు ఆరు సంవత్సరములు పట్టింది అంతే కాదు ఇప్పుడు మనకు ఉన్నటువంటి జిల్లాబోర్డులు కూడా తిరిగి ఎన్నికలద్వారా తెచ్చుకోవలెనని ప్రభుత్వము నిరంతరము కృషిచేస్తుంది కాని అది సాధ్యంకాని విషయము అయితే నేను ఒకటిమాత్రము మనవిచేయాలి దేశంలో ఎక్కడా ఇదివరకు తీసుకురానటువంటి ఒక పెద్ద మహత్తరమైన ఫలితాన్ని శ్రీకళావెంకట రావుగారు నేడు ప్రసాదించారు మొట్టమొదటే వారుచెప్పారు ఈ ఆయుర్వేద మథర్వణ వేదాంతర్గతమని అటువంటి వేదయుగంనాడు అనుభవించినటువంటి దశ ఈనాడు 1956 సంవత్సరంలో బహుశా హిందూదేశం మొత్తంమీద ఆంధ్ర రాష్ట్రానికి దీనిని ప్రసాదింపజేసినటువంటి శ్రీకళావెంకటరావుగారి హయాము లోనే వారిసహాయంతోనే వారికి ఇప్పుడున్నటువంటి హోదాలోనే దీనికి ఒక స్థిరీకరణమైనటువంటి electoral Board రావలెనని నాఆశ ఈ ఆశను నెరవేరుస్తా రని నమ్ముచున్నాను బహుశా రెండు సంవత్సరములుకూడా ఎక్కువకాలముగా ఉంటుంది కాబట్టి ఒక సంవత్సరములోనే దీనిని ఏర్పాటుచేయాలని కోరుచున్నాను

The amendment was duly seconded

THE HON SRI K VENKATA RAO — అధ్యక్షా ఇప్పుడు మూడు ఏళ్లైనా రెండేళ్లైనా ఏడాదైనా ఒక్కటే అప్పుడే registration కాదేమోననేభయంచేత మూడేళ్లు పెట్టాము వారేచెప్పుతున్నారు ఏడాదిలో చేద్దామనుకొన్న పానగల్ మహారాజాగారు ఆరేళ్లదాకా చేయలేకపోయ్యాడని అందుచేత నేను దాంట్లోసగము మూడేళ్లని పెట్టుకొన్నాను వెంకటరావుగారికి అభిమానం ఉన్నమాటనిజమే వారు చెప్పిన పొగడ్తలు పొగడ్తలక్రిందనే తీసు కొన్నా తీసుకోకపోయినా, నేను ఈ మూడేళ్లదాకా Health Minister గా

ఉంటానో ఉండనో తెలియదు అసలు హైదరాబాదు వెళ్లినతరువాత అక్కడ Minister గా కూడా ఉంటానో ఉండనో తెలియదు ఒక వేళ ఉండడమె గనుక తటస్థించినట్లయితే Health Minister గా ఉంటానోలేదో! అందువల్ల ఇప్పుడు point ఏమిటంటే registration అయిపోతే గవర్నమెంటు ఎప్పుడుపడితే అప్పుడు అమ్ముకోవచ్చు మూడేళ్లు అట్టే పెట్టాలని ఏమిఉన్నది? ఊరకే period సూచించాము అంతే election అయిపోయి ఈ form forein కు వెళ్లాలి కాని బోర్డుమీద పెట్టిన ఫారాలు ఆలోచించనివారు పూర్తి చేయలేదు Registers అన్నీ తయారు చేయాలి Institutions అన్నీ recognise చెయాలి Circulor ఏర్పాటుచేయాలి ఇవన్నీ abstract చేసి మళ్లీ వెళ్లినట్లయితే పరిస్థితి కొంత శాంతపడుతుంది ఇవన్నీ సమీకరణ అయ్యే ఒక స్థితివచ్చి దానిని ముందుకు తీసుకుపోవాలి అని నా కోరిక నేను ఒకముక్కమాత్రం చెప్పతాను Registration గనుక ఈమధ్యన బాగా complete అయినట్లయితే మా Board ను dissolve చేసుకొనే హక్కు ఉన్నది మేము dissolve చేసుకొని election కు ఇచ్చేస్తాము

SRI T JIYYAR DASS — అధ్యక్షమహాశయా దాన్ని గురించి వాదోపవాదాలు లేవు కాని నాకు ఇంకా ఈ భయము చాలా జాస్తిగానే ఉన్నది ఈ elected Board త్వరగా రాదని వెంకటరావుగారు చెప్పినటువంటి అశ్లీలము ఒకటి ఉన్నది Health Minister గా ఉంటానో ఉండనో అనేటటువంటిది అది అప్రహతితంగా అవుతుంది కాకుండా పోదు నేను ఒకటిమాత్రము చెప్పుతున్నాను మా ఆయుర్వేదం గురించి వారు చెప్పారు ఆయుః ఎంతి ఇతి ఆయుర్వేదః ఆయుర్వేదమంటే ఆయువును గురించి చెప్పే శాస్త్రము శ్రీ కళా వెంకటరావుగారు 125 సంవత్సరములు ఉంటారని ఇకముందుకూడా ఈ ఆరోగ్య విషయాన్నే చూస్తారని మా ఆయుర్వేద శాస్త్రము చెప్పుకున్నది నేను చెప్పేదికాదు ఇది ఆయుర్వేద శాస్త్రము అపౌరుషేయమనికూడ చెప్పుతున్నాను మేము విధించినటువంటిది కాదు అపౌరుషేయమైన శాస్త్రము వారికి ఈ విధముగా విధిస్తున్నది అందువల్ల దీనిని ఒక సంవత్సరం అని మారిస్తే వారిని నేను అభినందిస్తాను

Mr SPEAKER — పోనీ 'not more than three years అనండి

THF HON SRI K VENKATA RAO — దానికి నా అభ్యంతరం లేదని చెప్పాను Not more than three years' అని పెట్టవచ్చును వారిచ్చిన ఆశీర్వచనములను మనస్ఫూర్తిగా స్వీకరిస్తున్నాను 125 ఏళ్లు బ్రతకాలనే ఉన్నది కాని ఎన్నాళ్లు ఉంటానో తెలియదు!

16th August 1956] [Sri K Venkata Rao

I accept the amendment in this way The term may be restricted to not more than three years The sub clause will then read The Board so established shall function for a period of not more than three years from the date of its establishment

Clause 8 as amended was put and carried

Clause 9 was put and carried

*Clause 10*

Mr SPEAKER —The motion is

That clause 10 do stand part of the Bill '

SRI VAVILALA GOPALAKRISHNAYYA —Sir I move

Delete the proviso to clause 10 '

The amendment was duly seconded

THE HON SRI K VENKATA RAO — గోపాలక్రిష్ణయ్యగారి సవరణను నేను అంగీకరించలేకపోతున్నాను 10 వ క్లాజులోని proviso అత్యవసరమని నా అభిప్రాయం

SRI VAVILALA GOPALAKRISHNAYYA —Sir, I beg leave of the House to withdraw the amendment

The amendment was by leave of the House, withdrawn

Clause 10 was put and carried

Clauses 11 and 12 were put and carried

*Clause 13*

Mr SPEAKER —Motion moved

'That clause 13 do stand part of the Bill

SRI VAVILALA GOPALAKRISHNAYYA —Sir, I move

' For the existing clause 13, substitute the following-

'any casual vacancy in the board may be filled up by co-option among the remaining members of the board provided the person so co-opted should represent the system of medicine and the interest whom the vacated member represented and the person nominated or elected to fill up such vacancy shall hold office for the term of his predecessor

THE HON SRI K VENKATA RAO — ఈ సవరణ అనవసరంకనుక నేను వ్యతిరేకిస్తున్నాను

16th August 1956]

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Sir, I beg leave of the House to withdraw the amendment

The amendment was by leave of the House, withdrawn

Clause 13 was put and carried

Clause 14 was put and carried

*Clause 15*

Mr SPEAKER — Motion moved

That clause 15 do stand part of the Bill '

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Sir, I move

For the words such condition of service as may be prescribed in Sub-clause (b) of Sub-clause (2) of Clause 15, substitute the following

'such condition of service as prescribed for the Government servant

Government servents కు ఉండే service rules యీ కమిటీలో ఉండే వారికికూడా వర్తింపజెస్తే అది ఒక హామీగా ఉంటుంది ఆ విధంగాఉంటే బాగా ఉంటుందనే ఉద్దేశ్యముతో నేను యీ సవరణ తీసుకుని వచ్చాను

Mr SPEAKER —The rules will be placed before the House 'Prescribed means prescribed under the rules and they will come to the Assembly

SRI VAVILALA GOPALAKRISHNAYYA —ఆ Rules కాదండీ

Mr SPEAKER — Prescribed means 'prescribed under the rules '

SRI VAVILALA GOPALAKRISHNAYYA —'Prescribed అయినప్పటికినీ, statutary గా వారిని Government Servents క్రిందనే వచ్చేటట్లు మనము ప్రయత్నము చేస్తే అది ఎక్కువ హామీగా ఉంటుందని నాఉద్దేశ్యము అందువల్ల దీన్ని propose చెస్తున్నాను మంత్రిగారు దీన్ని బహుశ అంగీకరిస్తారనుకుంటాను

THE HON SRI K VENKATA RAO — అసలు యీ principle కు నేను పూర్తిగా వ్యతిరేకుడను Government of India వారు ఒకజీతము యిస్తు

న్నారు ఈ ప్రభుత్వం యింకొక జీతము యిస్తున్నారు అందువల్ల పరిస్థితులను బట్టి Medical Board ఎంతమందిని Register చేయగలిగితే అంత ఎక్కువగా డబ్బు వస్తుంది కాబట్టి ఆ Board కు ఉన్న డబ్బునుబట్టి వారు జీతాలు యిస్తారు ఎక్కువగా డబ్బుఉంటే ఎక్కువడబ్బును యిచ్చుకోగలుగుతారు ఒకవేళ Boardకు తక్కువ డబ్బు ఉంటే బీద కుటుంబాలువాగానే పనిచేయాల్సి ఉంటుంది అంతే గాని Board యింకా పుట్టకముందే అంటే Foundation Stone వేసే stage లో strike మొదలు పెట్టితే అసలు యీ వ్యవహారము నడవనే నడవదు అందువల్ల దయయుంచి యిది మామూలు పద్ధతిలోనే పోనివ్వండి

Mr SPEAKER — The question is

For the words such condition of service as may be prescribed in sub clause (b) of sub clause (2) of clause 15, substitute the following

such condition of service as prescribed for the Government servant

The amendment was lost

Clause 15 was put and carried

Clauses 16 and 17 were put and carried

*Clause 18*

Mr SPEAKER — The motion is

That clause 18 do stand part of the Bill

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Sir I move

'For the existing sub clause (1) of clause 18 substitute the following

'(1) There shall be constituted at the commencement of the new Board an Executive Committee of the Board of Ayurveda with seven members

ఇందులో Executive Committee కి బదులు Education Committee అని తప్పుగా print అయింది ఈ తప్పు సవరించాల్సిఉన్నది Executive Committee లో 7 గురు మెంబర్లకు మించకుండా ఉండాలని ఉన్నది ఇంతమంది మెంబర్లు అని నిర్ధారించలేదు అది నిర్ధారణగా యింతమంది అని fix చేసి చెప్పాలి

THE HON SRI K VENKATA RAO — ఆవిధంగా చేయడానికి కారణమేమిటంటే ఇందులో ఉండే vacancies ను గురించి యిందాక మాట్లాడిన difficulty వస్తుందేమోనని దానినిబట్టి fix చేద్దామనే అది రూల్సు ద్వారానే చేయాలి అందువల్ల fix చేయలేదు

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Sır I beg leave of the House to wıthdraw the amendment

The amendment was by leave of the House withdrawn

Clause 18 was put and carrıed

Clauses 19 to 23 were put and carrıed

*Clause 24*

Mr SPEAKER — The motıon ıs

That clause 24 do stand part of the Bıll

SRI VAVILALA GOPALAKRISHNAYYA —Sır I move

"For the word and figure Schedule I ın lıne 3 of sub-clause (1) o clause 24 Substıtute the words and figures Schedule I and II "

THE HON SRI K VENKATA RAO — 'Recognızed by' అని ఉన్నదిగదా ! Schedule II refers to sectıon 27 and not to sectıon 24

Mr SPEAKER —There ıs no poınt ın Mr Gopalakrıshnayya s amendment

SRI A KALESWARA RAO —రెండవ షెడ్యూలులో అయిదవ నోటుకు ఒకటి క్రొత్తగా add చేసినారు తరువాత recognızed ınstitutıons అనేవి ఒకటవ షెడ్యూలులో వచ్చినవి ' Other than recognızed ınstitutıons అని ఉన్నదే అది యేమిటి ?

THE HON SRI K VENKATA RAO —ఇదివరకు ఏమీచేయలేదు ఇప్పుడు రామమోహన ఆయుర్వేద కళాశాలను recognıze చేస్తామనుకోండి అలాంటప్పుడు అదికూడా cover కావద్దా ? అందుచేతనే amendments వచ్చాయి Already recognızed ınstitutıons కొన్ని ఉన్నవి అవి అన్నీ cover చేయటానికి general గా provısıon యీ బిల్లులో పెట్టాము

SRI VAVILALA GOPALAKRISHNAYYA —అసలు అదివరకు ఉన్న ınstitutıons ను గుర్తిస్తే వాటికి సంబంధించినవి చెప్పకపోతే

THE HON SRI K VENKATA RAO — అది ఎట్లాఅవుతుంది? అసలు ınstitutıons మంచివో చెడ్డవో అందులో ఎవరుఉన్నారో ఆ వివరాలకన్నింటికి ప్రభుత్వంవద్ద record ఏమిఉంది? ఈ సంగతులే బోర్డువారిని చూచి చెప్పమని అంటున్నాను మనకు ఆ లిస్టులు ఏవీలేవు ఎన్నిఉన్నవో తెలియదుకాని ఒక

institution మాత్రము ఉన్నది దాని పేరు మాత్రం తెలుసు ఉయితే దానికి buildings ఉన్నవో లేవో అందులో పనిచేయటానికి masters ఉన్నారో లేరో subjects ఏమి చెబుతున్నారో అదిఅంతా తెలియకుండాఉన్న institutions కూడా ఉండవచ్చు అవిఅన్నీ recognise చేయమంటే వీలులేదు అందువల్ల అన్నివిషయాలు విచారించే యీ provision ఏర్పాటుచేశాము ఆ provision ను బట్టి Board వారికి application పెట్టినట్లయితే అప్పుడు వారు recognise చేయమని సఫార్సు చేస్తే ప్రభుత్వం పుచ్చుకుంటుందని అంటున్నానుగదా ! నిజానికి వాటికి అనుకూలంగా చేసనపనికి అదికాదు యింకొకటిఅని చెబితే ప్రయోజనములేదు

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Sir I beg leave of the House to withdraw the amendment

The amendment was by leave of the House, withdrawn

Clause 24 was put and carried

Clauses 25 and 26 were put and carried

*Clause 27*

Mr SPEAKER —The motion is

That clause 27 do stand part of the Bill'

SRI A KALESWARA RAO — Sir, I move

'In sub clause (1) after Sub clause (c), add the fallowing as new sub clause (d)—

(d) who does not possess any recognised qualification but is certified by the Board as being an efficient practitioner of the Ayurvedic or Homeopathic system of medicine

and renumber the exist ing Sub clause (d) as sub clause (e)

(2) omit sub cluse (5) and (6) and the proviso thereunder

ఆయుర్వేద వైద్యం తెలిసనవారు చాలామంది well known people ఉన్నారు దేశములో అందువల్ల నంభై సంవత్సరాలు అనేది తెచ్చి పెట్టినట్లయితే వాళ్లు పరిక్షకు వెళ్లనక్కరలేదని అంటున్నారు ఇప్పుడు ఉన్న వాళ్ళలో చాలా మంది నల్భై సంవత్సరాలకు లోపువాళ్లే వారు వంశపారంపర్యంగా తాతలు తరువాత తండ్రులు తరువాత కుమారులు యీ ఆయుర్వేదవైద్యం చేస్తున్నవాళ్లు ఉంటున్నారు ఇందులో well known people పేరుప్రతిష్టలు గడించినవాళ్లుఉంటే అటువంటివాళ్లనందరిని పరిక్షకు కూర్చునమంటే వాళ్లు పరిక్షకు కూర్చోరు పరిక్షకు కూర్చుంటావా లేదా అంటేకాదు కాబట్టి బోర్డువారికి అధికారంఇవ్వండి అందు

ర్లు 'He who does not possess the recognised qualifications but certified by the Board as having efficient practice in Ayurvedam Homeopathy and Unani system of medicine ఇందులో age question ఎందుకు పెట్టుతారు ? 40 సంవత్సరాలు అయితే పరీక్ష అక్కరలేదని అంటున్నారు కలోపునే వారు పరీక్షకు వెళ్లాలి అన్నమాట అలాంటప్పుడు అతడికి 38 సంవత్సరాలో 35 సంవత్సరాలో ఉంటుంది అందువల్ల మంత్రిగారిని కోరేది అది చేర్చుకుంటే మంచిది గనుక వారు దానిని ఆమోదించమని కోరుతున్నాను న్యాయముకూడా Well known people ఉంటున్నప్పుడు A class వాళ్ళను B class వాళ్ళను తీసుకుంటారు అటువంటప్పుడు వీళ్లనుకూడ తీసుకుంటే మంచిదిగదా దేశములో ఆయుర్వేదము బాగాతెలిసినవారు చనిపోతున్నారు నేను ఆయుర్వేదమండలి సూచననే యిచ్చాను నా స్వంతంగా యేమి యివ్వలేదు అది వారు కోరుతున్న సంగతి కాబట్టి మంత్రిగారి ఇష్టం అంగీకరిస్తే సంతోషిస్తాను

THE HON SRI K VENKATA RAO —దానిలో ఉన్న దల్లా efficiency అన్నది ఎవరు judge చెయ్యడము అనేది ఎలా judge చేస్తుంది ? efficiency బోర్డు ! మా తాతగారు గొప్పవాడు మా ఇంటిపేరు కళావారు చిరకాలం క్రిందట ఎవ్వరో కళలో అభివృద్ధి పొందేరు అన్నమాట అంచేత ఏ ఊరుపేరు లేకుండా కళా అనేపేరు వచ్చింది నాకేమో drawing రాదు కుక్క గీస్తే నక్క అవుతుంది అందుచేత నాదగ్గర కళ అంటే ఏమిప్రయోజనం నేను మనవిచేసేది ఏమిటంటే effic ency అనేది undefined word మనము recognise చేసినపుడు దానిని High States కు pull చేదాం 40 ఏళ్లకు పైనున్న వాళ్ళను పరీక్షకు వెళ్ళమనడం లేదు Board వారు test చెయ్యవచ్చును అదికాకుండా ఈ special వైద్యాలన్నికూడా mention చేసినాము ఏవిధముగా వాటన్నింటిని తీసుకొని రావడమో నాకుతోచడములేదు ఇంకా ఒకమెండుమెంటులో భిషగ్వరా ఇంకా ఏవోకొన్ని recognise చెయ్యమని అన్నారు ఈ list లో 30 పేర్లు ఉన్నవి ఏ test తీసుకోవడమా మరేవిధముగా తీసుకోవడమో తెలియడం లేదు అది చాలకష్టము ఎలక్షనుద్వారా efficiency రాదు Board చేస్తే election అవుతుంది ఇంతవరకూ మద్రాసు list లో ఉన్న వారిని తీసుకుంటున్నాము ఎవరైనా old age లో ఉంటే individual cases గాని general cases కాదు— క్షమించవలెనని కోరుతున్నాను

THE HON SRI A B NAGESWARA RAO —ఎంగా ఏసోకూడా 10 సంత్సరాలు ఉంటేనేగాని Registration కు తిసుకొనలేదు అని కాళేశ్వర రావు గారికి మనవి చేస్తున్నాను

16th August 1956]

SRI A KALESWARA RAO — Sir I am not pressing my amendment

The amendment was by leave of the House withdrawn

SRI S K V KRISHNAVATARAM —Board, examination con duct చేస్తుందని చెప్పేరు మన హెల్తు మినిష్టరు కళా వెంకటరావుగారు

THE HON SRI K VENKATA RAO —Curricula, syllabus అనేవాటిని Board suggest చేస్తుంది Examination స్వరూపం Board వారు చెబుతున్నారు నడిపించడానికి గుమాస్తాలను గవర్నమెంటు పంపుతుంది అంత కంటె ఏమీలేదు

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Sir, I move

For the word forty in line 2 of the proviso to sub clause (c) of clause 27 (1) substitute the word 'thirty "

ఇప్పటికే practitioners చాలామంది ఉన్నారు Efficiency ఉండాలని నేను కూడా అంగీకరిస్తున్నాను పది సంవత్సరాలనుంచి చేస్తున్నవారు age question ఎచ్చినప్పుడు వారా పరీక్షకు వెళ్లవలెనని అనడము చాల కష్టమైన విషయము 10 సంవత్సరాలైనా వైద్యం చెయ్యాలన్నది ముఖ్యం వారిని చేర్చుకొనడానికి 40 కి బదులు 30 సంవత్సరాలు పెడితె చాలా బాగుంటుంది అంగీకరిస్తారని ఆశిస్తున్నాను

THE HON SRI K VENKATA RAO — బాల జ్యోతిషం వృద్ధవైద్యం అన్నారు వైద్యం వయస్సుమీద ఆధారపడి ఉంటుంది సాధారణంగా వైద్యుడు కావాలంటే దరిదాపు 30 సంవత్సరాలు ఉంటెనేగాని అనుభవ వైద్యం రాదు MBBS కోర్సు కూడా 5 6 7 సంవత్సరములు examination ప్యాసు అయేసరికి పడుతుంది అంటే 24 25 సంవత్సరముల వయస్సు వస్తోంది అనుభవం లేనిదే ఈ వ్యవహారం కష్టం ఆయుర్వేదానికి training లేదు 40 సంవత్సరాలు పెడితేచాలు 30 సంవత్సరాల వయస్సు చాలదు వారు చరకం సుస్రుతం చదివి వైద్యానికి కావలసిన మందులు చెయ్యడము రావాలికదా మూడు ముక్కలు కాగితంమీద వ్రాస్తే certificate వస్తుంది కదా! దానికి వారిని M.B B S ప్యాసు కావలెనని అవలేదు వారిని certificate training కావాలని అనలేదే కొంచెం limit చేసి దానిని గౌరవములోకి తీసుకురావలెను We must bring it to a higher status.

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Sir, I am not pressing my amendment

Sri K Venkata Rao] [16th August 1956

The amendment was, by leave of the House, withdrawn

SRI N C SESHADRI —Sir, I want some clarification from the Hon Minister

Whose name is registered in the register maintained by District Collectors of the composite Madras State అని ఒక amendment ఇచ్చినాను అందులో ఏమి ఉన్నదంటే

1952 సంవత్సరంలో వెంకటరావుగారు అక్కడ మంత్రిగా ఉన్నప్పుడు 25 G O issue చేశారు

All the District Collectors have been ordered to mainta in aregister of Homeopaths who are practising for a period of 4 years అని అన్నారు ఈ G O ను consider చేస్తారా అనే clarification కావలెను

THE HON SRI K VENKATA RAO — There is no register maintained according to statute Only we have called for information as to the number of practitioners who are working there because the Government by an earlier G O have permitted the district boards to open homeopathic dispensaries also In order to have a list of persons, it has been done It is not a register in the sense that we have a register here

SRI VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా ఆయుర్వేద కళాశాలలను గుర్తించాలని ఉంది మద్రాసు ఆయుర్వేద కళాశాల Venkateswara Ayurvedic College, బెజవాడ Ramamohan Ayurvedic College, రామకృష్ణా ప్రకృతి ఆశ్రమం బళ్లారి ఆయుర్వేద కాలేజి మైలాపూరు వెంకటరమణ ఆయుర్వేద కాలేజి కొవ్వూరు సంస్కృతకళాశాలలో 2వ సెక్షనుగా ఉన్న ఆయుర్వేదకాలేజి, వీటన్నింటిని గుర్తించవలెనని నాకోరిక

Mr SPEAKER.—Is it your opinion that this should be taken after schedule II is taken up

THE HON SRI K VENKATA RAO — ఈ లిస్టుఅంతా నాకు తెలియదు బోర్డువారు సిఫార్సుచేస్తే మేము చేర్చుకుంటాము ఈ కాలేజీలకు syllabus లేనేలేదు గుంటూరు కాలేజీలో Anatomy, physiology చెప్పడానికి ఫారంకావాలని application పెట్టారు ఇవన్నీ చూసుకొని చేస్తాంఅంటే తగవు పెడితే ఎలాగ చెయ్యడానికి అవకాశం ఇస్తున్నాము

16th August 1956]

SRI T JIYYAR DASS —మంత్రిగారు clarification ఇవ్వాలి ఇపుడు A, B తరగతులు ఉంటవి C తరగతి రద్దుచేసినాము అన్నారు ధన్యవాదాలు అర్పిస్తున్నాను మన అందరము A, B, C తరగతులను జైళ్లలో అనుభవించిన వారమే దానిలో ఉన్న కష్టసుఖాలు మన అందరకు విదితమే C తరగతి కష్టభూయిష్ఠమని దానిని తొలగించిఉంటారు ఆయుర్వేద వైద్యులుకూడా A, B, C విభేదములను మద్రాసు రాష్ట్రము లో అనుభవించినారు ఉమ్మడి మద్రాసువారు సృష్టించిన ఆయుర్వేద Register నందలి A B తరగతి శిక్ష అనుభవించలేమని ఆయుర్వేదమండలి తరఫున అనేక ఆందోళనలు గావించితిమని మనవిచేస్తున్నాను ఉమ్మడి Madras Govt వారు కాగా ఈ A B తరగతులను నిర్మాత Captain Sri G Srinivasa Murthy గారి సమాధానం ఏమిటంటే ఒక Institute లో చదివినవారికోసం అనువంశికముగా వచ్చేవారిలో తరతమభేదాలు కల్పించడంకోసం ఈ ఏర్పాటు చేశాంఅని చెప్పేరు

వీరు శవాలను A' తరగతివారికి ఒప్పగించండి మాకేమి అభ్యంతరము లేదు ప్రాణులుమాత్రం మాకు వదలిపెట్టండి ఎందుకంటే ఆయుర్వేదమనే పదములోనే ఈఅర్థము సంఘటితము చేయబడింది ఆయుర్వేద వైద్యము ప్రాణికోటిని గురించి చెప్పారు ప్రాణుల విషయం మాకు వదలిపెట్టి తిరవలసినదే శవాల విషయం వారికే వదలిపెట్టండి అంటే Injuries and wounds వారికే ఇచ్చుకోమనండి ఆయుర్వేదవైద్యుని పని ఏమిటంటే వ్యాధిగ్రస్తుని రోగమునుండి విముక్తిచేయుట స్వస్థునికి స్వాస్థ్యము చేకూర్చుటమాత్రము అని ఆయుర్వేద శాస్త్రకర్తలు చెప్పారు శ్రీ మంత్రివర్యులు శ్లోకముచదువుతూ ఏమిఅన్నారంటే కాయ బాలగ్రహ ఊర్ధ్వాంగ శల్య జరావృషాన్ అనే వైద్యవిధానములన్ని మాకువున్నాయి ఆ విధానములన్ని ఆయుర్వేదాంతర్గతమని వారేఒప్పుకున్నారు అందువల్ల వీటికి సంబంధించిన certificates యివ్వడానికి మేము సమర్థులమే ఈ అధికారము మాత్రము ఆయుర్వేదవైద్యుల కివ్వవలసియున్నది శవాలనుగురించి, హింసతోకూడిన certificates యిచ్చుట A' తరగతి వైద్యుల కైవశముచేయమని మీద్వారా ప్రభుత్వమును కోరుచున్నాను

THE HON SRI K VENKATA RAO —అధ్యక్షా అసలు మొట్టమొదట publish ఐన బిల్లులో నేను alteration చేసినాను ఇదివరకు as may be provided in the regulations అనేమాటలులేవు Cabinet వారుకూడా compulsory renewal ప్రతిమారు పుచ్చుకోవలసిన అవసరము వుంటుందని అనుకున్నారు కాని దీనిలో ఒకబాధ వున్నది Limited numbers కనుక దానికి ఏదోకొంత fees సంపాదిస్తేనే

కాని వ్యవహారము జరుగదు ధరెకమిటీవారు కూడా యిచ్చిన interim report లో renewal fee ఉండాలని అన్నారు రెండింటిమధ్య మేము settle చేయలేక at such intervals అనే ముక్క అక్కడచేర్చిన కారణం Continuous గా లేదు Renewal fee అనేటటువంటి ముక్కను మేము modify చేశాము అందువల్ల యీ క్రొత్త wording ప్రకారంవుంటే బాగుంటుందని నేను అనుకుంటున్నాను

SRI A KALESWARA RAO —Sir, I move

Omit sub clauses (5) and (6) and the proviso thereunder

Renewal అనేది వాండ్ల medical practitioners Act లో Allopathy వాండ్లకులేదు చచ్చిపోతే notify చేయడము పేరుతీసివేయడమువున్నది అందువల్ల ఒకసారి list లో enter అయినవానిని మళ్లీ renewal చేయాలని వాటికి తెలియక సకాలంలో చెల్లించకపోతే వారిపేరు కొట్టివెయ్యడము ఇదంతా చాల అన్యాయము కనుక renewal అనే పద్ధతే అక్కరలేదు Death వల్ల వాడే పోతాడను నేను accept చేయమని మంత్రిగారిని కోరుతున్నాను

Mr SPEAKER — How do you maintain the Board ? At whose cost ?

SRI A KALESWARA RAO —Government వాండ్లు Allopathy కి యిస్తున్నారు

THE HON SRI K VENKATA RAO —గవర్నమెంటుకు డబ్బులేదు Allopathy Board కు యివ్వడానికి

Mr SPEAKER — The Hon Minister has not answered Mr Jiyyar Dass

THE HON SRI K VENKATA RAO — ఇపుడు classification ఉండేది న్యాయంగాలేదు కాని మన మద్రాస్ Government 1923 నుంచి ఒక policy అవలంబించారు యీ సంవత్సరము మొన్న 15 రోజుల క్రితం మద్రాస్‌లోవున్న Indian School of medicine కి మనము 30 ని select చేసి పంపిస్తున్నాము ఇపుడు వాండ్లకు ఎమిటి ప్రత్యేకత? అదే type దేశంలో వుండాలనే భావంలో ఇంతవరకూ గవర్నమెంటు వుంది ఇపుడు భావము మారుస్తూవున్నాము కాని మార్చినా దానిఫలితము రావడానికి interval వుంది నేనేకనుక వారి ఆశీర్వాదం ప్రకారం 125 ఏండ్లు బ్రతికి మళ్ళీ Health Minister క్రింద వుండడము తటస్థిస్తే రెండుమూడు ఏండ్లలో registration ఐ నేను అనుకొన్న level కు దానిని తీసుకొచ్చినట్లయితే తప్పకుండా

A class వుండవలసిన అవసరంలేదు తర్వాత ఇంకొకటి మీరు సరియైన colleges అమలులోనికి తీసుకొచ్చి సరియైన graduates ను తయారు చేయడానికి తోడ్పడినట్లయితే మీదటినుంచి కూడా మద్రాస్ College of Ayurvedic medicines కు children ను పంపించకపోతే యీ నిషేధము అసలు automatic గా drop ఐ పోతుంది L M Ps ఏమిఐనారు L M P లు list లో నుంచి వెళ్లిపోతున్నారు క్రమేణా అలాగే L I M G C I M లు వాండ్లందరుకూడా ఆ type of training మనరాష్ట్రంలో కనుక తగ్గించుకున్నట్లయితే మద్రాసుకు మనము subsidiy యిచ్చి మనవాండ్లను పంపించక పోయినట్లయితే automatic గా Register (A) eliminate ఐపోతుంది (A) లేనపుడు (B) యెక్కడ వుండేది అందుచేత system of education change చేయకుండా 30 సంవత్సరాలుగా వున్న settled policy ని ఒక్కమాటు గీటు గీచివేయమంటే అది వ్యవహారానికి వ్యతిరేకము? ఊరికే list ను గురించి ఆలోచిస్తున్నారుకాని ముఖ్యంగా ఎందుకండీ చదువుకోవడము Practice చేసుకోవడం అందరికీసమానమే ఈ బుక్కులో వుండనక్కరలేదు రెండవ విషయమేమిటి ఉద్యోగముకావాలని మొట్టమొదట draft చేసిన బిల్లులో ఏమనివుంది? ఉద్యోగానికికూడా B Class కు అర్హతకల్పించలేదు ఇపుడు ఈ amended Bill లో ఉద్యోగానికి అందరికీ అర్హతకల్పించారు అంతేకాకుండా నేను మొట్టమొదట యిచ్చిన statement లో చెప్పినాను ధర్మాకు ఒక Hospital పెట్టుతున్నాము వీరందరికీ ఆస్కారము కల్గించాలని ఇపుడేదైనా డిస్పెన్సరీలో గనుక vacancy వచ్చినట్లయితే L I M కు గాని G C I M కు గాని యివ్వాలని గవర్నమెంటు G O వున్నది ఇపుడు (B) class list లో వుండేవానికికూడా సమానస్థాయిలో ఉద్యోగాలు యిస్తూవుంటే ఇద్దరినీ సమానము చేస్తున్నట్టు కాదూ? Classes అన్నీ ఎందుకోసం వచ్చాయంటే A B కోసంకాదు ఉన్నటువంటి distinction ఏమిటంటే certificates గురించి దానిలోవున్న కష్టమునుకూడా తమకు మనవిచేస్తున్నాను ఇపుడు Allopathy వారికేమో తగ్గించి ఆయుర్వేద వాండ్లనుగురించి యీ section పెట్టినానని మనవిచేశాను అందుచేత ఆబాధ తప్పిపోయింది ఐనా నాగేశ్వరరావుగారు Cabinet member గనుక ఆయన మాతో మాట్లాడకతప్పదు ఆయన approval తో వచ్చినబిల్లే ఇదికూడాను తర్వాత నేను మనవిచేసే విషయం ఏమిటంటే - దానిలో authentic certificate యివ్వడంలో difficulty వుంది ఆయన చెప్పింది నేను quote చేస్తున్నాను ఇపుడు Allopathy Doctor కళావెంకటరావుకు జబ్బుగా వుందని ఒక certificate యిస్తాడు - నేను Tennis ఆడుతూవుంటాను నాకేమో Medical Board కు reference చేయడానికి తగినటువంటి పరిస్థితి ఏర్పడింది అందరూ పెద్దమనుష్యులే

అనుకోవడము పొరపాటు అంతా పెద్దమనుష్యులనే Film కూడా ఉంది దేశంలో 30 వేల మందిని register లోనికి తీసుకొస్తున్నాము తీసుకొచ్చిన ప్రతి వ్యక్తి కూడా కళా వెంకటరావుకు నెల రోజులు సెలవు యివ్వాలనందని చీటిమీద ఆధారపడి వ్యవహారము కనుక చేసినట్లయితే administration లో ఇబ్బంది malingering అంటారు - ఇంగ్లీషులో వస్తుంది ఆ malingering వస్తుందనే ఉద్దేశంతోటి ఇది పెట్టినాము (B) list లో వున్నవారు ఇచ్చిన certificate ఏకోర్టు accept చేయకూడదని ఇక్కడ లేదే వీరు ఇచ్చింది వారు పుచ్చుకోవచ్చును వీరికి ఇచ్చేటటువంటి అర్హతవుందని చెప్పవున్నాము

ఇపుడు L M P లు ఎక్కడ వున్నారు ? Only few are living 20 ఏండ్ల క్రితము వదలిపెట్టివేశారు యీ G C M, L I M course correct అయింది కాదు Correct అయిన ఆయుర్వేదంకాదు కనుక correct ఆయుర్వేదం పెట్ట డానికి ఇపుడు చేస్తున్నాము Automatically it swallows the other thing వారికి సమస్యలో కష్టంగా వుంటుంది ఏమయ్యా నేను (B) Class గొప్ప వైద్యుణ్ణికదా నాకు ఉద్యోగం ఎందుకు యివ్వకూడదనే బాధ వారికి ఉన్నది కనుక ఉద్యోగానికి సంబంధించినంతవరకూ యీ first list లో వున్నది Second list లో వేస్తే వేయవచ్చును ఇది administration కు సంబంధించిన విషయం కాబట్టి A-B అనడంలో గౌరవాగౌరవాలకు ఏమి భంగమురాదు నా దృష్టిలో చూస్తే ఆయుర్వేదము A and B classes కంటే గొప్పది మనము అనుకున్నటు వంటి స్థాయికి మనమందరము కృషిచేసి దానిని తీసుకవెళ్లుదాము Gradual గా eliminate చేయడమే నా ఉద్దేశం (A) eliminate ఐపోతే (B) అనేది (A) పోతుంది అక్కర (A) అక్కరలేదు (B) అక్కరలేదు ఆ situation develop కావడానికి interim period అవసరము అనుకున్నాము మళ్లీ త్వరలో పనిఐతే హైదరాబాదు వెళ్లినతర్వాత యీ Act అంతా adopt చేయాలో - అన్ని విష యాలు మనం పునఃపరిశీలన చేయవలసి ఉంటుంది అందువల్ల యీ సందర్భములో fundamental issue ను touch చేయవద్దని నేను కోరుతున్నాను

**SRI T JIYYAR DASS** — అధ్యక్ష మహాశయా ! మన ఆరోగ్య శాఖా మాత్యులు A B తరగతులను గురించి చెప్పిన విషయాలు కొంచెం తారుమారుగా ఉన్నాయి ఇదివరకు వేదయుగంనాడు ఉచ్ఛస్థితిని అనుభవించింది మధ్యలో బ్రిటిషువారి హయాములో అణిగిపోయింది ఇపుడు వీరి హయాంలో దీనిని సముద్ధరణ చేశామన్నారు మేమందరము అందుకు అభినందిస్తున్నాం ఈ సము ద్ధరణ కార్యక్రమంలో ఒక ద్రోహం ఉన్నది అంటే మమ్ములను మళ్లీ 'B' class

తరగతి వాండ్లను సేవకా వృత్తిలోకి పంపించడం ఈ సభాముఖాన చెప్పుతున్నాను ఇహ జన్మ జన్మాంతరేషు చ' ఏ బోర్డులో గాని ఏ పంచాయితి బోర్డులో గాని సేవకావృత్తి కోరము అయితే మాకు ప్రధానంగా ఆయువును పరిరక్షించేటటు వంటి పని మాకు మొట్టమొదటినుంచి ఉంది ఆ పరిరక్షించే పనిమాత్రం మాకు ప్రసాదించండి అని మంత్రిగారిని కోరుతున్నాను వారు ఇపుడు ఏదో ఒక శ్లోకాన్ని చదివి ఆయుర్వేదాన్ని అమృతోపమానంగా చేశారు ఏమని ఉందంటే ఆయుర్వేదో అమృతానాం అమృతానాం అంటే చచ్చినవాండ్లది కాదు బ్రతికిన వాండ్లదే ఆయుర్వేదం అని వారికి ఉండేటటువంటి పేరాశతో దీనిని ముందుకు తీసుకొనివెళ్లే విషయాన్ని గురించి దానిని అమృతోపమానంగా చేశారు గనక మిక్కిలి అభినందిస్తున్నాను అందువల్ల ప్రాణికోటికి కలిగించే హింసాకాండ ఏదైనా ఉంటుంది కోయడమో శల్యాన్ని చీల్చడమో వాటిని గురించిన cartificate లు కోర్టులో ఎక్కి సాక్ష్యం చెప్పడమో అవి బహుశా వేదాలలో నిషిద్ధమే సాక్ష్యం చెప్పకు డదు ధర్మవృత్తిమాత్రం ప్రసాదించి సేవకావృత్తి తొలగించమని చెప్పుతూ ఉన్నాను

THE HON SRI K VENKATA RAO —అధ్యక్షా జియ్యర్ దాస్ గారు mistake చేస్తున్నారు సేవకావృత్తి అంటే గవర్నమెంటు క్రిందపని చేయడమే సేవకావృత్తి క్రింద లెక్కపెట్టుతున్నారు ఆయుర్వేదవైద్యులంతా ఈయనలాగా అనుకోవడం లేదు చాలా మందికి ఉద్యోగాలు కావలెను జియ్యర్ దాస్ గారిది నాది independent political life మాకు ఉద్యోగాలు అక్కర లేదు వెడితే ఈ ఎం ఎల్ ఏ జీతంకూడా రాదు అందువల్ల వాండ్లకు యిచ్చిన concession వద్దనిచెప్పడం ఏమిటి ? సేవకావృత్తి ఏమిటి ? ఏదిచేసినా సేవకుడే గ్రామసేవకుడు village level worker B Sc, (A G ) pass అయిన వాడు village level workerగా ఉన్నాడు పాపం! ఆయన గౌరవం ఏమైనతగ్గిపోయిందా? అందువల్ల సేవఅన్నది సర్వతోముఖమైనది జీతంపుచ్చుకొనేదే సేవకాదు సేవకా వృత్తే మనజీవితమంతా సేవచేసే మనవైద్యాన్ని ముఖ్యంగాపైకి తీసుకొనిరావాలి గాని సేవకత్వం క్రింద underline గీయకూడదు

SRI A KALESWARA RAO — Sir, I beg leave of the House to withdraw my amendment

The amendment was, by leave of the House, withdrawn

Clause 27 was put and carried

*Clause 28*

Mr SPEAKER — The motion is

That clause 28 do stand part of the Bill "

SRI A KALESWARA RAO —Sir, I move

' In sub clause (3) of clause 28 under the heading Class A add the following as new sub clause (4) and (4) practitioners of well known ability certified as such by the Board

Mr SPFAKER — This cuts at the very root of the Bill

SRI A KALESWARA RAO —అధ్యక్షా General practitioners లో చేర్చుకోవడంలేదు చివరకు class A ఎవరికి పెట్టారు ? మనరాష్ట్రంలో G C I M, L I M వాండ్ల ఇద్దరికిమాత్రమే 'A class ఇచ్చారు తక్కినది any other state వాండ్లకు ఇచ్చారు అట్లయితే మనకు పెద్దపెద్ద మహానుభావులు, పండితులువుంటే వాండ్లకు A class లేకపోతే ఇంతకంటే అన్యాయమైనదిలేదు ఇది చాల అక్రమమని చాలగట్టిగా చెప్పవలసియున్నది మన 'A class లో ఎవరిని చేర్చారు ? G C I M వాండ్లు ఇది అక్కరలేదంటున్నారు integrate కావలె నంటున్నారు L I M వాడు అక్కడ కూర్చొన్నాడు వాండ్ల ఇద్దరికితప్ప 'A class లో ఎవరినిపెట్టారో చెప్పండి Well known ability ఉన్న practitioners కు A class అన్నా లేకపోతే ఏమీ ప్రయోజనం లేదు It cuts at the very root of the thing వాండ్లకు A class అయినా లేకపోతే I will ask all the Ayur vedic practitioners even to boycot this So I appeal to the Ministers '

THE HON SRI K VENKATA RAO — అధ్యక్షా ఆయన ఎంత కోపంగాచెప్పినా వ్యక్తులకోసం శాసనాలుతయారుకావు ఎంతగొప్పవారైనాసరే రాజ్యాంగంకోసం తయారు అవుతారు అందుచేత నేను రాజ్యాంగంకంటే ప్రజా స్వామికంకంటే చాల గొప్పవాణ్ణి అని అనుకుంటే అదిచాలా పొరపాటైన విష యము ఇక్కడ (A) class కు (B) class కు గౌరవప్రతిపత్తిలో ఏవిధమైన తేడా లేదని మనవిచేశాను (A) class లో వ్రాశిన చాలా గొప్పపండితుడు నేను ఎరిగిన వాండ్లలో ఉన్నాడనుకోండి ఆయనకు ( A ) క్లాసుగా ఉండడంవల్ల ప్రత్యేక గౌరవం ఏమివచ్చింది Wound certificate ఇచ్చి కోర్టుకువెళ్ళి సాక్ష్యం చెప్పడం 'I will advise the practitioners అని కాళేశ్వరరావుగారు అన్నారు తర్వాత సెక్షను చదువుకోమనండి 5 ఏండ్లలో కనుక register కాకపోతే, మన పూర్వ కాలం వెళ్ళిన కృష్ణజన్మస్థానానికి వెళ్లవలసిన అవస్థ ఒకటి ఏర్పడుతుంది అందుచేత

ఇటువంటి sentiments వయోవృద్ధులు శాసనసభ ఎదుట పెట్టడం న్యాయమైన విషయంకాదు మొన్ననే నెహ్రూగారు 'issues passed by the parliament should not be questioned in the streets' అన్నారు కాళేశ్వరరావుగారివంటి వారె దీనిని తీసుకొనివెళ్ళి వీధులలో పెట్టి ప్రశ్న వేస్తారనే స్థితికివస్తే నేను ఎంత మాత్రం ఈ సవరణకు ఒప్పుకునే పరిస్థితిలో లేను

SRI VAVILALA GOPALAKRISHNAYYA — కళా వెంకట్రావు గారు సెలవిస్తూ ప్రతి Firka కు ఒక ఆసుపత్రి పెట్టితే దాంట్లో 'B section లో ఉండేవాండ్లే వచ్చేదానికి అవకాశం ఉంది ఆ సమయంలో గ్రామంలో ఉండే వాండ్లకు certificate కావలెనంటే మొదటిక్లాసు అతను లేడుగనుక certificate పొందటానికి ప్రయోజనంలేకుండా పోతుంది మనంఇచ్చేది రెండువైపులా సౌకర్యం ఉండేటట్లుగా మొత్తం ఉపయోగపడవలెను Legal వాటికి ఉపయోగపడవలెను అందుకు ఆవిధంగాచేసినపుడు ఎట్లా వీలుఅవుతుందో చెప్పమని అడుగుతున్నాను గ్రామాలకు ఉన్న సౌకర్యం Firka లకు Firka లకు యిచ్చినటువంటిది మట్టు ప్రక్కల ఉన్నవారికి లేనప్పుడు మళ్ళీ తాలూకా head quarters దగ్గరకుపోయి fully qualified Doctor దగ్గరనే తీసుకోవలెనా లేకపోతే వీరికికూడా ఇస్తారా ?

Mr SPEAKER — A class కు ఉంది

SRI VAVILALA GOPALAKRISHNAYYA — Firka లలో కొన్నిచోట్ల dispensary లను ఏర్పాటుచేస్తున్నారు' వాటిలో ఈ వైద్యులు పనిచేస్తుంటారు ప్రభుత్వం అతనిని disqualify చేయుటలేదంటున్నారు Disqualify చేయనంతమాత్రాన అతనికి qualification రాదే ? రాజుగారి పెద్దభార్య అన్న పద్ధతిలో వచ్చేటట్లయితే అతనికి ఆ హోదాలేకుండాపోతుంది అపుడు ఎట్లాచేయడం అనేది చెప్పాలి

THE HON SRI K VENKATA RAO — ఇది clear గా ఉంది వావిలాల గోపాలకృష్ణయ్యగారికి ఇంత అనుమానం ఎందుకు వచ్చిందో? 'A class వారు certificate ఇస్తే కోర్టు consider చేయతీరాలి B class వారు ఇస్తే consider చేయాలని compulsion లేదు రేపుప్రొద్దున నాకు మందు ఇస్తుంటాడు ఒక ఆయుర్వేదడాక్టరు ముక్కామల ఫిర్కాలో సెలవు అడుగుతాను అతను వ్రాసిఇస్తే officer ను ఒప్పుకోవద్దని చెప్పామా ?

SRI A KALESWARA RAO — Sir, I beg leave of the House to withdraw my amendment

The amendment was, by leave of the House, withdrawn

Clause 28 was put and carried

*Clause 29*

Mr SPEAKER — The motion is

'That clause 29 do stand part of the Bill '

SRI A KALESWARA RAO — Sir I move

In the renumbered sub clause (1) omit the words 'who possess any of the recognized qualifications and '

ఈ clause లో language తప్పు అది ఏమంటే - Qualification ఉంటేనే register అవుతారు గనుక ఆ words తీసివేయమని

THE HON SRI K VENKATA RAO —Sir I accept the amendment of the Hon Member Sri A Kaleswara Rao పెద్దలుచెప్పింది ఒకటైనా ఒప్పుకోవాలికదా ?

SRI A KALESWARA RAO — Sir, I move

Insert the following at the beginning of sub clause (b) 'to give a medical certificate for any wounds or injuries to any person and '

29 లో ప్రధానమైన point ఉంది (b) లో to sign evidence at any inquest, చచ్చిపోయినప్పుడు సాక్ష్యానికి ఏదో దస్కతు పెట్టుతారట L M P వాండ్లమాటే నేను మాట్లాడేది L M P వాండ్లందరికిని wound certificate ఇచ్చే హక్కు ఉంది ఇప్పుడు L I M వాండ్లు ఏనాటినుంచో అడుగుతున్నారు L I M వాండ్లకు A class ఇచ్చారు ప్రభుత్వంవారు Krishnamachari వంటి వాండ్లనుచేర్చారు అనుకోండి అదివేరేసంగతి వారిదయ A' class లో L I M, G C I M ఇవిఅన్నీ చేర్చారు ఆ qualification ఉంటేనే register అవడానికి వీలుంది కాబట్టి ఆ words తీసెయ్యాలని కోరుతున్నాను

THE HON SRI K VENKATA RAO — సరే తీసేస్తాను నాకు అభ్యంతరం లేదు కాని దానివల్ల ముందు లాభం వున్నది "A registered practitioner whose name is registered' అని కాళేశ్వరరావుగారు చదవమంటారు

'Who possessess any of the recognised qualifications and అనే మాటలు superfluous గా ఉన్నాయి

SRI A KALESWARA RAO -29 (b) లో (to sign at any inquest) చచ్చిపోయినప్పుడు దస్కతు పెడతారట

L M P వారి క్రిందగా wounds and injuries certificates యిచ్చే హక్కు ఉన్నది L I M వారు ఎగ్జామ్స్లో నుంచో అడుగుతున్నారు వారికి 'A class ఇచ్చారు 'A class లో L I M వారిని G C I M వారిని చెర్చారు వారితోపాటు L I M వారికికూడా certificate యిచ్చే హక్కు వుండేటట్లు చేయాలి It is a question of status

THE HON SRI K VENKATA RAO — certificate యివ్వకుండా evidence ఎవరిస్తారు?

SRI A KALESWARA RAO — నేను బ్రతికినవానిని సాక్ష్యం ఇవ్వమంటున్నాను అంతకన్నా వేరే ఏమీ అనుటలేదు

Mr SPEAKER —'A class వారికి ఉంది

SRI A KALESWARA RAO — బ్రతికున్నవాడు fit కొనా? కాదా? ఉద్యోగికి ఎవరికైనాజబ్బుచేస్తే శలవుకావాలి అతను Medical certificateకోసం డాక్టరుదగ్గరకు పోతాడు చచ్చినతరువాత death certificate యిస్తారు మామూలుగా దెబ్బలాటలు కొట్టుకొనుట జరిగినప్పుడు wounds and injuries కు certificate యివ్వడానికి ఎక్కడవుందో మంత్రిగారు చూపించినట్లయితే నేను వారిని అభినందిస్తూ, నా amendment ను withdraw చేసుకుంటాను

THE HON SRI K VENKATA RAO — కాళేశ్వరరావుగారు కోరినట్లు వారికి హక్కు కల్గజేయాలనే విషయంలో నేను అంగీకరిస్తాను ఈ క్లాజులో వున్న మాటలవల్లనే కాళేశ్వరరావుగారు అనుకొన్నభావం వస్తుందని నా అభిప్రాయం ఆ అర్థం రాకపోతే due course లో amendment తీసుకువస్తాను

Mr SPEAKER — So, we will take up clause 29 later

Clauses 30 to 38 were put and carried

*Clause 39*

Mr SPEAKER — The motion is

"That clause 39 do stand part of the Bill"

SRI A KALESWARA RAO — Sir, I move

'Omit clause 39

Recognised Pharmaceutical Office పెట్టుకోడానికి recognition పెట్టారు Registered Practitioners కాకపోతే practice చేసుకోడానికి వీలులేదంటు

న్నారు ఇది too premature అందువల్ల 5 years అయినతరువాత అలోచించవచ్చు లేకపోతె వారంతా బాధపడతారు

పైన 2 Recognitions పెట్టారు ఒకటి Stores, Pharmaceutical Works కు recognition రెండవది Practitioners కు recognition కావాలంటున్నారు ఇందులో ఒకటి తీసివేసి ఒకటి వుంచారు పెడితే రెండింటికీ prohibition పెట్టాలి Register చేసుకోకపోతే stores పెట్టి మందు అమ్ముకోవచ్చు కాని practice చేసుకోడానికి మాత్రం వీలులేదంటున్నారు

THE HON SRI K VENKATA RAO — ఈ క్లాజులో clear గా వుంది ౫ ఏండ్ల తరువాత register కానివారందరూ practice చేయవద్దని చెప్పాము అదిపెట్టకపోతే ఈ శ్రమంతా ఎందుకు ? Compounders injuctions చేయడం జరుగుతూనే వుంటుంది అందువల్ల అది వుండవలసిన అవసరం వుంది Stores కు preference ఇచ్చామని కాళేశ్వర్రావుగారి అనుమానం కాని బిల్లులో అట్లా యివ్వలేదు ఎవరైనా వైద్యం చేయాలంటే register అవ్వక తప్పదు Register అయినతరువాత మందుకు drug control వద్దన్నాము ఇతరులకు అమ్ముకోడానికి control పెట్టాము అది లేకపోతే చేసిన పనంతా వృథా అవుతుంది కొంతమందికి కష్టంగా వున్నప్పటికీ ఈ క్లాజు వుండవలసిన అవసరం వున్నది

SRI A KALESWARA RAO — Sir I am not pressing my amendment

The amendment was by leave of the House, withdrawn

Clause 39 was put and carried

Clauses 40 to 46 were put and carried

Schedules I and II were put and carried

*Clause 29 (Contuned)*

THE HON SRI K VENKATA RAO —అంతావుందంటున్నారు కాళేశ్వర్రావుగారు ఒక్కటే లేదంటున్నారు నేను Legal Department వారితో consult చేసి కాళేశ్వర్రావుగారు అనుకున్న ప్రకారం లేనట్లయితే వెంటనే amendment తీసుకు వస్తాను

SRI A KALESWARA RAO —I am very thankful to the Hon Minister for giving me this assurance

Sir, I am not pressing my amendment

Sri A Kaleswara Rao] [16th August 1956

The amendment was by leave of the House, withdrawn
Clause 29 as amended was put and carried
Clause 1 was put aad carried
The Preamble was put and carried

THE HON SRI K VENATA RAO —Sir I move that the Andhra Ayurvedic and Homeopathic Medical Practitioners Bill, 1956 be passed into Law

SRI R B RAMKRISHNA RAJU — అధ్యక్షా! ఇంతవరకూ జరిగిన చర్చలో నేను పాల్గొనలేదు ఆయుర్వేదాన్ని గురించి ధనవంతులను గురించి మంత్రిగారు చెప్పారు ఆయుర్వేదాన్ని వృద్ధివేయుటకు ఏమి ప్రయత్నం చేస్తున్నారో చెప్పలేదు

ఇందులో registration ను గురించేవుందికాని సరైన విద్యచెప్పించడానికి ఏర్పాట్లు లేవు దానిలోని financial implications నాకు తెలియవు దీనికొక Board వుందన్నారు Registrar, Inspectors వున్నారన్నారు ఎంతఖర్చు అవుతున్నదో ఏమిటో చెప్పలేదు

THE HON SRI K VENKATA RAO —రు 8 400 అవుతోంది

SRI R B RAMAKRISHNA RAJU —మన రాష్ట్ర ఆర్థికపరిస్థితి బాగాలేదు ఈపై విషయాలన్నింటిని మంత్రిగారు తెలియజేయవలసిందిగా కోరుతూ విరమిస్తున్నాను

SRI D V SUBBA RAO — అధ్యక్షా ఆయుర్వేద వైద్యులయొక్క హోమ్యోపతి వైద్యులయొక్క స్థాయిని అర్హతనుపెంచి క్రమబద్ధంచేయడానికి గాను కళా వెంకటరావుగారు తీసుకువచ్చిన బిల్లుచాలాఅభినందనీయము ప్రతిపక్షము తరపునకూడా మాఅభినందనములుతెలియజేయడంకోసమే నేనుమాట్లాడుతున్నాను బిల్లులోని ప్రధానాంశములు అందరికి ఆమోదకరంగానే ఉన్నాయి జూన్‌లో publish చేసిన ప్రథమ బిల్లుకు అనేక associations తరపున చేసిన ఆక్షేపణలను దృష్టిలో పెట్టుకొని ప్రజాభిప్రాయాన్ని మన్నించి చాలా బాగుగు సవరణచేసి ఆగస్టులో publish చేసిన బిల్లులో ఆలోపాలన్నీ తీర్చారు మేముకూడా ముందు చూసుకోకుండా amendments ఇవ్వాలనుకొన్నాము కాని ఆగస్టులో publish చేసిన బిల్లునుచూసి ప్రతిఘటించవలసిన అవసరం ఏమీలేదని ఊరుకొన్నాము ఏదో ఒకటి రెండు విషయాలుతప్ప మొత్తంమీద బిల్లులోని అన్నిఅంశాలు బాగానే ఉన్నాయి ఆవిషయాలలో ప్రభుత్వపక్షంలోఉన్నవారు కొంతమంది amendmets

Sri D V Subba Rao] [16th August 1956

పెట్టినా ప్రభుత్వాన్ని మంత్రిగారిని వ్యతిరేకించలేకపోతేనేమి పార్టీ discipline కల్లనైతేనేమి ప్రతిపక్షమువారు ఏవో ఆక్షేపణలు చేసినప్పటికి majority ఉన్నది గనుక steam roller గా నడిచిపోతోందనే కారణంచేత ఊరుకోవలసవచ్చింది కాని దానిలో ఒకటి రెండు లోపాలువున్నాయి బోర్డువారు certificate ఇవ్వ డానికి పరీక్షకు కూర్చోడానికి కనీసము formal education III form వరకో, IV form వరకో బోర్డువారె నిర్ణయించాలని చెప్పారు పరీక్షవిషయమై కాశేశ్వర రావుగారు చెప్పారు చాలమంది పైకిచెప్పకపోయినా మనస్సులోఉన్నది వయస్సు 40 సంవత్సరాలని పెట్టారు practice 10 సంవత్సరాలన్నారు U P లోని Act, Travaencore Cochin State లలో pass చేసిన Act లలో 5 సంవత్సరాలు practice చేస్తే చాలునని exempt చేసినట్లు కనబడుతోంది 10 సంవత్సరాలలోను అనుభవం సంపాదించే ఉంటాడు కాబట్టి 5 సంవత్సరాలు అని పెట్టిఉంటే బాగుండేది అనుభవంలేదు కాబట్టి పరీక్షకు కూర్చోవలసవుంటుంది కాని అదికూడా కొంచెము ఇబ్బంది కలుగజేస్తుందేమోనని అనుకుంటాను Certificates ఇవ్వడం విషయంలో మంత్రిగారు చాల తీవ్రంగా చెప్పారు అయితే చాలభాగము ప్రతి ఆక్షేపణకు వారుచెప్పిన జవాబులుకూడా ఆమోదకరంగానే ఉన్నాయి కాని ఇప్పుడున్నటువంటి శాసనంప్రకారం అబద్ధపు certificate లు ఇవ్వడానికిప్రోద్బలం ప్రోత్సాహము కలుగజేస్తోందనేవిషయం ప్రభుత్వం గుర్తిస్తుందనే అనుకొంటాను ఒక నెలరోజులపాటు B classకు చెందిన ప్రసిద్ధ హోమ్యోపతి వైద్యునిచేత treat చేయించుకొని certificates కోసం A' class వైద్యునిదగ్గరకు వెడితే ఆయన నీ జబ్బుఏమిటో నాకుతెలియదు నీకు నేను treat చెయ్యలేదు నీకు నేను certificate ఎలా ఇచ్చేది అంటే నాకు మందిచ్చిన ఆయన పనికిరాడు నీదగ్గరకే వెళ్ల మన్నాడు అంటే అప్పుడు ఆయన false certificate ఇవ్వాలన్నమాట నిజంగా మందిచ్చి, జబ్బుకుదిర్చిన ఆయనకు certificate ఇవ్వడానికి అధికారంలేదు ఎవరో treat చెయ్యని ఆయన certificate యివ్వడం జరుగుతోంది 'B Class ను గురించి జియ్యరుదాసుగారు ఆక్షేపించినపుడు 'B' Class వాళ్లను certificate లు ఇవ్వవద్దని చెప్పలేదని అన్నారు A' Class వాళ్లను ఇవ్వమని చెబుతారా 'B" Class వాళ్లను ఇమ్మనమని దానిలో లేకపోతే అర్థంఏమిటి? 'ద్రాక్షారామం గుడి ఎవరు కట్టారో సందేహంగాఉన్నదిగాని భీమవరంగుడి ఎవరు కట్టారో నాకుతెలియదు అన్నట్లుగా B Class వాళ్లకు ఇమ్మనమని legal గా recognition ఇవ్వలేదు Legal గా prohibition లేదు అందుచేత B Class విషయంలో ఏమిచెప్పినట్లో అర్థంకావడంలేదు వాళ్లేదో formal గా recognized college లో pass కాలేదు కాబట్టి వాళ్లకు ఆ హక్కు ఇవ్వలే

దన్నారు ఏమైనా Wound Certificate విషయంలో అయితే Surgeon పరీక్ష Pass అయివుంటేగాని అవిఇవ్వడానికి వీలులేదంటే ఒప్పుకొంటాను గాని జ్వరము వచ్చినవానికి కాలునొప్పికి మొదలైన చిన్నవాటికి నెల్లాళ్లపాటు మందిచ్చి అతని వల్ల ఉపకారం పొందడానికి అధికారం ఉన్నది దానిని law ఒప్పుకుంది కాని certify చేయడానికి అధికారం లేదంటే ఇదికొంచెము స్వవచన వ్యాఘాతములాగా కనబడుతుంది కాని ప్రధానవిషయాలన్నీ చాల చక్కగా ఉన్నాయి కాబట్టి ప్రతి పక్షము తరఫునకూడా ఆమోదం తెలియపరుస్తున్నాను

SRI S NARAYANAPPA — మన రాష్ట్రంలో చిరకాలంనుంచి ఆయుర్వేద వైద్య విధానం హోమ్యోపతి వైద్య విధానం రూపొందక అందులో తరిఫీదు పొందినటువంటి డాక్టర్లు చాలా బాధలు పడుతున్నటువంటి సంగతి ఈ సభ సభ్యులకు మంత్రివర్యులకు తెలుసు శ్రీయుత వెంకటరావుగారు ఎన్నో రాయబారాలద్వారా ఈ వార్త విని చాల సానుభూతితో ఆయుర్వేద విధానాన్ని హోమ్యోపతి విధానాన్ని చక్కబరచి ఒకవిధమైనటువంటి చక్కని బిల్లు రూపంలో తీసుకొచ్చినందుకు ఆంధ్ర దేశంలో ఉన్నటువంటి డాక్టర్లందరు చాలా సంతోషిస్తున్నారు ఇప్పుడు G C I M డాక్టర్లు జిల్లా బోర్డులలోను స్థానిక సంస్థలలోను ఆస్పత్రులలోను పనిచేస్తున్నారు వారికి Post Mortam conduct చేసేటటువంటి అధికారం లేకుండా ఉన్నది. మద్రాసు రాష్ట్రంలో వారు post mortam conduct చేసేటటువంటి విధానానికి ప్రభుత్వము ఆమోదించి G O లను కూడా అమలు పరచింది కాబట్టి మన రాష్ట్రంలో కూడా G C I M డాక్టర్లు post mortam conduct చేసే విధానాన్ని ప్రభుత్వము ఆమోదించి వెంటనే ఉత్తర్వులు పంపిస్తారని నేను ఆశిస్తున్నాను

THE HON SRI K VENKATA RAO — అధ్యక్షా బిల్లును కొంచెము హెచ్చుతగ్గుగా సభవారందరు ఏకగ్రీవంగా ఆమోదించినందుకు నాకృతజ్ఞత తెలుపుకొంటున్నాను ఇప్పుడు వచ్చినటువంటి ప్రధాన విమర్శ ఒక్క certificates ఇవ్వడంగురించే Certificates ఇవ్వడంలో ఇంత pressure రావడానికి ఒక గూఢ కారణంకూడా ఉన్నది అది నేను సభముందర చెప్పదలచుకోలేదు అది కేవలం mode of earning గా కొంతమంది చేస్తున్నారు అందుచేత basical గా issue చెప్పలేదు ఇంకా కొద్దిరోజులు పోయేటప్పటికి (A) class అనేది తీసేసి మొత్తం అంతా (B) class చేస్తామంటే అప్పుడు certificates ఇచ్చేటటువంటి అర్హతకూడా వస్తుంది కవిరాజంటే రాజరికం కాదు కవిరాజనేది బెంగాలి పదం మనదేమో ఆయుర్వేద విద్వాన్ ఆయుర్వేదాన్ని బాగా పోషించుకొని

హోమ్యోపతిని పోషించుకొని ప్రకృతిని పోషించుకొని ఈ సిద్ధాంతానికి ప్రభుత్వము ఇచ్చినటువంటి గౌరవాన్ని చాల ఉన్నత స్థాయికి తీసుకువెళ్లడానికి ఆయుర్వేద వైద్యులందరుకూడా చట్టంప్రకారం ప్రవర్తించి సహాయపడతారని ఆశిస్తున్నాను పనిచేయడంలోగాని interpretation లో గాని మనమనుకొన్న ఉద్దేశాలకు ఏమైన భంగం కలిగేటటువంటి పరిస్థితులు గనుక ఏర్పడినట్లయితే సవరణ తీసుకొనివచ్చేందుకు ప్రభుత్వము వెనుకంజవేయదని మాత్రం నేను హామీ ఇవ్వగలను ఇంకా విమర్శనలో 2 ముఖ్యమైనటువంటి విషయాలు ఆగిపోయినాయి College ల గురించి ఏమి చెప్పలేదన్నారు కాలేజీలు పెడతారని బిల్లులో ఎవరు వ్రాయరు దానిలో కాలేజీలు పెట్టేటటువంటి అధికారాన్నిమాత్రం పుచ్చుకొన్నాము College లు పెట్టవచ్చు Schools పెట్టవచ్చు మనఇష్టంవచ్చినవి పెట్టవచ్చు Research institution పెట్టడానికి Government of India కు application పంపించామని చెప్పాను Research institution మాత్రం College కాదా? అందుచేత అన్నీ అమలులోకి వస్తాయి ఆయుర్వేద వైద్యులయొక్క హోమ్యోపతి వైద్యుల యొక్క ప్రకృతి వైద్యులయొక్క ఆశీర్వాదంవల్ల College లు Research institution లు hospitals అన్నింటిని ఉన్నతమైనస్థితికి తీసుకొచ్చేటటువంటి యత్నం తప్పకుండా చేస్తామని మనవిచేస్తున్నాను

Preventive medicine గురించి కాశేశ్వరరావుగారు చెప్పారు Preventive medicine ఎప్పుడూ medicine కంటే మంచిదే జబ్బురాకుండా చేసుకోవడం మంచిదికాదా? దానికోసం కొన్నిఏర్పాట్లు చేయాలి చేస్తాము ముఖ్యంగా అందరికి నూతులు ఉండవు ప్రతిరోజ స్నానం చేయడంకూడా కష్టం అవుతుంది ప్రతిరోజు స్నానంచేసే ఏర్పాట్లు మొదలైనవన్నీకూడా Government తప్పకుండా చేస్తారు చాలచోట్ల blocks పెట్టారు హైదరాబాద్ లో కావలసినన్నిఉన్నాయి అలాంటివన్నీకూడా పెట్టించి Preventive వైద్యాన్నికూడా అమలులోకి తీసుకువచ్చేయత్నం ప్రభుత్వం తప్పకుండా చేస్తుందని నేను హామీఇస్తున్నాను

అలాంటివన్నీ కూడా పాటించి preventive వైద్యముకూడ అమలులోకి తీసుకువచ్చేప్రయత్నము తప్పకుండా ప్రభుత్వము చేస్తుందని నేనుహామీఇస్తున్నాను రామిరెడ్డిగారు ఆసవ, అరిష్టాలు గురించి చెప్పారు ఇవి ఆయుర్వేదములో ఒక ప్రధానమైన అంగము గనుక ఇవి Prohibition Act లో ఉండాలా వీటి విషయం గురించి ఏవిధముగా modify చేయాలనే విషయాలను గురించి Prohibition Minister గారు Health Minister గారు ఆలోచిస్తారు వచ్చే Cabinet meeting లోనో మరొకప్పుడో ప్రభుత్వము దీనిని గురించి ఆలోచించి ఒక నిర్ణయం కూడ తీసుకుని ప్రకటిస్తుందని మనవిచేస్తూ తమరంతాకూడా సహృదయంతోటి ఈబిల్లును

శాసనంచేయడానికి తోడ్పడినందుకు తిరిగి నాహృదయపూర్వక కృతజ్ఞతను తెలియబరుస్తున్నాను

Mr SPEAKER —The question is

That the Bill be passed into law

The motion was carried and the Bill was passed into law

## VI DISCUSSION ON THE SITUATION IN THE FLOOD AFFECTED AREAS

SRI V VISWESWARA RAO —అధ్యక్షా ఈ వరదల విషయములో ప్రభుత్వంవారు ఒక పెద్ద statement చేసి మొత్తం రాష్ట్రంలో ఉన్నటువంటి వరదలవిషయము శాసనసభముందు తీసుకువచ్చారు ఈ వరదలు గురించి ప్రభుత్వమునకు వచ్చినటువంటి రిపోర్టు చాలా అసంపూర్తిగా ఉన్నది అసలు రెవిన్యూమంత్రిగారు మాజిల్లాకు స్వయముగావచ్చి ఆ పరిస్థితులను పరిశీలించలేదు కాని ముఖ్యమంత్రిగాని లేక అక్కడికి వచ్చినటువంటి ఇతర మంత్రులుగాని ఈ వరదలవిషయములో రిపోర్టుచేసిఉంటే ఈ సంపూర్తినివారు పూరించగలిగి ఉండేవారు కాని ఇక్కడ చేసిన statement బట్టి చూస్తే రెవిన్యూమంత్రిగారు ప్రత్యేకించి జిల్లా కలెక్టర్ల రిపోర్టులమీద ఆధారపడ్డారేమోఅని చెప్పవలసివస్తున్నది అలా కాకుండా స్వయముగా దానిని చూచినప్పుడు ఈ వరదలయొక్క ప్రమాదము ఎంత తీవ్రముగా ఉన్నదో తెలుసుకోవచ్చును కృష్ణానదిలో చాలా వరదలు వచ్చాయి నాకు ఉన్నటువంటి అనుభవములో ఈ సంవత్సరము వచ్చినటువంటి వరదలు బహుశా ఎప్పుడుకూడా రాలేదని చెప్పవలసిన అవసరం ఉన్నది కృష్ణలో నాలుగుసార్లు వరదలు వచ్చాయి కృష్ణానది మధ్యగ సుమారు 10 12 గ్రామాలు ఉన్నాయి ఇవి బెజవాడ తాలూకాకు దివితాలూకాకు చెందినవి ఈ గ్రామాలు ఈనెల పదిరోజులు కూడా చాలా వరదలకు గురిఅయి అక్కడి ప్రజలు అనేక ఇబ్బందులకు గురి అయినారని చెప్పవలసియున్నది అందులో బెజవాడ తాలూకాలో దాములూరు జూపూడు అనే రెండుగ్రామా లున్నాయి అవి సరిగా కృష్ణఒడ్డునే ఉన్నాయి అవి చాలా సంవత్సరములనుంచి కృష్ణఒడ్డునజీవించు చున్నప్పటికి ఈ రెండు సంవత్సరముల నుంచి ఆ గ్రామాలు కోతలో పడిపోయి మునిగిపోయాయి ప్రక్కనే ఒక సందర్భంలో పురిగేడు పట్టణమంతా పూర్తిగా కోసుకుపోయి మునిగిపోయిందని పత్రికలలో చూస్తూవచ్చాము దాని విషయములో కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టి ఆ పట్టణాన్ని రక్షించాలనుకొన్నారు కాని ఈ చిన్న గ్రామాలు కృష్ణానదకోతలలో పడిపోతూవుంటే వీటిని రక్షించడానికి

మూడవలసిందని గతసంవత్సరమే ప్రభుత్వ దృష్టికి తీసుకొనివచ్చినప్పటికీకూడ అధికారుల దృష్టికి తీసుకొని వచ్చినప్పటికీకూడా పరిశీలనతోనే సంవత్సరం పూర్తి అయిపోయింది ఈ సంవత్సరం వచ్చినటువంటి వరదలువల్ల ఆ గ్రామాలలో ఇంకా 10 15 ఇళ్ళవరకు నదికోతలో పడిపోయి ఆ గ్రామాలు చాలా ప్రమాద పరిస్థితులలో ఉన్నాయి కృష్ణలో ఇంకా చాలా గ్రామాలు అదే విధముగా ఉన్నాయి వరదలు వచ్చినప్పుడల్లా ఆ గ్రామస్థులందరిని బయటికి చేరవేయవలెనని ఆలోచిస్తారే గాని తరువాత వారు బయట ఎక్కడ ఉండాలి అనే విషయం గాని వారికి ఇతర సౌకర్యాల విషయంగాని ప్రభుత్వం చాలా తక్కువగా ఆలోచించడం జరుగుతున్నది వరద వచ్చినప్పుడు వారిని బయటికి చేరవేశామా లేదా అంటె చేరవేస్తున్నారు కాని వారు బయటికి వచ్చినతరువాత వారి పరిస్థితి చాల హృదయ విదారకంగా ఉన్నదని చెప్పవలసియున్నది వాళ్లకు కనీసం ఒక వారము రోజులవరకైనా సరే వారి తిండికి కావలసినటువంటి ఆహార పదార్థాలను supply చేయండి అని కోరాము స్థానికంగా కొన్ని ఏర్పాటులు చేశారు గాని వాళ్లు కావలసినంత సహాయం చేయలేదు అందుకని ప్రభుత్వము కూడా సహాయము చేయాలని కోరితే చివరకు మా పోరు పడలేకనేమో అమెరికా వాళ్లు పంపించిన పాలపొడి మాత్రము తీసుకువచ్చి ఒక రోజు మాత్రము ఇచ్చి తిరిగి ఆ గ్రామాలవైపు చూడలేదు ఇది అధికారుల దృష్టికి తీసుకు వచ్చాను పాలపొడి ఇవ్వడంతోనే సరిపోదు కనిసం ఒక్క వారము రోజులైనాసరే ఆహార పదార్థాలు సప్లై చేయమని కోరాను కృష్ణా జిల్లాలో ఈ విధంగా కృష్ణానదీ కోతకు గురిఅయిన గ్రామాలు సుమారు 20 గ్రామాలవరకు ఉన్నాయి మెట్టప్రాంతాలలోని లంక భూములన్నికూడ మునిగిపోయినాయి ఈ సంవత్సరం అక్కడ వేసినటువంటి పైరులన్నీకూడా పూర్తిగా దెబ్బతిన్నాయి వాటికికూడ ప్రభుత్వము అప్పులు ఇవ్వాలి అంటె మెట్ట భూములమీద అప్పులు ఇవ్వకూడదనే condition ఉన్నదని చెప్పుచున్నారు అంతేకాకుండా ఇవన్నీకూడా joint పట్టాలు ఈ జమీందారీ గ్రామాలలోని joint పట్టాలు ఇదివరకు పోలేదు వాళ్లు అప్పు అడిగినప్పుడల్లా మీవి joint పట్టాలు కాబట్టి అప్పు ఇవ్వడానికి వీలులేదు అని ప్రభుత్వము చెప్పుతున్నది ఈ విషయము సంవత్సరం క్రితమే మంత్రిగారి దృష్టికి తీసుకు వచ్చాను Joint పట్టాలు పేరుతో అప్పులు ఇవ్వడంలేదు ఇది సరికాదు ఆ రూల్సు ఏదో విధముగా మార్చవలసిన అవసరమున్నది వాళ్లక్రింద పట్టాలున్నాయి వారు ఆ భూములకు శిస్తులు కడుతున్నారు కాని అవి joint పట్టాలు అవడంవల్ల అప్పులు ఇవ్వడానికి అభ్యంతరం పెట్టడం న్యాయం కాదు గనుక వారిక్రింద పట్టా ఉన్నపుడు, వారు శిస్తు కడుతున్నపుడు దానిని ఆధారం చేసుకొని అప్పులు

ఇవ్వవలసిందని కోరాము ఇప్పుడైనా కూడా కనీసం ఈ వరదలనైనా దృష్టిలో పెట్టుకొని అటువంటి సావకాశం ప్రభుత్వము కలుగజేస్తారని నేను కోరుతున్నాను

ఇక బుడమేరువిషయం ఉన్నది కృష్ణాజిల్లావిషయం చెప్పాలంటె మొత్తం ఆంధ్రదేశానికే కాకుండా ఒకవిధంగా భారతదేశానికే ఈ జిల్లానుంచి ధాన్యం ఎగుమతి అవుతుంది ఈ West Godavari కృష్ణాజిల్లాలు మొత్తం ఆంధ్రదేశానికి ఒక (granary) ధాన్యపు గిడ్డంగి అని అనేకసార్లు ఎలుచుకోవడం కూడా జరుగుతూ ఉంది కాని అటువంటి ధాన్యపు గిడ్డంగి విషయంలో ఇక్కడ ఉన్నటువంటి మురుగునీటి పారుదల సౌకర్యాల విషయమై ఏమైనా పాటిస్తున్నారా అంటే అది శూన్యంఅని చెప్పవలసిన అవసరమున్నది ప్రభుత్వము అనేకసార్లు కొత్తభూములను సాగులోకి తీసుకురావలెనని పథకాలు తయారుచేస్తూఉంది మూడు సంవత్సరాల క్రితం కృష్ణా డ్రెయినేజీస్కీము నిర్మిస్తూ దాంట్లో అదనంగా లక్షఎకరాలు సాగులోకి తీసుకురావలెనని పథకం తయారుచేసింది కాని దాంట్లో మురుగు నివారణ కొరకై ఒక రూపాయైనా వెచ్చించారా అంటె ఒక రూపాయకూడా దానికి allot చేయలేదు ఒకప్రక్కన సాగు కావాలంటూ మురుగునీటి నివారణకు మాత్రము ఏమీడబ్బు వెచ్చించడంలేదు నేను ఒక ఉదాహరణ చెప్పుతున్నాను వంద సంవత్సరాలుగా ఉంటున్న కృష్ణాడెల్టాలో అనేక పర్యాయాలు కాలువలు అభివృద్ధిచేశారు కొన్ని కొన్ని కొత్తకాలువలు త్రవ్వి కొత్తప్రాంతాలకు తీసుకువెళ్లారు కాని మురుగునివారణ కొరకు ఖర్చుపెట్టిన డబ్బు ఎంతఅంటె చాలా చిన్నఅంకెలలో చాలా తక్కువగా చెప్పవలసిన అవసరమున్నది ఇటువంటి పరిస్థితులలో ఈ మురిగినీటికొరకు ఎటువంటి చర్య తీసుకోక పోవడంవల్ల అతివృష్టి వచ్చినవుడల్లా కృష్ణాజిల్లాలో కొంతభాగము మునిగిపోవడం రైతాంగమంతా కష్టపడడం గవర్నమెంటు remissions ఇవ్వడం కూడా జరుగుతూ వచ్చింది అయితే remission ఇచ్చాముకదా అని ప్రభుత్వము చెప్పవచ్చు ఆవిధంగా 10 రూపాయలు remission ఇవ్వడంతో ప్రభుత్వానికి బాధ్యత తీరిపోవచ్చు కాని రైతుకు ఎంతనష్టము వస్తుందని సగటున లెక్కచేసుకొంటే కనీసం నాలుగు వందల రూపాయలకు తక్కువలేకుండా నష్టపడవలసి వస్తున్నది సంవత్సరము పొడుగున కష్టపడి ఆ కష్టానికి తగిన ఫలితము రాకుండాపోవడమేకాకుండా పస్తులువుంటూ గవర్నమెంటువద్ద ఇతరులవద్ద అప్పులకు గురిఅయి తుదకు తనభూమినికూడా పోగొట్టుకోవలసిన పరిస్థితులు ఏర్పడుతూవున్నాయి అందువల్ల ఇదివరకు ప్రభుత్వము కాలవలమీద ఏదో ఖర్చుపెడుతున్నారేగాని మురుగు నివారణకొరకుమాత్రము ఏమీ ఖర్చుపెట్టడంలేదు

అదేవిధంగా బుడమేరువున్నది ఈ బుడమేరు కృష్ణలోనే పుట్టింది క్రిష్ణలోనె అంత్యమైంది కృష్ణాజిల్లాలో బెజవాడ గన్నవరం గుడివాడ కైకలూరు ఈ నాలుగు తాలూకాలమధ్య ఇదిప్రవహించడం జరుగుతున్నది ఇది ప్రతి 4 5 సంవత్సరముల లోనూ కనీసం 55 వేలు లక్షఎకరాలవరకుకూడ నష్టపరుస్తున్నదని తెలుస్తున్నది ప్రభుత్వములెక్కల ప్రకారమే 55 65 వేల ఎకరాలు దెబ్బతింటుందని పోయిన సంవత్సరము 75 వేల రూపాయలవరకు నష్టము రైతాంగానికి వచ్చిందని తెలుస్తున్నది ఈసంవత్సరంవచ్చిన వరదలవల్ల లక్షఎకరాలవరకు నష్టమువచ్చిందని నేను మంత్రిగారి దృష్టికి ప్రభుత్వదృష్టికి తీసుకొనివచ్చాను కాని ప్రభుత్వానికి వచ్చిన కలెక్టర్ల రిపోర్టునుబట్టి 55 వేల ఎకరాలు నష్టమైందని మంత్రిగారు చెప్పారు అవిధంగా తీసుకొన్నప్పటికీ ఈ 55 వేల ఎకరాలలో సుమారు 6 వేల ఎకరాలు ఇంకా ఊడవలేదుకూడ ఆనాటికి మిగిలినటువంటి వాటిలో కనీసం 40 వేల ఎకరాలలో నాట్లు వేయడానికికూడ అవకాశంలేనటువంటి పరిస్థితులున్నాయి లెక్కవేస్తే కనీసం రెండుకోట్ల రూపాయలు మొత్తంజిల్లాలో రైతాంగానికి నష్టంవచ్చి ఉంటుందని చెప్పవలసియున్నది అయితే బుడమేరు project మీద ఏదో వెచ్చించాలని అనుకొంటున్నది బుడమేరు project గాని reservoir గాని ఇంకా వరదనివారణ కట్టలుగాని కట్టాలంటె మొత్తము ప్రభుత్వము ఖర్చుపెట్టవలసినది రెండుకోట్లు రూపాయలుమాత్రమే ఈవిధంగా రైతాంగానికి ఒక్క సంవత్సరం లోనే రెండుకోట్లరూపాయలు నష్టంవచ్చిందంటె ఇదివరకు ఎన్నికోట్లరూపాయలు నష్టపడుతూఉన్నారో ఆలోచించవలసిందని కోరుతున్నాను దీనితోపాటు కొల్లేరు ఉన్నది ఈకొల్లేరు కృష్ణా పశ్చిమగోదావరి జిల్లాలకు మధ్యనఉన్నప్పటికనీ దీంట్లో కొన్ని వేల ఎకరాలువున్నవి ఈ భూమినిఅంతాకూడా బీదప్రజానీకానికి యివ్వాలని యింజన్లతో దీనిని సాగులోనికి తీసుకురావలెనని యిది రెండవ పంటకు చాలా అనువైన ప్రదేశమని ప్రభుత్వమే చెప్పుతూవచ్చింది దీంట్లోకూడా ప్రతిసంవత్సరము కొన్ని వేల టన్నుల ధాన్యం పండుతూ ఉన్నది కాని బుడమేరు తమ్మిలేరు ఎర్రకాల్వ ఇవేకాకుండా, కృష్ణాజిల్లాలోను ఇతర ప్రాంతాలలోను ఉన్న మురుగు అంతాకూడా ఈ కొల్లేరులోకి వస్తుంది ఇది చాలా ఉధృతంగా పొంగిపోతూ ఉన్నది దీనిక్రింద 40 గ్రామాలు ఉన్నాయి 40 గ్రామాలంటే ఈ ప్రాంతములో చాలా జనాభా ఉన్నదని స్పష్టంగా బోధపడుతుంది వీళ్లందరికి కూడా జీవనాధారమైనటువంటి ఆ కొల్లేటి స్కీమును అమలుపరచాలని అందరు కోరుతున్నారు ఆ స్కీముయొక్క అవసరం అందరికీ తెలిసినదే కొల్లేటిలోకి ఎంత నీరైతే వస్తూయున్నదో, అంతనీరు బయటికి తీసుకుపోవడానికి సరిపోయినటువంటి ఉప్పుటేరు లేదు కాబట్టి ఆ ఉప్పుటేరును వెడల్పుచేయవలసిన అవసరమున్నదని

అందరికి తెలుస్తూనే ఉన్నది అక్కడ రైతులు పడుతున్న కష్టములగురించి మొన్న గవర్నరుగారి ఉపన్యాసముమీద చర్చ సందర్భంలో మూర్తిరాజుగారు చెప్పారు అక్కడ ప్రజలయొక్క దైన్యస్థితి వాళ్లుపడె బాధ ఈ సంవత్సరం ఎగ్రాబ్రతకాలని తహతహపడుతున్న వాళ్ల కష్టాలన్నీకూడా మూర్తిరాజుగారు స్పష్టంగా మనముందు పెట్టారు దానికి ఎన్నో పథకాలు అవసరంలేదు దానికి ఉన్నది ఒకే ఒక పథకం దాంట్లో ఎంతనీరు వస్తున్నదో అంతనీరు బయటకిపోయే విధముగా ఉప్పుటేరును వెడల్పుచేయాలనేదే రైతాంగముయొక్క కోరిక నాకు తెలిసినంతవరకు 6 7 సంవత్సరాలుగా ఈ విషయంగురించి పథకాలు మాత్రం తయారవుతున్నాయిగాని ఒక పథకంకూడా అమలులోకి రావడంలేదని చెప్పవలసిన అవసరమున్నది ఈ విధంగా కోట్లకొలది డబ్బు రైతాంగం నష్ట పడుతూఉంటే ప్రభుత్వముయొక్క బాధ్యత యేమిటి ? ఏదో మేము remission ఇచ్చామని అంతటితో విడిచిపెట్టడమా లేక రైతులయొక్క కష్టాలను గుర్తించి అవసరమైన ప్రాంతాలలో డబ్బును వెచ్చించి ఆ పథకాలను పూర్తిచేయడానికి పూనుకోవడమా అని నేను ప్రశ్నించవలసిన అవసరమున్నది బుడమేరుయొక్క నీటిని కొల్లేటిలోకి రాకుండా అరికట్టినప్పుడే కొల్లేటి ప్రాంతానికి కొంత రక్షణ కలుగుతుంది అనేది వారు అంగీకరించిన విషయమే దానికోసమే బుడమేరు diversion scheme అని reservoir అని ఇంకా కొన్ని పథకాలు తయారు చేశారు ఇది diversion తో సరిపోతుందని చెప్పారు కాని diversion తో ఎంతవరకు సరిపోతుందో ఆలోచించాలి Diversion అంటే బుడమేరుఅంతా తీసుకుపోయి క్రిష్ణలో కలపాలనేది కాని ఈసంవత్సరము అంతక్రితం మూడుసంవత్సరాలు వరుసగా క్రిష్ణా బుడమేరు రెండు ఒకే పర్యాయము రావడము జరిగింది క్రిష్ణ చాలా వరదలో ఉన్నప్పుడే బుడమేరు కూడా రావడం జరిగింది ఈపరిస్థితులలో ఆ diversion వల్ల నీరు క్రిష్ణలో పోవడానికి అవకాశ మున్నదా అని చూచినప్పుడు ఏ 3 4 అంగుళాలకంటె ఎక్కువపోదని స్పష్టంగా మనకు బోధపడుతుంది బహుశా maximum పోతే 6 అంగళాలు నీరు పోవచ్చు నేమో అంతకంటె ఎక్కువపోదు అది technical గా చూడవలసి యుంటుంది గనుక correct గా ఇంతేపోతుందని చెప్పలేను అది technical విషయము అయితే దానికి కావలసింది reservoir అనేది అందరూ అంగీకరించిన విషయమే కాని ఈ reservoir ఎక్కడ కట్టాలి అనే విషయంలో ఎందుకు ఇంతకాలయాపనచేయాలో అర్థంకావడంలేదు Technical people దాన్ని ఎక్కడ కట్టాలో చెప్పగలరు దానికి వెంటనే పూనుకోవలసిందని కేంద్రప్రభుత్వము కోరినప్పటికినీ, మనము కాలయాపనచేస్తూ ఆ diversion కట్టిన తరువాత చూస్తాం అనేది సరికాదని

వెంటనే దానికొరకు స్థలము నిర్ణయించి reservoir కట్టడానికి వెంటనే చర్యతీసుకోవాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను

ఇంకొక విషయం ఈసందర్భంలో మనవిచేయదలచుకొన్నాను వరదలు వచ్చినప్పుడు అక్కడి ప్రజలకు సహాయముచేయుటకు సత్వరచర్యలు తీసుకోవలసిన అవసరమున్నది అందులో ప్రత్యేకంగా 55 000 ఎకరాలలో ఈసంవత్సరం పంటపోయిందని మంత్రిగారుగూడ ఒప్పుకొన్నారు దానికి ఆ ప్రజలుకో రేదిఏమిటి? ఈరైతులకు అప్పులు ఇవ్వడానికి వెంటనే పూనుకోవాలని తక్కావి loans ఇస్తున్నాము ఎరువులకు అప్పులు ఇస్తున్నాము అనేదికాదు కనీసం ఎకరాకు 50 రూపాయలకు తక్కువలేకుండా వారికి అప్పుఇచ్చినప్పుడే ఈనాడు ఉన్నటువంటి ఆర్థికబాధనుంచి వారు బయటపడడానికి అవకాశము ఉంటుంది వచ్చేసంవత్సరమైనా పంటపండడానికి అవకాశముంటుంది అని మనవిచేస్తున్నాను తరువాత 1956 సంవత్సరం డిసెంబరువరకే అప్పులు వాయిదావేశామని చెప్పారు డిసెంబరులో పంటరాదు కాబట్టి ఈవాయిదావల్ల ప్రయోజనంలేదు కనీసం 1957 వ సంవత్సరం ఆఖరు వరకైనా లేక మార్చివరకైనా అప్పులన్నీ వాయిదావేయవలెనందని మీద్వారా మంత్రిగారిని కోరుతూ సెలవుతీసుకొంటున్నాను

SRI G JAGANNADHA RAJU —అధ్యక్షా ఇటీవల రాష్ట్రములోని వరదలు భీభత్సాన్నిగురించి రెవిన్యూమంత్రిగారు 9 వ తేదీన ఒక statement ఇచ్చారు దానిప్రకారం క్రిష్ణా గుంటూరు పశ్చిమగోదావరి శ్రీకాకుళం కడప జిల్లాలలో ఎక్కువగా నష్టంకలిగిందనేది మనందరికి తెలిసిన విషయమే కాని కడప జిల్లాలోతప్ప మిగతా జిల్లాలలో అధికవర్షాలవల్ల వరదలువచ్చి వరిపైరు చాలావరకు నష్టమైపోయింది అనే సంగతి మనకు ఆ statement ద్వారా తెలుస్తున్నది ఆ statement లోని లెక్కలనుగనుక చూచినట్లయితే అందులో కృష్ణాజిల్లాలో 55 వేల ఎకరాలు పశ్చిమగోదావరిజిల్లాలో 10 వేల ఎకరాలు శ్రీకాకుళం జిల్లాలో 6 వేల ఎకరాలు గుంటూరుజిల్లాలో 15 వేల ఎకరాలు నష్టమైందని ఉదహరించబడినది కాని ఈ లెక్కలు సరిఅయినవికావు ప్రభుత్వమువారు రెవిన్యూ అధికారులనుంచి మళ్లీ సమాచారముగనుక తీసుకొన్నట్లయితే సుమారు లక్షఎకరాలకుపైగా నష్టంకలిగిందని స్పష్టపడగలదు ఉదాహరణకు ఇప్పుడు పశ్చిమగోదావరిజిల్లాలో 10 వేల ఎకరాలుమాత్రమే నష్టంకలిగింది అంటె చాలా హాస్యాస్పదంగా కన్పడుతున్నది కేవలం భీమవరం తాలూకాలోనే సుమారు 10 వేల ఎకరాలు నష్టమైంది ఇది నేను స్వయముగా చూచి తెలుసుకొన్న విషయము బహుశా మంత్రిగారు statement చేసిననాటికి, సరియైన సమాచారము వారికి అంది

వుండలేదేమో అనుకొంటాను లేకపోతే ఆవిధంగా ప్రకటించి ఉండరనుకొంటాను దరిమిలా వారికి పశ్చిమగోదావరిజిల్లా కలెక్టరునుంచి సమాచారము వచ్చిఉంటుంది ఇప్పుడు కేవలం పశ్చిమగోదావరి జిల్లాలోనే సుమారు 40 వేల ఎకరాలకు పైగా నష్టంవచ్చిన సంగతి ప్రభుత్వమువారి దృష్టికి తీసుకువస్తున్నాను ఇంత వరదల భీభత్సం జరిగినప్పటికినీ మంత్రిగారు తమ statement లో ఒక ఆశ్చర్యకరమైన విషయం చెప్పారు ఈ కొల్లేరుముంపు ప్రతిసంవత్సరం సామాన్యంగా వచ్చేదేనని ఇది ఎప్పుడూ వచ్చేదే గనుక దీనిని నివారించడానికి సాధ్యంకాదని చెప్పడం అనేది చాలా హాస్యాస్పదంగా కన్పడుతున్నది ప్రతిసంవత్సరము వస్తుంది గనుక దీనిని ఏవిధంగా అరికట్టాలనే సంగతి ప్రభుత్వము దీర్ఘంగా ఆలోచించుకుండా ప్రతిసంవత్సరము వస్తుంది గనుక ఈ సంవత్సరంకూడా అనుభవించండి అనడం చాలా విచారకరమైన విషయము ఈ సందర్భములోనే ప్రభుత్వంవారికి ముఖ్యంగా నేను ఒక విషయం మనవిచేస్తున్నాను ఈవరదలు వచ్చినప్పుడు వెంటనే ఒక రిద్దరు మంత్రులు వెళ్లి ఆ ప్రదేశాన్ని చూచి వచ్చి ఏదో సానుభూతి సూచకంగా ఆ ప్రజలకు ఏదో సహాయం చేస్తామని చెప్పడం జరుగుతున్నదే తప్ప ఈ వరద నిరోధకానికి శాశ్వతమైన ఏర్పాట్లు ఏమీ చేయడంలేదు అనేది నగ్న సత్యము ప్రభుత్వమువారు ఈ బాధ్యతను వహించక పోవడం చాల విచారకరము ఇప్పుడుకూడా ఈ వరదలు వచ్చినతరువాత ఒకరిద్దరు మంత్రులు అక్కడికి వెళ్లి చూచివచ్చినారని వారి statement వల్ల తెలుస్తున్నది కాని వారుచేసింది ఏమిటి? ఆ రైతాంగానికి ఇచ్చిన తక్కావి loans గాని ఇతర loans గాని ఈ సంవత్సరం డిసెంబరు ఒకటవ తేదీ వరకు నిర్బంధంగా వసూలుచేయవద్దని తరువాత ఋణాల చట్టముక్రింద భూమి అభివృద్ధి చట్టముక్రింద కొంత వాళ్లకు అప్పులు ఇవ్వడమనేది చేశారు కాని ఆ రైతాంగం ప్రభుత్వం వద్దనుండి ఆశిస్తున్నది ఈ కొద్ది సహాయం కాదు ఈ వరద నిరోధకానికి వారు శాశ్వతమైన ఏర్పాట్లు చేయవలెనని కోరుతున్నాను కాబట్టి అక్కడి రైతాంగమునకు ఈ బాధ నిత్యం తప్పదనే విషయాన్ని ప్రభుత్వ దృష్టికి తెస్తూ శాసన సభ్యులందరు కూడా ప్రభుత్వము ఈ వరద నిరోధక పథకాలను వెంటనే take up చేసేటట్లు వొత్తిడి చేయవలసిందని కోరుతున్నాను ప్రభుత్వానికికూడా మీ ద్వారా ఈ విషయం మనవి చేసుకొంటున్నాను ఈ వరదలు ముఖ్యంగా తమ్మిలేరు బుడమేరు కొల్లేరు ఉప్పుటేరు వీటివల్ల ఎక్కువ నష్టము కలిగిందనే సంగతి అందరికి తెలిసిన విషయమే ఈ విషయంలో ప్రభుత్వము ' ఈ బుడమేరు reservoir గురించి కొంత ప్రస్తావన చేశాము కాని అది ఎక్కువ ఉపయోగపడదేమో అనుకొని diversion scheme అనేదాన్ని గురించి ఇంజనీర్లచేత మళ్లీ ప్రస్తావన చేస్తున్నాము, అందుచేత వెంటనే

దాన్నిగురించి ఏమీ నిర్ణయం చేయలేకుండా ఉన్నాము అది ఇంకా ఆలోచనలో ఉన్నదని ఎప్పటికప్పుడు చెప్పడంజరుగుతుందితప్ప అంతకంటె వేరే ఏమిచేయడం లేదు కనుక ఈ సందర్భంలో ప్రభుత్వము ఈ Flood Control కోసం ఒక Special Division ఏర్పాటు చేయివలెనందని మనవి చేస్తున్నాను కాని ఈ పెద్ద పెద్ద స్కీములు ప్రారంభించాలి అంటె కేంద్ర ప్రభుత్వము యొక్క సహాయం ఉంటేనేతప్ప మనప్రభుత్వమే ప్రత్యేకించి చేయడానికి సాధ్యమైన పని కాదని కూడా నేను తెలుసుకొన్నాను

అయినప్పటికినీ ఆ పథకాలు కేంద్రప్రభుత్వానికి వెంటనే పంపించి వారు అంగీకరించేటట్లుగా చేసేబాధ్యత మన ప్రభుత్వంమీద ఉన్నది అదేవిధముగా గత గోదావరి వరదలవల్ల మనము చాలా బాధలుపడి ఉన్నాము ఈ సంవత్సరము కూడ గోదావరి కనికరించబట్టి బాధలు పడకుండా తప్పిపోయింది ఇంకా ఎక్కొద్దో వచ్చినట్లయితే మరల బాధలు పడిఉండేవారమే అందువల్ల యిప్పటికైనా floods ను control చేయటానికి వెంటనే పథకములు తయారుచేయించి కేంద్ర ప్రభుత్వానికి పంపించి వారి ఆమోదమును త్వరలో పొందాలని నా మనవి ఈ పథకాలు ఆమోదించటానికి కొంతవ్యవధి కావలెననమాట నిజమేఅయితే కావచ్చు అయినప్పటికినీ యీ లోపుగానైనా కేవలము పెద్దకాలువలు కాకుండా చిన్న చిన్న మురుగుకాలువలు శాశ్వాతాలుగా మరమ్మతులు లేకుండా ఉంటున్నవైనా బాగుచేయించాలని అంటున్నాను ఈ చిన్న మురుగుకాలువల వల్ల చాలానష్టము వాటిల్లుతూ ఉన్నదిగనుక అవిఅయినా బాగుచేయించమని అంటున్నాను ప్రభుత్వంవారు యీ చిన్న మురుగుకాలవల విషయము అయినా take up చేస్తారని ఆశిస్తున్నాను ప్రభుత్వం యింతవరకు నిర్లక్ష్యభావము వహించుచున్నట్లుగా కనబడుతున్నది కనీస సదుపాయాలైనా చేయించుచున్నట్లు కనబడడములేదు ప్రభుత్వంవారు వెంటనే యీ పథకాలు అమలులోకి తెస్తారని ఆశిస్తూ అధ్యక్షులవారు నాకు యీ అవకాశము యిచ్చినందులకు వారికి నా కృతజ్ఞత తెలుపుకున్నాను

**SRI G RAMASWAMI REDDI** — అధ్యక్షా ఇటీవల సంభవించిన కృష్ణానది వరదల ప్రమాదాన్నిగురించి మన రివిన్యూమంత్రిగారు శాసన సభ్యు లందరకీ ఒక రిపోర్టును అందజేశారు ఆ రిర్టుపోలో గుంటూరుజిల్లాకు సంబంధించిన నష్టము 15 వేల ఎకరాలలో మాత్రమేనని తెలియజేశారు పదిహేనువేల యకరాలు అన్నది నిజముకాదు సుమారు 30 వేల యకరాలకు ఏమాత్రమూ తక్కువ వుండదని నేను గట్టిగా చెప్పగలను సీతానగరమునుండి వైకుంఠపురముకు

దాదాపు 18 మైళ్ల దూరము ఉన్నది సుమారు పది మైళ్ల దూరమువరకూ ఎటుచూచినా నీరే కనబడింది వరదలు తీవ్రముగా ఉన్న సమయములో మంత్రి గారు స్వయముగా వెళ్లి చూచినట్లయితే అర్థము అయిఉండేది లెక్కప్రకారము చూస్తే ముప్పదివేల యకరాలకు తక్కువ వుండదు ఇదిగాక వరదబాధితులకు కుటుంబము ఒకటింటికి పది రూపాయల చొప్పున పేదవాళ్లకు యివ్వడము సహజమేకాని వాళ్లు శిస్తు రెమిషను యివ్వమని కోరడము సమంజసముకాదని నా ఉద్దేశ్యము ఎందుకంటే వేలకొద్ది ఎకరాలు నీటిలో మునిగిపోయినప్పుడు లక్షలకొద్ది రూపాయల నష్టము వచ్చినప్పుడు ఒక రూపాయ శిస్తు రెమిషనుకోరే బదులు ఏదైనా శాశ్వతముగా వరద నివారణ అయ్యేటట్లు చేయాలని పంటలు నష్టపడకుండా రక్షణకు ఏర్పాట్లుచేయాలని అంటున్నాను నేను ఎరిగినంతవరకు యింతపెద్ద వరద ఎన్నడూరాలేదు గ్రామాలలో పడవలు గ్రామాలకు గ్రామాలకు మధ్య లాంచీలు వేసుకుని పోవలసిన పరిస్థితివచ్చింది అయితే ఆరోజులలో మనది ప్రజాప్రభుత్వం కాదుగనుక మనమొర ఆలకించేవారులేకుండా పోయారు ఆరోజు లలో వరదలవల్ల నష్టపడుతూ కష్టాలుపడుతూన్నప్పటికినీ ఆనాటిప్రభుత్వం రైతాం గాన్ని కూడగట్టుకుంటూవచ్చింది అయితే యీనాడు మనకుఉన్నది ప్రజాప్రభుత్వం గనుక ప్రజలయొక్క కష్టనష్టములు చూడవలసిన బాధ్యత ప్రభుత్వంపైన ఉన్నది గనుక ప్రజాప్రతినిధులంగా మేము ఆప్రాంతాలకు ఎప్పుడువెళ్లినా అన్నికూడ ప్రభు త్వాన్ని గురించిన ప్రశ్న లేవస్తున్నవి రైతాంగంలో వరదలనష్టమునుగురించి ఎంతో ఆందోళనగా ఉన్నది వరదలు యికమీదటనైనా రాకుండా ప్రజలు నష్టపడకుండా వరదనివారణ పథకములు ప్రభుత్వము వెంటనే ఆలోచించి అమలుపరిస్తే మంచిది ఇందుకుగాను నేను ఒక సూచనచేస్తున్నాను సీతానగరమునుండి వైకుంఠపురము వరకు కరకట్ట రోడ్డును వేయించాలి సీతానగరమునుండి మంగళగిరివరకూ, అక్కడినుంచి వైకుంఠపురమువరకూ యీ కరకట్టవేస్తే ప్రజల రాకపోకలకు గూడ ఎంతో ఉపయోగముగా ఉంటుంది ఈ విషయములో ప్రభుత్వము ఒక పథకము తయారుచేయించి కేంద్ర ప్రభుభుత్వంయొక్క ఆమోదముతో అమలు జరపటానికి శ్రద్ధవహిస్తుందని ఆశిస్తున్నాను రెవిన్యూమంత్రిగారు సభ్యులకు అందజేసిన రిపోర్టులో గుంటూరుజిల్లాలో గుంటూరుతాలూకా మాత్రమే నష్ట పడ్డదని తెలియజేశారు గుంటూరుతాలూకా మాత్రమేకాదు ప్రక్కనఉన్న సత్తెనపల్లితాలూకాలో వరదలవల్ల మునిగిపోయిన గ్రామాలు అనేకములున్నవి అందులో ముఖ్యంగా మునిగోడు అనే గ్రామంతాలూకు సుమారు రెండువేల ఎకరాలభూమి పచ్చికబయిళ్లు గలది మునిగిపోయినది దీనివల్ల రైతాంగానికి పశువులమేతలేకుండా మురిగిపోయి తీరనినష్టము కలిగింది అక్కడనే ఎద్దువాగు,

కృష్ణానది యీరెండూ కలిసేచోట ఆ ప్రదేశములో ఒక reservoir మాదిరిగా తయారుఆయినది ప్రభుత్వం అక్కడ ఉన్నప్రస్తుతపరిస్థితి ఎలాఉన్నదో విచారించి రిపోర్టుతెప్పించటానికి తగుచర్య తీసుకోవలసిందిగా కోరుతూ యింతటితో విరమిస్తున్నాను

SRI D GOPALA RAO —Mr Speaker, Sir, floods is really a very unpleasant subject over which I am obliged to speak this morning Probably the public opinion was focussed only to West Godavari District but under Eleru also, there were floods and this has not been brought to the notice of the Hon Revenue Minister even There had been silent suffering and that suffering has been going on from dav to day With the object of eradicating these floods, a Flood Control Board has been formed and the Flood Control Board has really recommended this Eleru to be brought under the Flood Control Scheme, so, that the floods under Eleru may be avoided People not only lose in swings and rounders by these floods but also what little they have spent to get some return out of these lands and as such, both in swings and rounders they are losers Under Eleru, I know there had been transplantation at least two or three times in Jaggampeta village and this is a problem that concerns at least 5 or 6 of my collegues in this august Assembly We know that since 1926 this scheme was examined plans have been prepared estimates have been submitted and still it has not seen any relief This scheme has been taken up under the Flood Control and till such time as we get all the schemes that have been included under the Flood Control, this trouble and misery for the ryots will always exist, unless the Government think of the progress of the country only in seeing that these flloods conttrols are observed Even in 1953 when we had the Godavari floods, there has been one of misery under this erratic river Eleru and still people bear it silently and the suffering of people who might have undergone this trouble is one of misery and it is not at all pleasant for us to talk in this House So I request the Government who want to increase the yield by the Second Five Year Plan by 40 per cent under agriculture and so on to see that the existing lands do not suffer from the inundations and as far as possible to see that the inundations do not take place at least by clearing the channels The channels are all silted up We have been collecting taxes from them and in return, what is it the ryots are getting? The ryots are getting nothing, except misery It has been a silent suffering in this area of Jaggampeta for the last 5 or 6 years continuously and it is up to the Government to see as far as possible that the silt from these channels is cleared so that the people

can get not the full crop out of it but at least half the crop Till such time as this happens I am afraid, there shall not be any production but only destruction I am sure the Government s object is not to see that there is destruction but to prevent destruction, and as such, I would very much request the present Government to see that at least this year the Eleru project is being taken up and done at some phase at least I am told that plans and estimates have been prepared and have been asked to be resubmitted to be split up into two schemes At least clearance and maintenance of channels could be done this year I request once again to see that this misery is as far as possible relieved

SRI M KOTI REDDI — అధ్యక్షుమహాశయా కృష్ణానదివరదలను గురించి మన రెవిన్యూమంత్రిగారు చేసిన ప్రకటనలో ఒక్క గుంటూరుతాలూకాలో తొమ్మిదిగ్రామాలు మాత్రమే వరదకు గురిఅయినవనీ 15 వేల ఎకరాల భూమి దెబ్బతిన్నదని సుమారు అయిదువందల యిళ్లు దెబ్బతిన్నవని తెలియజేశారు కాని కలెక్టరుగారువ్రాసిన రిపోర్టువల్ల మంత్రిగారు ఆవిధముగా చెప్పివుంటారని నా ఉద్దేశ్యము కలెక్టరుగారుకూడ వరదవచ్చిన గ్రామాలన్నికూడా పోయి చూచి ఉండరు వారియొక్క subordinate officers వ్రాసిన రిపోర్టునే కలెక్టరుగారు ప్రభుత్వానికి పంపివుంటారు కలెక్టరుగారు 7 8 గ్రామాలకంటె ఎక్కువ దెబ్బ తినలేదని అన్నారుగాని కలెక్టరుగారితో నేనుకూడ వెళ్లిచూచాను చూచిన 7, 8 గ్రామాలలో సంభవించిన నష్టాన్నిగురించే వారు రిపోర్టుపంపించి ఉంటారు కాని మిగత గ్రామాల పరిస్థితి రిపోర్టుచేసి ఉండలేదు కలెక్టరుగారికికూడ యితర గ్రామాలలోని నష్టముసంగతి యిది అని వారికి అందియుండదు అందటానికి, వరదలవల్ల, గ్రామాలనుంచి సమాచారము తెలయటానికైనా నీరు జాస్తిగా ఉన్నది ప్రజలు రాకపోకలులేవు సమాచారము చెప్పటానికైనా ఎవరూవచ్చిచెప్పే అవకాశాలులేవు నీటిప్రవాహము అంత ఎక్కువగా ఉన్నదన్నమాట ఉండవల్లినుంచి వైకుంఠపురము వరకూ సుమారు 16 17 మైళ్ల దూరమున 7 8 మైళ్ల వెడల్పున 7 8 అడుగుల నీరువచ్చింది. అందువల్ల ఆ గ్రామములకు వెళ్లి పరిస్థితులను విచారించి రావటానికైనా అవకాశాలులేవు పెనుమాకనుంచి లాంచీలమీద బయలుదేరివెళ్లి సుమారు 7 8 గ్రామాలు మాత్రము మాడగలి గాము మిగతా గ్రామాలకు మాత్రము వెళ్లి చూడటానికి మాకు వీలులేకుండా పోయింది నీటిప్రవాహము ఎక్కువగా ఉన్నందువల్ల లాంచీలవాళ్లుకూడ భయపడి రాలేదు చిన్న పడవలమీదనైనా వెళ్లుదాము రమ్మని నేను కలెక్టరును కోరి నానుకాని, నీటిప్రవాహమునకు భయపడి ఆయన రాలేదు. గ్రామాలలో ఎంత నష్టము వచ్చిందో రిపోర్టు చెయటానికైనా village officers కు ఆదేశములు పంప

టానికైనా మార్గాలులేకుండా పోయిన పరిస్థితులు ఉన్నవి పడవలవాళ్లకు ఒక్కొక్కరికి 20 25 రూపాయలు అయినా యిస్తామని అన్నప్పటికినీ వాళ్లురాలేదు మేమువస్తామని అన్నవారు ఎవరూకూడ రాలేదు వరదప్రవాహపు రోజులలో కృష్ణాయిపాలెం నుంచి పెనుమాకకు మైలుదూరము ఉన్నది ఆ మధ్యఉన్న గ్రామాలుఅన్నీ మునిగిపోయినవి జనము ఎక్కడికి పోవటానికైనా మార్గాలు లేవు కూలిమనిషికి ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపాయో అంతకుపైగానో యిచ్చి మనుష్యులను ఎల్లలతోసహా పెనుమాకకు యింకా యితర సురక్షిత ప్రాంతాలకు చేరవేశారు ఒక్కమైలు దూరానికే ఒక్కరూపాయి కూలి అడిగి ఉంటే యిక అక్కడ దూరములోఉన్న ప్రజలు తమప్రాణాలను రక్షించుకోటానికి ఎంతడబ్బు ఖర్చుపెట్టియుంటారో ప్రభుత్వం గుర్తించాలి అయినవోలు గ్రామమునుంచి పెనుమాకకు సుమారు నాలుగున్నర అయిదుమైళ్ల దూరము ఉంటుంది ఈ నాలుగు అయిదుమైళ్ల దూరమునకు నలుగురు మనుష్యులు 20 రూపాయలు యిచ్చి మాగ్రామానికి వచ్చారు అట్లా గ్రామాలనుంచి రావటానికిగూడ ఎంతో కష్టముతోనైనా రావటానికైనా అవకాశము లేకపోవడమువల్ల village officers అయినా రిపోర్టు పంపటానికి వీలులేని పరిస్థితులు ఉన్నవి అక్కడ పైర్లు పూర్తిగా వరదలపాలు అయిపోయినవి ఆ భూములలో సగానికి పైగా పునాసపైరు వేసియున్నవి అవిఅన్నీ పూర్తిగా పోయినవి

సుమారు 100 మైళ్లు వరదప్రాంతం దానిలో సగంపైగా పునాస పైరు మాకు ప్రధానమైన పంట మొక్కజొన్న వేరుసెనగ కంది పంటలు పోవడమే కాకుండా గ్రామంలో 150 200 ఎకరాల పశువుల బీళ్లు మునిగిపోయినవి పశువులకు గ్రాసంలేక ఈ గ్రామాలవారు అల్లాడుచున్నారు అన్నం పట్నాలలో కొనుక్కోగలం గాని వాములు తడిసిపోయినందున పశువులకు చాలా కష్టంగా ఉన్నది వేసనపైరులు ఒక్కసారి కాకుండా 3 సార్లు మునిగిపోయినవి ఇదివరకు ఆనకట్టమీద 3 అడుగులు తలుపులు ఉండగా మాకు వరదలు రాలేదు గాని ఇప్పుడు 6 అడుగులు వేసినతరువాత ప్రవాహం ఎక్కువ అగుచున్నది ఇప్పుడు barage కట్టి 12 అడుగులు పెంచిన తరువాత ఎప్పుడూ నీరు ఉంటుంది అలా చేస్తే 12 feet నీరువస్తే దాదాపు 10 000 ఎకరాల భూమి నీటిలో ఉండవలసి వస్తుంది అదివరకు మాకు ఎప్పుడూకూడా 16 feet ఆనకట్టమీద వస్తేనేగాని మా భూములు మునిగేవికావు ఇప్పుడు 6 అడుగుల నీరు వస్తేకూడా పొంగుతుంది కాబట్టి తలుపులు పెట్టినతరువాత క్రిష్ణ మెరకవేసి 12 అడుగులు పెడితే మా గ్రామాలు నీటిలోనే ఉంటాయి ముఖ్యముగా క్రిష్ణాయపాలెం, వేములపాలెం, మందడం మల్కాపురం ఇపుడు నీటిలోనే ఉన్నాయి వెంకటపాలెం

క్రిష్ణకు 1½ మైళ్లు ఉండేది ఇప్పుడు ఒడ్డు కోసుకువచ్చి రెండు ఫర్లాంగుల దూరము లోకి వచ్చింది క్రిందటిసారి చెప్పిన 300 ఎకరాలు నదిలో కలిసింది పెనుమాకలో 100 ఎకరాలు నదిలో కలిసిపోయింది కాబట్టి వెంటనే sanction చేస్తారని అనుకొంటున్నాను మొన్న సంజీవరెడ్డిగారు వచ్చి క్రిష్ణా గుంటూరువారికి ఇంత నష్టం కల్గిందని నాకుతెలియదు అన్నారట నాగార్జునసా రు వచ్చినతరువాతకూడా వరదలు వస్తాయని ఇంజనీర్లు చెబుతున్నారు కరకట్టగస్తుందని అనుకొంటున్నాము ఒడ్డుకోస్తుందని చెప్పినాకూడా అతీగతీ లేదు వెంకటాయపాలెం మునిగిపోయింది మాకు రక్షణ ఇవ్వాలని మనవి చేస్తున్నాను మేము డబ్బు వసూలుచేసి ఇవ్వడానికి సిద్ధముగా ఉన్నాము కాబట్టి ఆ కార్యక్రమాన్ని వెంటనే నిర్వర్తించాలని మనవి చేస్తూ ఇంతటితో విరమించుచున్నాను

SRI V GOPALAKRISHNA — అధ్యక్షా గోపాలరావుగారు చెప్పినట్లు రాజకీయ ఒత్తిడి బాగాలేకపోవడమువల్ల మాతాలూకాల విషయమై మంత్రివర్గం ఉదాసీనభావముతో చూస్తూ ఉన్నది అది జమీందారీ ప్రాంతముగా ఉన్నప్పుడు క్రమపద్ధతిమీద కృషిచేశారు జమీందార్లు వెళ్లిపోయిన తరువాత ప్రభుత్వస్వాధీనములోనికి వచ్చిన తరువాత కాలువలు silt తీసివెయ్యడానికి sluices పోతే బాగుచెయ్యడానికిగాను కృషిచెయ్యకపోయినందున సుమారు 40 వేల ఎకరాలు భూమి పోతూవుంది 60000 ల ఎకరాలు ముంపుద్వారా పెద్దాపురం పిఠాపురం తాలూకాలలో ఎక్కువగా నష్టముకల్గుతూవుంది ముఖ్యముగా 1949 లో వచ్చిన విపరీతవరదలో 8 రోజులు 8 అడుగుల నీటిలో మునిగిపోయి ఉండింది అంటే ఎంతవిపరీతముగా ఉన్నదో ప్రభుత్వదృష్టికి తమద్వారా తీసుకువస్తున్నాను ఏలేరుకు సమగ్రమైన పథకము తయారైనా రాజకీయపార్టీల ఒత్తిడి లేకపోవడంవల్ల కాబోలు మేము Betterment Tax కడుతున్నప్పటికి మాకు ఏమీచెయ్యకపోవడం చాలా శోచనీయమైన విషయము ఏరాపురం పెద్దాపురంతాలూకాలలో ఎండిపోవడం మునిగిపోవడంకూడా ఉన్నది తుని కాకినాడ తాలూకాలలోకూడా దానివల్ల సాగుఅగుతుంది ప్రతిసంవత్సరం నాట్లుపోవడం జరుగుతూ ఉంది అవి మెట్టప్రాంతాలు అవడంవల్ల మాకు రాజకీయ పలుకుబడి లేనందువల్ల ఆపథకము ఏరోజుకు ఆరోజు వెనుకబడుతూవుంది అనేకవిధములైన పన్నులు వేస్తున్నాము ఏవో మంచిపనులు చేస్తామని చెపుతూ ప్రచారము చేస్తున్నాము మాతాతలు నేతులుతిన్నారు మామూతుల వాసనచూడండి అన్నట్లుగా ఉంది మామూలుపంటలకుగాని, వాణిజ్యపంటలకుగాని ఉపకరించే పనులుచేస్తే ప్రభుత్వంమీద వచ్చే criticism తప్పించేందుకు వీలుఉంటుంది ఇప్పటికైనా వరద నిరోధక పథకములను estimates తయారుఅయిన వాటిని, అనుగుణ్యంఅయిన

వాటిని take up చేసి రాజకీయచతురంగంగా తీసుకోకుండా తప్పకుండా చేస్తారని నమ్ముచున్నాను

SRI P NARASIMHAPPA RAO — అధ్యక్షా ఈ వరదలను గురించే ఇదివరకు మన రెవెన్యూ మంత్రి Statement యిచ్చారు ముఖ్యంగా చివరలో వున్నటువంటి Sreekakulam జిల్లాను కూడా అందులో కలిపారు కాని ఒక్కటిమాత్రం నేను వారితో మనవిచేస్తున్నాను ఇదివరకు మనము మద్రాస్ గవర్నమెంటులో వుండేటప్పుడు మన ప్రధాన మంత్రిగారు శ్రీకాకుళం జిల్లాలోని వరదలను చూచారు వంశధార నాగావళి స్వర్ణముఖి వట్టిగడ్డ బాహుదా మహేంద్రత వరదలనుకూడా చూచారు ఇపుడు 10—15 సంవత్సరాలనుంచి కూడా వరదలు ప్రతి సంవత్సరం రావడము Villages అన్నింటిలోకూడా ఏటి ఇసుకను తెచ్చి పెట్టడమువల్ల దిబ్బయిపోవడము యీరకంగా జరుగుతున్నది అక్కడి ప్రజలు ఎన్నోసార్లు వ్రాసినాకూడా వచ్చి చూచేవాండ్లుకూడా కన్పించడము లేదు సుమారు 8 గ్రామాలు వరదలలో 3 రోజులు చిక్కుకొని పోయినాయి గోపాలపురం అనే Village లో వరదలు ప్రతి సంవత్సరముకూడా దిబ్బలు వేస్తున్నాయి ఇతర Village నుంచి ఆ Village కు పోవడం సాధ్యం కాదు ఆ Village కి తెప్పమీద వెళ్లి భోజనము యిచ్చారు ఈ మాదిరి పరిస్థితులలో వున్నటువంటి Villages శ్రీకాకుళం జిల్లాలో ఎన్నో వున్నాయి విశాఖపట్టణం జిల్లాలోకూడా వున్నాయి శారద మొదలైన నదులు వున్నాయి యీ నదులకుకూడా వరదలు వచ్చి Villages కొట్టుకపోతున్నాయి కొల్లేరు బుడమేరుకు వరదలు వచ్చాయనేసరికి విమానంమీద వెళ్లేటట్లుగా పరుగెత్తి చూస్తున్నారు కాని మా జిల్లాలో - పోని మంత్రులు కాకపోతే District officers ఐనా వచ్చి చూడడములేదు అందునుగురించి ముఖ్యంగా యీ వరద నివారణకు నందివాడ ఆనకట్ట కట్టితే యీ నాగావళి నదిక్రిందవున్న గ్రామాలకు అన్నిటికీ నీరు రాకుండా వుంటుందని నేను మంత్రిగారికి మనవిచేస్తున్నాను నారాయణపురం దగ్గర కట్టినారంటే వున్నవారికి అజీర్ణ జబ్బుకు అన్నము పెట్టినట్టు ఇక్కడ కట్టడమంటే నారాయణపురం ఆనకట్ట అవసరములేదని ఇదివరకు గవర్నర్ గారు ఆపారు దీనిని ఇపుడు మళ్లీ బయట పెట్టారు నందివాడ దగ్గర కట్టాలని చెప్పి ఎన్నో సంవత్సరాలనుంచికూడా వున్నది ఇదివరకు ప్రకాశంగారి గవర్నమెంటు నారాయణపురం దగ్గర అది కట్టాలన్నా తర్వాత గవర్నర్ పరిపాలన వచ్చినపుడు అదికట్టడం ఆపారు మళ్లీ ఇపుడు దానిని బయట పెట్టారు మేము వద్దని చెప్పడములేదు కాని నందివాడ ఆనకట్టకూడా కట్టితే బాగుంటుంది

చంద్రమౌళిగారు చెప్పుతున్నారు - మీకు మేము నష్టము యిస్తున్నాము అని మీరు ఎంతయిస్తే మాత్రము రైతుకు కడుపునిండగలదు ? మీరు అదనంగా సదుపాయాలు చేసినపుడే ప్రజలకు సౌఖ్యం కల్గుతుందని మనవిచేస్తూ యింతటితో విరమిస్తున్నాను

SRI T V RAGHAVULU — అధ్యక్షా ఈ వరదల విషయంలో పలువురు ప్రసంగించివున్నారు ఐతే యీ వరదలనుగురించి సామాన్యమైన అమాయక ప్రజలు ఏవిధంగా అనుకుంటున్నారో ప్రభుత్వముకూడ అదే దృష్టిలో వుండడమనేది చాల విచారకరము ఇప్పుడు 1956 లో వున్నాము ఆధునిక శాస్త్రపరిజ్ఞానము ఆధునిక వ్యవసాయ పద్ధతుల విషయాన్ని తెలుసుకున్న ప్రభుత్వము కేవలము మామూలుగా పరిటిగా యీ floods వస్తున్నాయని చెప్పితే బాధ్యతారహితంగా వుండడమనేది చాల విచారకరము ఈ వరదలవల్ల కలిగిన నష్టము అటు రైతులకు అనండి ప్రజలకనండి ప్రభుత్వానికనండి అపారము వరదలు వచ్చినతర్వాత మాత్రము అక్కడకు వెళ్లి సానుభూతితో ఉపన్యాసాలు యివ్వడముతోనే మన కర్తవ్యము తీరిపోతుందని అనుకుంటే చాల విచారకరము ఇది నిజంగా చాల శోచనీయము వరదలు మనచేతులలోలేవు Control చేయడము సాధ్యముకాదు అనుకోవడము చాల పొరపాటు ఆధునిక శాస్త్రాలు చాల పెరిగిపోయాయి ఆధునిక పద్ధతులగురించి మనము ఆలోచించుకోవాలి ఈ ప్రమాదము ప్రతిఏట కాకపోతే 2—3 సంవత్సరాలకు వస్తుందనే సంగతి మనకు ప్రకృతి record చేసి చూపించినది దీనినిగురించి మనము ఏమి ఆలోచన చేస్తున్నాము ? మన policy ఏమిటి ? కేంద్ర ప్రభుత్వము యిచ్చిన సహాయము మనము ఏవిధంగా యీ వరదనివారణకు ఉపయోగిస్తున్నామంటే ఆవిషయంలో మనము చేస్తున్నటువంటి కృషి చాలతక్కువ ఈ విషయములో ప్రభుత్వము ఇప్పుడైనాసరే శాశ్వత వరదనివారణను గురించి ఆలోచించి వెంటనే Engineering Staff ను పంపించాలి యుద్ధసమయంలో మనము ఏలాఆలోచిస్తామో అదేరకంగా మనము war footing మీద యీ problem ను మనము treat చేస్తేతప్ప తాబేలుమాదిరిగా పరుగెత్తుతుంటే మాత్రం మనము రైతుప్రాణాలతో చెరలాటలాడుతున్నామన్నమాట ఉప్పు time లో వరదవచ్చి ముంచివేస్తుంది పశువులకు గ్రాసముఉండదు రైతులకుచాల నష్టము కల్గుతుంది ప్రభుత్వము ఏదో అప్పుయిస్తామనో లేక యివ్వవలసిన అప్పుకు వాయిదాలు ఎక్కువచేస్తామనోచెప్పి పూరికేవున్నట్లయితే మనబాధ్యతను నిర్వర్తించలేకపోతామని చెప్పుతున్నాను ఎర్రకాల్వను గురించి గతసంవత్సరం దానివల్ల వచ్చిన ఉపద్రవం మంత్రిగారు చూచారు రివెన్యూబోర్డు మెంబర్ కూడాచూచారు వరదవచ్చినప్పుడల్లా వారు చూడడమేనా ? దాని నివారణోపాయమును గురించి

మాత్రము ఏమిఆలోచించరు దానినిగురించి ఏమిచర్య తీసుకున్నారని అడుగుతున్నాను అదెవిధంగా కొల్లేరుకూడా చిరకాలంగా పరిచయములో వున్న విషయమె అనుభవంలోవున్నటువంటి విషయము బుడమేరునుగురించి ప్రతి తెలుగువానికి కూడా తెలిసినవిషయమే దీనినిగురించి ప్రభుత్వం ఏమి priority యిచ్చిందని అడుగుతున్నాను మనము యిచ్చిన రెమిషన్ లెక్కలు తీసుకుంటే యీవరదనిరోధక పథకం ప్రభుత్వానికి ప్రజలకు ఎంతసౌకర్యముకూర్చేదో మనము ఆలోచించేవాండ్లముకాని దానినిగురించి ఎందుచేతనో అశ్రద్ధగా ఆలోచించారని నేను అనుకుంటున్నాను కావలసినంత సానుభూతి దీనిమీద చూపించి వెంటనే ప్రత్యేక Engineering Staff ను పంపి ప్రభుత్వము ప్రజలకు సహాయము చేస్తుందని ఆశిస్తున్నాను

SRI S BRAHMAYYA — అధ్యక్షా ఈ వరదలను గురించి చర్చించడానికి అవకాశము కలుగజేసినందులకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను అయితే సమగ్రంగా చర్చించడానికి మాత్రము సదవకాశాన్ని కలుగజేయాలి ఐనప్పటికీ సభ్యులకు కొద్దికొద్దిగాయిచ్చిన వ్యవధిలోనే వారి అభిప్రాయాలు చెప్పడానికి ప్రయత్నంచేయడంతో సరిపోతుంది ఈమధ్య ముఖ్యమంత్రిగారు కొల్లేరుపర్యటనచేసి వచ్చారు ఆకొల్లేరుప్రాంతమంతా జలమయమై ఎన్నిగ్రామాలకునష్టమువాటిల్లనది ఎన్ని వేనవేల ఎకరాలకునష్టము కల్గింది అంతావారు సమగ్రంగా చూచివచ్చారు అక్కడ వారు కష్టాలుకూడా అనుభవించి వచ్చారు దారితెన్ను కన్పించక ఇంకా అనేకవిషయాలు వారుచూచివచ్చారు ఇపుడు ముఖ్యంగా నానియోజకవర్గంలో యీ కొల్లేరు వల్ల 10–11 గ్రామాలు దెబ్బతిన్నాయి యీ గ్రామాల నన్నింటిని గురించి మాట్లాడడానికి అవకాశము లేదు ఎందుచేత నంటే నేను కొల్లేరుకు రెండు పర్యాయాలు వెళ్లడానికి ప్రయత్నంచేసినాను - జులై 27 వ తేదీ ఆగస్టు 6వ తేది కాని దారితెన్ను తెలియక వెళ్ళడానికి అవకాశం లేకుండాపోయింది పూర్తిగా చూడలేకపోయినాను ఐతే శ్రీపర్రు కలపర్రు మాహూరు మహేశ్వరపురం అనే గ్రామాలకు వెళ్ళడానికి అవకాశంకల్గింది దారికొంతవరకు సరిగవున్న కారణంచేత శ్రీపర్రు గ్రామాన్ని గురించి ఒక చిత్రాన్ని చిత్రించి చెప్పినట్లయితే మనస్సుకు చాల దుఃఖముగావుంటుంది శ్రీపర్రు ఏలూరుకు 5 మైళ్ళదూరంలో మాత్రమువుంది ఆగ్రామానికి సంబంధించిన ఆయకట్టు 150 ఎకరాలుమాత్రమే ఐతే ప్రతిసంవత్సరంకూడా ఒకవైపునుంచి కొల్లేరు రెండవవైపునుంచి బుడమేరు మూడవవైపునుంచి తమ్మిలేరువచ్చి ఆగ్రామస్థులకు అపారమైననష్టం కల్గుతున్నది తిండికి దాచుకొన్నటువంటి గింజలుకూడా జలమయమైపోవడము ప్రభుత్వానికి తెలుసు

పశ్చిమ గోదావరిజిల్లా కలెక్టరుగారు కొల్లేరును గురించి సమగ్రమైన రిపోర్టు పంపినట్లు నాకు స్పష్టంకావడంలేదు ఎందుకంటే Revenue శాఖామాత్యులు వారి రిపోర్టులో నా నియోజకవర్గానికి సంబంధించి రెండుగ్రామాల గురించే ఉదహరించడం జరిగింది కాని ఈ 10 12 గ్రామాలను గురించి ఏమీ ఉదహరించలేదు పశ్చిమగోదావరి జిల్లాకలెక్టరు ఈ విషయంలో కొంచెము అలక్ష్యంగానే వ్యవహరిస్తున్నాడని చెప్పడానికి నేను వెనుతీయడంలేదు ప్రభుత్వం కూడా ప్రజలతో ఈవిధంగా వ్యవహరించిన ఎడల వారిని హెచ్చరించవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉన్నదని పదే పదే మనవిచేస్తున్నాను ఇంతమంది సభ్యులు మాట్లాడినప్పటికి నామనవి ఒకటే ఈ అన్నివిషయాలు ఇక్కడ చెప్పడానికి అవకాశంలేదు కాబట్టి ఈ కొల్లేరు బుడమేరు తమ్మిలేరు ఉప్పుటేరు అన్నిటికి సంబంధించినటువంటి సమగ్రమైన పథకాన్ని తయారుచేసే ప్రభుత్వానికి అందచేసే - ఎర్రకాల్వను కూడ - వాటియొక్క వరదనిరోధక పథకాలను తయారు చేయడానికి ఒకఅధికార అనధికారులతో కూడినటువంటి ఒకఉపసంఘాన్ని వేయవలసినదిగా Revenue శాఖామాత్యులకు మీద్వారా మనవిచేస్తున్నాను ఒకవిషయంనాకు తెలుసు కేంద్రప్రభుత్వంకూడ ఈ వరదనిరోధక పథకాలకుగాను గ్రాంట్లుఇస్తున్నది ఆగ్రాంట్ను సద్వినియోగం చేయడానికి ప్రభుత్వం ప్రయత్నంచేయడంలేదని నాకు అనుమానం కేంద్రప్రభుత్వం ఇచ్చినగ్రాంట్లు సక్రమంగా సద్వినియోగం చేసుకొనే బాధ్యత ప్రభుత్వానిదైఉన్నది కేంద్రప్రభుత్వానికి తెలియపరచినట్లయితే వెంటనే చర్యతీసుకొనడానికి కావలసిన ధనం గ్రాంటురూపంగా ఇవ్వడానికికూడ అవకాశాలు ఉన్నాయి నిన్న నేఒక M P నాకుకలిశారు కేంద్రప్రభుత్వం ఇవిఅన్నీ investigation జరిపి ఈవిషయాలు అన్నీకూడ తెలియపరచవలసినదిగా ఒకఅధికారిని పంపించడం జరిగింది వారిరిపోర్టుకూడ కేంద్రప్రభుత్వానికి చేరుకుంది కాబట్టి మనరాష్ట్ర ప్రభుత్వంకూడ ఈవిషయాలన్నీ కేంద్ర ప్రభుత్వదృష్టికి తీసుకొనిరావలసిన అవసరంఉంది అని మనవిచేస్తున్నాను ఒక చిన్నవిషయం శ్రీపర్రు వెళ్లేదారిలో 3-/ mile stone దగ్గర ప్రతిసంవత్సరంకూడా తమ్మిలేరువచ్చి ఆ drain గట్టును పాడుచేస్తుంది Highways వారు వస్తారు చూచి వెళ్లుతారు P W D వాండ్లు వస్తారు చూచి వెళ్లుతారు ఇన్నిసంవత్సరాలుగా ప్రభుత్వానికి రిపోర్టును పంపిస్తూనే ఉన్నారు కాని అక్కడవేయవలసిన గట్టుమాత్రం వేయడానికి చర్యలు తీసుకొనడంలేదు ప్రభుత్వం ఎంతో ఖర్చుపెట్ట నక్కరలేదు కొద్దిలోనే అయిపోతుంది ఆ మైలు stone గుర్తులో ఉంచుకొని కలెక్టరుకు ప్రభుత్వం తెలియపరచవలసిన బాధ్యత ఉన్నదని మనవి చేస్తున్నాను ఇవి అన్నీకూడా ఒక కమిటీ వేసినపుడు ఆ కమిటీ వారికి నేనువెళ్లి చెప్పుకోవలసిన విషయాలుగాని మీరు ఇచ్చిన 5 నిమిషాలలో ఇవి అన్నీ ఏకరువుపెట్టడానికి నావల్లకాదని నేను సెలవు తీసుకొంటున్నాను

SRI M RAJESWARA RAO —అధ్యక్షా ఈ సంవత్సరం కృష్ణాజిల్లా వరదల మూలంగా మూడురకాలుగా నష్టపడినాము మొట్టమొదట బుడమేరు, రెండవది బందరు దివితాలూకాకు సంబంధించిన గుండేరు మూడవది కృష్ణానది ఈబుడమేరును గురించి మిత్రులు విశ్వేశ్వరరావుగారు పూర్తిగా చెప్పారు బుడమేరును గురించి అసమగ్రమైన పథకం diversion reservoir కరకట్టలు పెంచడం, ఇంకా వీలైతే ఉప్పుటేరును strengthen and widen చేయడం ఇవి అన్నీకూడు చాల తీవ్రంగా వాదోపవాదాలలో ఉన్నాయి అయితే పోయిన సంవత్సరం మన నీటిపారుదలశాఖా మంత్రిగారు, సంజీవరెడ్డిగారు ఈ వరదలు వచ్చినప్పుడు ఎన్నో ప్రజాసంస్థలు విజ్ఞప్తులు చేస్తున్నప్పటికిన్ని అక్కడ ఉన్నటువంటి వాస్తవిక పరిస్థితులను చూస్తూకూడ దానిని ఏదో ఒకరకమైనటువంటి political issue గ తీసుకొన్న కారణంచేతనో నేనేస్వయంగా ఈ సంవత్సరంవెళ్ళితే తప్ప దీనినిగురించి ఒక నిర్ణయానికి రాలేననివారు చెప్పడం దానికి తగ్గట్టుగానే వరదలు రావడం, బహుశా వారికి సరియైనటువంటి అవకాశం దొరికింది అనుకొంటాను ఈసారి మంత్రిగారు వెళ్ళారు చాలా విజ్ఞప్తులు వారికి చేశారు యదార్థంగా ఉండే పరిస్థితులను వారు చూచారు దానినిబట్టి మన ఉపముఖ్య మంత్రిగారు తన దృక్పథమును మార్చుకొంటారని నాకు విశ్వాసము ఉన్నది ఎందుచేతనంటే ఈవేళ బుడమేరును గురించి ఎవరుకూడ పార్టీదృష్టితో మాట్లాడడంలేదు. అయితే మనకు ఎంతోమంది ఇంజనీర్లు పెద్దపెద్దవారలంతా కలిసి ఈ reservoir కావలెను అని నివేదికలు ఇచ్చి ఆమోదించి, Flood Control Scheme లో చేర్చి, దానిని మన కేంద్ర ప్రభుత్వంచేత కూడ ఆమోదింపచేసినప్పటికి కూడ, ఏదోఒక దృష్టి మనస్సులో పెట్టుకొని మనకు ఇది పనికిరాదనే నిర్ణయానికి మన ప్రభుత్వము ముఖ్యంగా మన ఉపముఖ్యమంత్రిగారు రావడం మాకందరకు తెలుసు అయితే ఇప్పుడున్న పరిస్థితులనుబట్టి మళ్ళీ పునరాలోచించి ఏదో కొద్దిమంది వ్యక్తులకు సంబంధించినది కాకుండా ఏదో కొంతమంది స్వార్థం కోసం రాజకీయపక్షానికి సంబంధించినది కాకుండా ప్రజానీకానికి అంతటికి కూడ సంబంధించినది అనేవిషయం వారిదృష్టిలో పెట్టుకొని దానిని పరిష్కరిస్తారని నేను విశ్వసిస్తున్నాను. ఈరోజు వారు ఇక్కడ ఉన్నట్లయితే ఈ debate చాల ఉపయోగకరముగ ఉండేది.

ముఖ్యంగా లంక విషయాలను గురించి ఒకటి రెండు విషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకొని రాదలచాను నేను దివి తాలూకానుంచి వచ్చాను. అక్కడ ఎక్కువగా లంకలు ఉన్నాయి కృష్ణానదివల్ల ఏర్పడినవి ఈ లంకలకు విపరీతమైన నష్టం సంభవించింది. మొన్న మంత్రిగారు ఇచ్చినటువంటి నివేదికలో ఎంత

నష్టం సంభవించిందో పూర్తి వివరాలు వారికి అందలేదు అక్కడ communication లేకపోవడంవల్ల అక్కడ ఉన్నటువంటి సమాచారం అంతా రాలేదని కూడ వారు చెప్పారు తర్వాత కలెక్టరుగారు ఎంత నష్టం కలిగిందనే విషయం గురించి statement చేసినట్లుకూడా నాకు గుర్తు అందుకుగాను ఈ లంకలలో ముఖ్యంగా గుర్తించవలసినది ఒకటి ఇక్కడ కరకట్టలు అన్నికూడ బలహీనం అయిపోయినాయి ఈ లంకలలో చుట్టు ఉన్నటువంటి గట్లు బలహీనం అయిపోయి ఉన్నటువంటి కొద్ది ఇండ్లుకూడా పడిపోవడానికి సిద్ధంగా ఉన్నాయని చాల భయంగా ఉన్నది అందుచేత దానికి ఒకటి ఆలోచన చేస్తున్నాము ఇదివరకు రెల్లుగడ్డి వగైరాలను గట్లపై పెంచడం వాటిమూలకంగా ఈ కట్టలను బలం చేయడం జరుగుతూ ఉండెడి అయితే 20 సంవత్సరముల క్రితం ఎప్పుడో ఏదో ఒక Chief Engineer గారో ఇంకొక ఇంజనీరుగారో ఇవి పెంచడంవల్ల అంత ఉపయోగం లేదని అనడం కారణంచేత ఈ రెల్లుగడ్డిని పెంచడం మానివేయడంవల్ల ఇపుడు గట్లుఅన్నీ బలహీనం అయిపోయినాయి అందుకోసం ప్రభుత్వం వారు మళ్లీ దానిని పునరాలోచించి గట్లు బలపడాలంటే రెల్లుగడ్డి పెంపకం తిరిగి పునరుద్ధరించటంకోసం ప్రయత్నం చేయవలెనని మనవిచేస్తున్నాను

లంకలలో ఇండ్లు పడిపోయినవారికి ఇంకా ఇతర విధములుగా నష్టపడిన వారికి ఏదో కొంతమంది వ్యక్తులు సహాయము చేస్తున్నా ఈ సహాయంవారికి చాలదని చెప్పుచున్నాను ప్రభుత్వంకూడ తగినటువంటి శ్రద్ధ తీసుకొనవలెను ఎప్పుడు కూడ రానటువంటి విధంగా ఈనాడు ఎన్నోరోజులు continuous గ ఈ వరదలు రావడంచేత అక్కడ ఉన్నటువంటి ఇండ్లకు ఇదివరకులేనటువంటి విపరీతమైన నష్టం ఇపుడు జరిగింది సాధారణంగా ఆ లంకలలో వరదలురాకుండా చేయడం ఎవరితరంకూడా కాదు అయితే వాండ్లకు సహాయంచేయడం ప్రభుత్వవిధి అని నేను చెప్పుతూఉన్నాను ముఖ్యంగా పశువులకు గడ్డిలేదు వారికి private వ్యక్తులు భోజనవసతులు కలుగచేస్తున్నారు దానికి మీరుకూడా తోడ్పడి వారికి relief కలుగచేయవలెను అనిన్నీ, తర్వాత ఇక మీద నష్టపడకుండా ఉండాలంటే రెల్లుగడ్డి పెంపకంకూడ మీరు పునరుద్ధరించవలెనని మనవిచేస్తున్నాను తర్వాత పెద్దకళ్లేపల్లి ప్రాంతంలో మంగలవానిచింతి అని ఒక drainage ఉన్నది దీనికి automatic shutters ఉన్నవి ఇదివరకుఉన్న drain అంతాకూడ ఈ river లోకి వచ్చిపోతుందనే ఉద్దేశంతోటి automatic shutters పెట్టారు కాని ఇవి అన్ని 'out of order" అనే కారణంచేత drain లో నీళ్లు river లోకి వెళ్లేబదులు river లోని నీళ్లు drain లోకి రావడం సంభవిస్తున్నది అందుచేత చాలా బ్రహ్మాండమైన నష్టం కలిగింది అందుకోసం ఇవి అంతాకూడ ఈ P. W D. వాండ్లు ఇక్క-

నిర్లక్ష్యమని చెప్పడానికి ఏమి సందేహంలేదు అసలు కృష్ణా forecast ఎలా వున్నదో ఇది పైకి ఉబుకుతుందోలేదో వరద ఎప్పుడు వస్తుందో కర్నూలులో ఉండే Supervisor లేక Sub divisional Officer చెప్పాలి కాని మొన్న రాజానగరంనుంచి Superintending Engineer కు ఫోనుచేస్తే నాకుఏమీ తెలియదు ఈవరదలు ఎప్పుడు వస్తుందో Deputy Chief Engineer గారిని అడగండి అని మళ్లీఫోనుచేశాడు Deputy Chief Engineer, Administrative Officer ఇక్కడ పైనుంచివచ్చే వరదలను చెప్పవలసిన ఈయన ముందుగా తెలుసుకొని ఏమైనా precaution తీసుకోవాలని మేము అడిగితే Subdivision officer కు information లేదు Superintending engineer కు information లేదు ఏమిలేకుంటే ఎందుకుఉందో ఈ P W department మాకు అర్థంకావడంలేదు కాబట్టి వరదలు వస్తున్నాయిఅంటే రాఘవులుగారు చెప్పినట్లు కేవలం మీరు ఒక relief ఇవ్వడమేకాదు తాత్కాలికంగా వచ్చినపుడే మనం చూచుకోవడంకాదు రాకముందు కూడ మనం precautions తీసుకోడానికి P W D వారు చాల ప్రమత్తతో ఉండడం చాల అవసరం కాని ఈనాడు అది పూజ్యంఅని చెప్పుటకు నేను వారితో కూడ ఏకీభవిస్తున్నాను అందుచేత ప్రభుత్వంవారు ఈ గుండేరును గురించి బందరు దివి తాలూకాలకు ఏమిసంబంధం లేకుండా communications లు పోయినాయి గుండేరును గురించి ఎంతోకాలంనుంచి ఆందోళన చేస్తున్నా ప్రభుత్వంవద్దడబ్బులేక ఆగిపోయిందని అనుకొన్నాం గాని Irrigation conference లో అడిగితే చాలా కాలంనుంచి estimate లు తయారుచేయలేదు investigation చేయలేదు అంటున్నారు చేయలేదుఅంటే మాకు చాల ఆశ్చర్యంవేసింది అందుచేత 6 నెలలలో estimate లు తయారుచేసి ఇవ్వండి ప్రభుత్వంచేత 4 లక్షల రూపాయలు ఖర్చు అయ్యేటటువంటి గుండేరు scheme ను గురించి, వేలాది ఎకరాలు పాడుచేయడం మీకు ధర్మంగాలేదు అనిచెప్పితే ఈనాటికికూడ రాలేదు అందుచేత ఈవేళ మేము ఎన్నిచేసినప్పటికి కూడ ఈ P W D వాండ్లు అప్రమత్తతలేకుండా పోయినట్లయితే మీరుచెప్పేది అనవసరం మంత్రులుచెప్పినా ఇది జరుగుతుందనే విశ్వాసం నాకులేదు అందుకే C Rajagopalachari గారు అన్నారు 'P W department is my enemy No 2',అని దాంట్లో ఏమిసందేహంలేదు దానితో నేనుకూడ ఏకీభవిస్తున్నాను Revenue వారుకూడ శ్రద్ధ వహించి ఇకమీదట ఇటువంటివి రాకుండా ఉండడంకోసం శ్రద్ధతీసుకొంటారని మనవిచేస్తున్నాను

**SRI M RANGAYYA** — అధ్యక్షా ! మహాశయా ! అకాలంలో వర్షాలు విపరీతంగా కురియుటవలన కృష్ణా పశ్చిమగోదావరి జిల్లాలలోని నదులు ఉపద్ర

వంగాపొంగి చాలా నష్టాన్ని కల్గించాయి కొల్లేరు ప్రాంతంలోని ఏలూరుతాలూకాలో 10 వేల ఎకరములకు పైగా మునిగిపోయింది కొన్ని సంవత్సరముల క్రిందట ప్రభుత్వంవారు కొన్నిలక్షలు ఖర్చుపెట్టి పోతునూరుదగ్గర 5 మైళ్లపొడుగున ఒక కట్టపోశారు అప్పటినుంచీ దానికి repairs చేయించలేదు ఆకట్ట తెగిపోయింది రైతులంతాపోయి జిల్లాకలెక్టరుగారికి చెప్పుకున్నారు సుమారు వెయ్యి ఎకరముల భూమి మునిగిపోయింది గతసంవత్సరం వరదలువచ్చినప్పుడు నేను కూడాపోయి Collector గారికి మనవిచేశాను నాకు ఇప్పుడు time లేదు September నెలలో వచ్చిచూస్తాను" అని వారు చెప్పారు సెప్టెంబరు నెలలో వచ్చిచూచినట్లయితే ఈ వరదలవల్ల ఎంతభూమి నష్టమైందో సరిగాతెలియదు ఆకట్టను ఒకమైలు పొడుగు బాగుచేయించినట్లయితే ఆనష్టం సంభవించదు కొల్లేరుకు 5 మైళ్లదూరంలోవున్న శ్రీపర్రు అనే గ్రామం నేను స్వయంగా వెళ్లి చూచాను

శ్రీపర్రుకు ఏలూరుకు మధ్య ఒక వంతెన (cause way) కట్టినారు అది చాలా narrow గా వుంది West Tammileru river లోని drainage దానిగుండా పోవడంవల్ల ఆ వంతెన narrow గా వుండడంవల్ల 2 వైపుల గట్లుతెగిపోయి నీరు పొలములలోనికి ప్రవహించి పైరులను నాశనంచేస్తోంది West Tammileru river ఏలూరు దగ్గర 50 గజాలు వెడల్పువుంది అది 6 7 అడుగులకంటే వెడల్పులేక పంటబోదెగా తయారైనది ఆ నీరు కొల్లేరులోకి వెళ్ళుటకు మార్గంలేక గట్లు తెంచుకొని ప్రవహిస్తోంది P W D వారు ఈవిషయమును గ్రహించి ఈనీరు కొల్లేరులోకి పోయేందుకు వీలుగా ఒకమైలు పొడవున గట్లు వేయించినట్లయితే రైతులకు నష్టంవుండదు దీనివల్ల రాచకోడు మొండికోడు అనేగ్రామాలకు అపారమైన నష్టం సంభవిస్తోంది కొల్లేరు సరిహద్దులోవున్న ముప్పర్రు, పోణంగి మున్నగు గ్రామాలలోని 10 వేల ఎకరములకుపైగా మునిగిపోతోంది దీనివల్ల అనేకమంది రైతులకు ప్రభుత్వానికీకూడా లక్షలాది రూపాయలనష్టంవస్తోంది ఈ కష్టనష్టాలను మేము స్వయంగా అనుభవిస్తున్నాము ఇప్పుడు మంత్రిగారు ఒకసారివచ్చి అచ్చటి పరిస్థితులను పరిశీలించి నష్టపోయిన రైతులకు remission యిచ్చి తక్కావి ఋణాలు ఇచ్చినట్లయితే చాలా సంతోషిస్తాము ఈ మధ్య ముఖ్య మంత్రిగారు అక్కడకు వచ్చినప్పుడు వివరంగా చూచుటకు వారికి సావకాశం లేక పోయింది తమ్మిలేరు లోని నీరు కొల్లేరు లోనికి పోవుటకు సావకాశం లేకపోవుటవలన ఈ నష్టమంతా సంభవిస్తున్నది ఇది ప్రభుత్వం వారు గమనించి తగిన చర్యలు తీసుకోవాలి Remissions యిచ్చినంతమాత్రాన ప్రయోజనం వుండదు అసలు source of evil ఎక్కడ వుందో పరిశీలించాలి తమ్మిలేరు

కలిసేచోట వెడల్పు చేసినట్లయితే ఈ నష్టం వుండదని నేను మనవిచేస్తున్నాను Engineering Department వారు level పెట్టారు పని మాత్రం జరుగుటలేదు కొద్ది డబ్బుతో పోతునూరు దగ్గర కాలవను బాగు చేయవచ్చు పోతునూరు గ్రామానికి ముంపు నష్టం వుండదు బుడమేరు కొల్లేరు West Tammileru, ఎర్రకాలవ ఉప్పుటేరు మున్నగు వాటిని irrigation schemes గా కేంద్ర ప్రభుత్వానికి పంపించారు బుడమేరుకు కేంద్ర ప్రభుత్వామోదం లభించింది రాష్ట్రప్రభుత్వంవారు ఈ తమ్మిలేరు పథకం వెంటనే అమలుపరచి రైతులకు రక్షణ కల్పజేయాలని కోరుతూ విరమిస్తున్నాను

SRI P KODANDARAMAYYA — అధ్యక్షా! మా ప్రాంతంలోని కొన్ని గ్రామాలు వరుసగా 4 5 రోజులు వరదనీటిలో మునిగి వుంటున్నాయి అది మాకు పరిపాటి అయిపోయింది 1953 లో వచ్చిన గోదావరి వరదలవల్ల మా మానసిక స్థితి చెడిపోయింది గోదావరివస్తే మునిగిపోతామనే భయం వ్యాపకమైంది గోదావరికి ఇవతల పోలవరం మొదలు అవతల పేటిబిడ్డువరకు అవతల అంగులూరునుండి చంద్రవట్ల అనే గ్రామంవరకు ఇంచుమించు 150 మైళ్లలో వుండే ప్రజలకు చాలా క్షీతిగావుంది 1953 వరదలలో నష్టపడిన ప్రజలకు ప్రభుత్వం సహాయంచేసింది అందులకు ప్రభుత్వానికి నా కృతజ్ఞత తెలియజేస్తున్నాను ప్రభుత్వంవారు ఈ వరద నివారణకు ఏదైనా ఒక పథకం తయారుచేసి అమలు జరుపుతారని ఆశిస్తున్నాను కొల్లేరుకు తమ్మిలేరుకు వరదలు వచ్చాయని ఎక్కడో 2 ఇళ్లు పడిపోయాయని రెవెన్యూ మంత్రిగారు ఉపన్యాసం ఇవ్వడంవల్ల ఏమీ లాభంలేదు కేంద్ర ప్రభుత్వంవారు దీనికి ప్రత్యేకించి ఒక Department ను ఏర్పాటుచేసినారు గోదావరి కృష్ణా నదులకు వరదలువచ్చి పొంగి ప్రవహిస్తోంటే ఈ ప్రభుత్వంవారు ఏమిచేస్తున్నారో నాకు తెలియదు ఈపూరుదగ్గర ఏదో చేస్తున్నామని ప్రభుత్వంవారు చెప్పవచ్చు కాని అక్కడ ఏమి చేస్తున్నారో మాకు తెలియుటలేదు ఈ ఉపద్రవమైన వరదలవల్ల మాకు చాలా భయంగావుంది కొల్లేరు ప్రాంతంలోనూ తణుకు నర్సాపురం తాలూకాలలోను ఏదో, సహాయం చేస్తామని మంత్రిగారు అంటున్నారు వాటివల్ల వచ్చేనష్టం బహుస్వల్పం కాని ప్రమాదకరమైన గోదావరి వరదలను నివారించడం అత్యావశ్యకం గోదావరి కాల్వలదగ్గర 20 అడుగుల నీరు ఉన్నట్లుగా పత్రికలలో వార్తవచ్చింది మంత్రులు సభ్యులు అంతా చూస్తున్నారు ఇప్పుడు పోలవరం మున్నగు గ్రామాలలోని ప్రజలు ఏమి అవస్థ పడుచున్నారో తెలియదు వారికి భోజన సామాగ్రి ఏమీవుండదు ఆ ప్రదేశమంతా ఇంచుమించు 150 మైళ్ళ ప్రదేశం గోదావరి నీటితో మునిగిపోయి వుంటుంది నదిలో పడవలు స్టీమర్లు వెళ్లుటకు

Sri P Kodanda Ramayya] [16th August 1956

అవకాశంలేదు మంత్రులెవరైనా వచ్చిచూడాలంటె విమానాలలో రావాలికాని వచ్చుటకు వేరు మార్గంలేదు ఇటువంటి గడ్డు పరిస్థితులను నివారించాలని కోరుతూ విరమిస్తున్నాను

SRI R TIRUPATHI RAO — అధ్యక్షా గోదావరి ముంపువల్ల తూర్పుగోదావరిజిల్లా కాకినాడ తాలూకా పల్లెపాలెంఫర్కా రామచంద్రపురం తాలూకా వెంకటాపాలెం ఫర్కాలు చాల విపరీతమైనటువంటి వరదలకుగురై చాల భూములు మునిగిపోయినాయి కోరంగిప్రాజెక్టును 1951 లో నిర్మించారు ఆప్రాజెక్టుక్రింద షుమారు 10 వేల ఎకరాలు సాగవవలసిఉన్నది కాని 4 5 వేల ఎకరాలకంటె ఎక్కువ సాగుచేయలేకపోతున్నారు ఈ 4 5 వేల ఎకరాల సాగు బడిచేసినటువంటి రైతులే పెడు భూములు కూడా అమ్ముకొన్నప్పటికి చాలని అప్పు స్థితిలో ఉన్నారు తక్కావి ఋణాలు పుచ్చుకొని manure loans పుచ్చుకొని ఇంకా ఎన్నో ఇతరఅప్పులుచేసి సాగుచేసినప్పటికి ప్రతిసంవత్సరము వరదలవల్ల కొట్టుకొని పోవుటేగాని ఇంతవరకు ఒక ఎకరములో ఒకబస్తాధాన్యము పండించి నటువంటి రైతు పలెక్కలలోను కనబడదని నేను తమకు మనవిచేస్తున్నాను అచ్చట ఏటిగట్లు వేయవలెనంది ఎన్నోరోజులనుంచి అక్కడ ప్రజలు ఆందోళన చేయు చున్నారు ఇంతవరకు estimate వేయడమేగాని పనిమాత్రం జరగడంలేదు ప్రతి సంవత్సరము మునిగిపోతున్నాయి భూములను అప్పులక్రింద వేలము వేయుటకు జప్తులుచేసి రైతులను ఎన్నోబాధలు పెడుతున్నారని ప్రభుత్వానికి తెలియజేయు చున్నాను వారి అప్పులబాధను నివారించే నిమిత్తం కొన్ని terms పెట్టి కొన్ని సంవత్సరాల వాయిదామీద తీర్చుకొనే యేర్పాటుచేయాలని ఏటిగట్లు తక్షణం నిర్మించాలని కోరుతున్నాను తరువాత యానాం దగ్గర లాకు కట్టవలసిందని దానివల్ల పల్లెపాలెంఫర్కా వెంకటాపాలెంఫిర్కాలలో ముంపుతగ్గుతుందని ఆ ప్రాంతపువాళ్లు 30 సంవత్సరాలనుంచి ఆందోళనచేస్తున్నారు కాని ప్రభుత్వం దానికి ఎటువంటి అవకాశం చూపించలేదు

ఇకముందుకూడా చూపించదేమోనని భయపడుతున్నారు 30 సం॥లనుంచి ఆందోళనచేయుచున్నా 2 3 లక్షల రూపాయలతో అయ్యేటటువంటి ఈ స్వల్ప పని ఇంతకాలంనుంచి pending లోనే ఉన్నది వరద నివారణ పథకం అమలు చేయకపోయినట్లయితే ఇకముందు రైతులు సాగుచేసి వ్యవసాయం చేస్తా రనే నమ్మకం పోతున్నది వారికి Government మీద నమ్మకం పోవుచున్నది 30 సంవత్సరాలనుంచి ఆందోళన చేయుచున్న ఈ స్వల్పపని అవలేదంటే రైతులు ఎంత నిరుత్సాహపడతారో ప్రభుత్వానికే తెలియాలి పేపర్లలో

ఇతర జిల్లాలనుంచి ఆందోళన ఉన్నదిగాని మాజిల్లానుంచి ఆందోళనలేదంటే మావాళ్లు పేదవాళ్లు ఆందోళనచేసుకోలేని అసమర్థులని మీరు గ్రహించాలి అందువల్ల గోదావరి వరదవల్ల వచ్చేటువంటి ఈనష్టాన్నుంచి రైతులను కాపాడేందుకు ఈ పనులన్నీ నెరవేర్చాలని రుణాలబాధనివారణ నిమిత్తము రైతులకు ఎక్కువ time ఇవ్వాలని నేను కోరుతున్నాను రైతులయొక్క ఆందోళన తగ్గాలంటే వెంటనే ఏటిగట్లు వేయాలి P W D వారు ఈగట్లను ఎవరికో contract ఇస్తే వారు రెండుమైళ్లలో ఒకఫర్లాంగు వదలిపెట్టడం జరుగుతోంది ఫర్లాంగు వదలిపెట్టడంవల్ల రెండుమైళ్లు వెనకటువంటి కొన్నివేలరూపాయలు Government కు నష్టమె ఈ ఫర్లాంగుగట్టు వేయనందువల్ల పొలాలు శుభ్రంగా మునిగిపోతాయి అటువంటప్పుడు రైతుకు శిస్తుతగ్గించినంత మాత్రంచేత వారికేమి లాభముకలుగుతుంది ? అందుచేత P W D వారు neglect చేయకుండా ఉండేటట్లు తగిన చర్య తీసుకోమని ప్రభుత్వమువారిని కోరుతున్నాను

SRI Y CHANNIAH —అధ్యక్షా మా రేపల్లె తాలూకా పల్లంప్రాంతాలలో రాజుకాలవ తెగి అయిదారు వందల ఎకరాలు నాశనము అయిపోయింది ఆ విషయం రెవెన్యూమంత్రిగారి రిపోర్టులోకూడా సూచించారు నానియోజకవర్గంలో ముఖ్యంగా చింతమోడు పెసర్లంక పెదలంక గ్రామాలలో పూర్తిగా భూము నాశనము అయిపోయినాయి అక్కడి గృహాలుకూడా పడిపోయినందున ప్రజలు ఉండడానికి వీలులేకుండా ఉన్నది వారికి గవర్నమెంటువారు ధనసహాయము చేయాలని కోరుతున్నాను రైతులుకూడా చాలనష్టపడ్డారు కనుక వారికి కూడా తగుసహాయం చేయాలని కోరుతున్నాను పెనుమూరునుండి క్రిందకువచ్చే కాలువయొక్క కరకట్ట తెగి చాలగ్రామాలకు ప్రమాదంజరిగేటట్లుఉన్నది ప్రభుత్వం వెంటనే శ్రద్ధతీసుకొని ఆ కరకట్టను మరమత్తు చేయాలని కోరుతున్నాను తుంగభద్ర మురుగుకాలవ వల్ల మాతాలూకాలో కొన్ని గ్రామాలలోని రైతులు చాల నష్టపడుతున్నారు Central Government ఆ పథకాన్ని ఆమోదించినప్పటికి ఇంతవరకు పనులు కావడంలేదు అందువల్ల రాష్ట్ర ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వంముమీద ఒత్తిడి తీసుకొచ్చి తొందరగపని ప్రారంభించాల్సిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను మా రేపల్లి తాలూకాలో ఇదివరకు వరదలవల్ల పడినగండిని రెవెన్యూ మంత్రిగారు కూడా చూసే ఉన్నారు ఇప్పుడు ఎక్కువగా గండి పడ్డది దానివల్ల రైతులు చాల నష్టపడుతున్నారు మా తాలూకా విషయాలు మంత్రిగారికి తెలుసును కాబట్టి మా తాలూకారైతులకు ప్రజానీకానికి సహాకరించవలసిందని కోరుతూ విరమిస్తున్నాను

16th August 1956 ]

SRI R B RAMAKRISHNA RAJU — మీరంతా బాధలు పడడం చూస్తుంటే మామనస్సు కరిగిపోతున్నది కృష్ణా గోదావరిజిల్లాలు నేనుకూడా చూచాను అక్కడి కాలువలుచూస్తే మా నదులుకూడా అంత విశాలంగాలేవు ఆ నీరుచూస్తుంటే మాకందరికి ఉత్సాహం సంతోషము కలుగుతున్నది ఒక విధంగా సంకటముకూడా కలుగుతుంది వీరికేఉంది మాకు లేదేఅని అవన్నీతిప్పి మా చిత్తూరుజిల్లాకు పంపుచేస్తే మీకేబాధ లేకుండా పోతుంది

SRI RAJA V V KRISHNAMRAJU BAHADUR — అధ్యక్షా ప్రస్తుతం తమ సమక్షమందు ఈసభలో వరదలవల్ల వచ్చేనష్టాలు కష్టాలుగురించి ఎన్నోవిధాలుగా ఉపన్యాసాలు ఇచ్చారు ఎక్కువగా డెల్టా area లు కృష్ణా తమ్మిలేరు బుడమేరు ఎఱ్ఱకాలవ విషయం చెబుతున్నారేగాని మా గోదావరి జిల్లాలో ఉండే upland area ల దుస్థితిని ఎవరు గుర్తించలేదనితమద్వారా మనవిచేస్తున్నాను 1928వ సంవత్సరములో తునిలోనుకువరద రావడం ఊరు మునిగిపోవడంవల్ల లక్షలు నష్టపడినసంగతి ప్రభుత్వ రికార్డులలోనే ఉన్నది తరువాత 1944వ సంవత్సరంలో బ్రహ్మాండమైన వరద వచ్చింది దానివల్ల గ్రామాలకు గ్రామాలే కొట్టుకుపోయిన సంగతికూడా Government record ల లోనే ఉన్నది గత సంవత్సరం మేనెల 7వ తేదీ తుఫానుపట్టింది ఆ తుఫానుపట్టిన సందర్భంలో మంత్రులంతా తునిమీదుగా రావడం తుఫానుయొక్క భీభత్సాన్నంతా చూడడం జరిగింది ఈ సంవత్సరం మూడు మాసాలు continuous గా వర్షాలు పడడంచేత చెరువులు తెగిపోయినాయి అంతేకాకుండా ఏలేరు నీరు పంపానది నీరు తాండవానది నీరు ఈ మూడు సముద్రములోకి వెళ్లేముందు మా తుని తాలుకాలో 500 ఎకరాలు గల పల్లపు ప్రాంతాలలో 6 అడుగుల నీరు నిలిచి మునిగిపోవడం జరిగింది అదే విధంగా ప్రతి సంవత్సరము నష్టపడిపోతున్నారు ఈ సంవత్సరము ప్రత్యేకంగా నారులుకూడా పోయినాయి డెల్టా area లకు వెళ్లి లారీకు 72 రూపాయలు అద్దె ఇచ్చి కుంచము నార 2 రూపాయలకు కొని తినుకొచ్చి replantation చేస్తే అదికూడా వర్షంలో మునిగిపోయి అన్నివిధాల నాశనం అయిపోయింది ఇలాంటి ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని ఇటువంటి అనర్ధదాయకపు ప్రమాదాలు రాకుండా కాపాడి రైతులకు తగినటువంటి సౌకర్యాలు కలుగజేయవలెనని కోరుతున్నాను మెట్ట ప్రాంతాలలో ఎక్కువవర్షాలు పడడంవల్ల మా తాలూకాలో నువ్వుచేను, వేరుసెనగ పంట యావత్తు పాడైపోయి రైతులు భ్రష్టులైపోయినారు ఇలాంటి పరిస్థితులను గవర్నమెంటువారు గుర్తించి రైతుల విషయంలో సరైనటువంటి న్యాయం కలుజేగయాలని కోరుతున్నాను Manures జమీందారీ area లో ఉండేటటువంటి joint patta ల వారికి సక్రమముగా సర

ఫరా జరగడం లేదు తగిన సరఫరాలు కలుగజేస్తూ ఆ ప్రాంతాలను దృష్టిలో పెట్టుకొని గవర్నమెంటు తగినటువంటి నీటి ప్రణాళికను ఏర్పాటు చేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను

SRI G NAGESWARA RAO —అధ్యక్షా రెవెన్యూ మంత్రిగారి Statement లో గోదావరి వరదల విషయంలో పోలవరం గురించి చెప్పారు ముఖ్యంగా రాజోలు తాలుకా క్రొత్తపేట తాలుకాలకు సంబంధించినంతవరకు అప్పలపల్లి దొడ్డవరం పెదపట్నంలంక పెదపట్టణం మానేపల్లిలో కొంతభాగం క్రొత్తపేట తాలుకాలో ఏనుగుపల్లి వైకొత్తపల్లి లంకలగన్నవరం గ్రామాలు ఇవన్నిపూర్తిగా మునిగిపోయాయి 6 7 తారిఖులలో వరద మంచి ఉధృతంగా ఉన్న time లో పడవవేసుకొని నేను స్వయంగావెళ్లి చూచాను ప్రవాహము మంచి వడిగా ఉన్నది అప్పనపల్లి వీధుల్లో గుండెల్లోతునీళ్ళు ఉన్నాయి అక్కడ అరుగుల ఎత్తున ఈ ప్రవాహం బాగా వడిగా ప్రవహించడం జరిగింది

కాని ఏనుగుపల్లి గ్రామములో 30 యిళ్లు ఖాళీచేసి ఎత్తుప్రదేశములలో ఉన్న యిళ్లలోనికి సర్దుకున్నారు ఆ 30 యిళ్ల వాళ్లలో ఏ 20 యిళ్లవాళ్లో హరిజన కుటుంబాలు పేదకుటుంబాలు ఉన్నవి ముఖ్యంగా యీ వరదలవల్ల ప్రజలకు తిండిలేకుండా పోయిందని అన్నారు అక్కడ ప్రజలుచెప్పింది చూస్తే పదిరోజులుగా వరదలు వస్తూన్నవి రెండేసి మూడేసిపూటలు తిండిలేకుండా ప్రాణాలు కాపాడుకుంటూ ఉన్నామని చెప్పారు నేనువెళ్లి వారిపరిస్థితి స్వయముగా చూచాను తిండిలేక దొరికిన తాటిపండ్లు వగైరాలు తినుకుంటూ పస్తులు కూడా చేస్తూ కాలముగడుపుతూ వచ్చారు ఇంతలో కొంత వరదలు తగ్గడము వల్ల ప్రాణములుమాత్రము కాపాడుకోగలిగారు వరదప్రాంతాలలో ముఖ్యంగా వైకొత్తపల్లి గ్రామానికిచెందిన సుమారు 200 ఎకరాలకుపైగా వరిచేలుఅన్నీ మునిగిపోయినవి సగినేటిపల్లిలంక, ఉడుములలంక వగైరా లంకగ్రామాలు అన్నింటిలోకి బురద ఎరడాము సోమ నువ్వు మొదలైన మెట్టపంటలు వేసిన గ్రామాలలోని పంటలుఅన్నీ పూర్తిగా పోయినవి వరద ప్రాంతాలవారికి తక్షణము చౌకడిపోలు ఏర్పాటుచేయడము చాలా అవసరముగా ఉన్నది ప్రజలలో బొత్తుగా నిరుపేదలుగా ఉన్నవారికైనా కనీసము 15 రోజుల గ్రాసముఅయినా ఉచితముగాఇస్తే, ముఖ్యంగా నిరుపేదలుగాఉన్నకుటుంబాలకైనా సహాయము చేసినట్లవుతుంది ప్రభుత్వం యీవిషయము గుర్తించి వెంటనే చర్య తీసుకుంటారని ఆశిస్తున్నాను వరద ప్రాంతాలలోఉన్న ప్రభుత్వోద్యోగస్థులు వారియందు నిరంకుశత్వము చూపుతున్నారు ఇళ్లుకొట్టుకుని పోయినందువల్ల వేరేఎక్కడాకూడా తల

దాచుకోటానికి వీలులేకుండాపోయినందున ఎటిగట్లమీద టెంపొరరీగా యిళ్లు వేసు కుంటే అవిఅన్నీ పీకివేస్తూ పశువులను బందిలిదొడ్లో పెట్టుతూ 7 8 రూపాయలు జరిమానాలు విధించుచున్నారు పేదవాళ్లమీద నిరంకుశత్వం వహిస్తే వాళ్ళు బ్రతికేదిఎట్లో ఆలోచించాలి వరదప్రాంతాలవారికి గతములో యిచ్చిన తక్కావి ఋణములను వసూలుచేయకుండా ప్రస్తుతానికి వాయిదా వేయించాల్సిన అవసరం ఉన్నది Fresh గా తక్కావి అప్పులు యిప్పించాలి విత్తనాలు వెంటనే సరఫరా చేస్తే మరల వాళ్ళు పొలాలకు ఉపయోగించు కుంటారు మరల పైర్లువేసుకుంటే గాని వారికి సంవత్సరముపొడుగునా బ్రతుకుతెరువు ఉండదు చౌకడిపోలు ఏర్పా టుచేయాలి ప్రస్తుతము పదిహేనురోజులకైనా తగినంతతిండి ధాన్యములు సప్లయిచేయాలి ఏనుగుపల్లి గ్రామం వద్ద గతములో ఎప్పుడో ఏటిగట్లు అన్నీ తెగిపోయిన ) అప్పటినుంచి యిప్పటివరకూ ఆ ఏటిగట్లు బాగుచేయించనే లేదు ఏటిగట్లు తెగిపోయినందువల్లనే యీదఫా వరదలు ఎక్కువ ముగా రావటానికి అవకాశముకలిగింది ఏటిగట్లు వెంటనే బాగుచేయించాలి ఏటిగట్లు బాగుచేయించక పోవడమువల్ల ఏనుగుపల్లి వైకొత్తపల్లి ముంజువరం ముంజువరపు గట్టు వగైరా గ్రామాలన్నీ మామూలు వరదతాకిడికన్న యీదఫా పూర్తిగా మునిగిపోయినవి అదేవిధముగా వైనతేజం Left Bank కు రాతికట్టడం కట్టించకపోతే, ప్రతి సంవత్సరము వచ్చే సామాన్యపు వరదతాకిడికి అయినా కోసుకుని పోతుంది కాబట్టి దానిని వెంటనే రాతికట్టడము కట్టించాలి Right Bank ఆదూరువరకూ పోయి ఆగిపోయింది దానిని కేసనపల్లివరకూ పొడి గించాలి Flood Control Board లో మంత్రి నాగేశ్వరరావుగారు కూడ ఒక మెంబరుగా ఉన్నారు ఈ విషయము Board కు సిఫార్సుచేయడం East Godavari Irrigation Board లో కూడ సంజీవరెడ్డిగారు flood relief measures సిఫార్సు చేశామని చెప్పడముకూడ జరిగింది అందువల్ల ఆదూరునుంచి కేసనపల్లి వరకూ ఏటిగట్లు బాగుచేయించటానికి కనీసము ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నైనా చేర్పించటానికి తగిన చర్య తీసుకోవలసిందిగా కోరుతున్నాను ప్రభుత్వం యీ విషయాలన్నీ దృష్టిలోపెట్టుకుని తగిన చర్యలు వెంటనే తీసుకుంటారని ఆశిస్తూ విరమిస్తున్నాను

SRI N RAMABHADRA RAJU —అధ్యక్షా,ఈసారి గోదావరి వరదల వల్ల రాష్ట్రములో ఎంతనష్టము సంభవించినదన్నీ ప్రభుత్వ దృష్టికి రాకపోవడము చాలా విచారకరముగా ఉన్నది ఎందుకంటే యిటీవల మన రెవెన్యూమంత్రి గారు ఒక statement యిచ్చారు ఆస్టేటుమెంటులో బుడమేరు ఎర్రకాలువ వగైరాలు కృష్ణా వరదలువల్ల గలిగిన నష్టమును గురించే ఎక్కువగా ప్రస్తావిం

చారు కాని గోదావరి వరదలను గురించి ప్రస్తావించనేలేదు అందుకు విచారకరమని అంటున్నాను క్రిందటిసారి 1953వ సంవత్సరములో గోదావరివరదలు ఎంత నష్టము కలుగజేసిందిన్నీ మనకు తెలుసు ఆ వరదలు యింకా నాలుగు అయిదు అడుగులు ఎత్తునవచ్చినట్టైతే లంకలలోనున్న గ్రామాలు అన్నీ కొట్టుకుని పోయియుండేవే పశువులు అన్నికూడ జనాభాతోసహా ఎక్కడాకూడ రూపు లేకుండా కొట్టుకొనిపోయి యుండేవి అప్పటికే పైర్లుపూర్తిగా మునిగిపోయి కొట్టుకొనిపోయినవి ప్రజలకుకూడా నివేశనాలు లేకుండా పోయినవి ఇంతనష్టము కలిగినప్పటికి కూడా ప్రభుత్వము అది గుర్తించక పోవడము నాకు చాల బాధకరముగా ఉన్నది అందువల్ల నేను మనవిచేసేది ఏమిటంటే నదులు పొంగడమువల్ల జననష్టము పశువులు నష్టము సస్యాలు అన్నికూడ నష్టం అయి పోయినవని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను దీనికి యికమీదటనైనా యిటువంటి నష్టము కలుగకుండా నివారణోపాయము ప్రభుత్వము కనిపెట్టి అమలు పరచాలని అంటున్నాను ముఖ్యంగా బుడమేరులో కలిసే చిన్న చిన్న నదులు గట్లుతెగి వరదలు వచ్చి గ్రామాలలోకి చొచ్చుకుని రాకుండా ఒక వరద నివారణ పథకమును ఏర్పాటు చేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను ఇదితప్ప వేరే మార్గము లేదు వరద నష్టములను ప్రభుత్వం దృష్టిలో పెట్టుకుని వరద కట్టలను రిపేరు చేయించమని అంటున్నాను ఈ పథకముల విషయములో Government of India వారిని సంప్రదించి యితర నదుల విషయములో వారు ఏవిధముగా పెద్ద పెద్ద ఆనకట్టలు కట్టి పదిలపరుస్తున్నారో అదేవిధముగా గోదావరి గట్లను సరిచేయటానికి ఒక పెద్ద పథకమును ఏర్పాటుచేయటానికి ప్రయత్నించవలసిందిగా కోరుతున్నాను ముఖ్యంగా లంక గ్రామాలలో అనేకమంది పేద ప్రజలు నివసిస్తున్నారు వరదల ఉధృతమువల్ల వారందరు పంటలు కోల్పోవడమే కాకుండా, యిళ్లుకూడ కొట్టుకునిపోయి ప్రాణాలు కూడా దక్కని పరిస్థితులు ఏర్పడడముకూడ జరుగుతున్నది ప్రజలకు తిండిగాని నివాసయోగ్యములుకాని పశుగ్రాసముగాని లేకుండా పోయినచోట్లు ఎన్నో ఉన్నవి అనేకచోట్ల ప్రజలు నదీ గర్భములలో కూడ నివాసము ఏర్పరచుకున్న లంకగ్రామాలు ఎన్నో ఉన్నవి వరదలవల్ల పాతగ్రామాలు కొట్టుకొనిపోతే కొత్తగ్రామాలు ఏర్పాటు చేసుకున్నవారు ఉన్నారు ఆప్రాంతపు ప్రజలు వరదలవల్ల నష్టపడినప్పుడు ప్రభుత్వము వాళ్లకు తగిన సహాయము చేయలేదు ఇది యిట్లుండగా ప్రభుత్వము పన్ను మాత్రము వసూలు చేస్తున్నారు పేదప్రజలు పన్నుభారము భరించలేకుండా ఉన్నారు ఈ విషయము ప్రభుత్వము గుర్తిస్తారని అనుకుంటున్నాను గృహములు పోయినవారికి మరల గృహములు ఏర్పడటానికి వారికి ప్రక్కప్రాంతాలలో

నైనా స్థలములు యివ్వించాలని నా కోరిక ఆప్రకారము సహాయముచెస్తే పేద ప్రజలు వరదలకు గురికాకుండా పోతారు దరిదాపు ప్రతిసంవత్సరము వరదలు వస్తూనేఉన్నవి వరగలవల్ల పేదప్రజలు ఏవిధముగా నష్టపడుతున్నారో డెల్టా ఏరియాలలోకూడ రైతులు మురుగుకాలువలు పొంగడమువల్ల పైర్లుపోయి నష్టపడుతున్నారు ముఖ్యంగా యీ సంవత్సరము వర్షాలు జాస్తిగా కురియటమువల్ల చిన్నచిన్న నదులు మురుగుకాలువలు పొంగి పొలములమీదకు నీరువచ్చి పొలములలో నిలవ ఉండడమువల్ల ఆనీరు బైటకు పోవటానికి దారిలేక పంటయుమురిగి నష్టపరచినది పశువుల నష్టముకూడ కలిగింది ప్రభుత్వం యీ విషయములనన్ని గుర్తించి వెంటనే తగుఏర్పాట్లు చేయుటానికి చర్య తీసుకుంటారని ఆశిస్తూ సెలవు తీసుకుంటున్నాన

SRI P SREERAMULU —అధ్యక్షమహాశయా ఈరోజులుమారినవి దానికనుగుణముగా ప్రకృతిగూడా చాలా వికృతరూపములో మారినందువల్ల నదులుపొంగడం గాలి వానలురావడం అందువల్ల ప్రజలు నష్టపటడము పరిపాటి అయిపోయింది అందులో ముఖ్యంగా వరద పీడిత ప్రజలు ఎట్లాఉన్నారో అలాగే మన శాసనసభలో కూడ వరదపీడిత ప్రతినిధులు చాలామంది ఉన్నారు ఈవిషయిముచు గురించి నేను ఎంతోచెప్పవలెనని ఆశపడ్డాను కాని అధ్యక్షులవారు అయిదు నిమిషములకాల పరిమితి పెట్టారు అందువల్ల మాకు కలిగిన నష్టాలు క్లుప్తముగా వివరించదలచాను మంత్రిగారువెళ్ళి స్వయముగా చూడలేని పరిస్థితిలో ఉన్ననూ కనీసము ఆ యా ప్రాంత ప్రజాపతినిధిగా నేను అయినా స్వయముగా వెళ్ళిచూచి వచ్చాను గనుక విన్నవించుచున్నాను ఈ విషయాలు కొన్నికాక పోయినా కొన్నిఅయినా యిప్పుడు అధ్యక్షులవారు యిచ్చిన కొద్దికాల పరిమితిలో అవకాశముతీసుకుని చెబుతున్నాను అయినను నాకు చాలినంత అవకాశము నివ్వడము ధర్మము న్యాయము కూడా ఇప్పటికి పది సంవత్సరాలుగా వస్తున్న కృష్ణా గోదావరి వరదలు నాకు తెలిసినంతమట్టుకు యాభై సంవత్సరాల యీలోపల ఎన్నడూ రాలేదు కనీసము పది సంవత్సరాల కొక పర్యాయము అయినా వరదలు వచ్చి తొంగిచూచిపోవడము జరుగుతున్నది అందులో ముఖ్యంగా యీ సంవత్సరము ఒకే నెలలో అయిదుసార్లు వరదలు వచ్చినవి వాటి ఫలితముగా పంటలన్నీ సర్వనాశనము కావడము కాకుండా ఏటిగట్లు అన్నీ అనేక చోట్లలో తెగిపోయిన కారణమువల్ల ప్రజల ప్రాణాలుకూడ రక్షించుకోలేని పరిస్థితివచ్చింది మాకుఉన్న గత అనుభవాన్నిబట్టి యీనాడుఉన్న పరిస్థితినిబట్టి ఎవరి విషయములు ఎట్లాఉన్నా, మాగుంటూరు జిల్లాలోని వైకుంఠపురం, సత్తెనపల్లి రేపల్లె తాలూకాలలోఉన్న లంక గ్రామాలకు చెందిన

Sri P Sreeramulu] [16th August 1956

భూములు ఎక్కువగా పండే భూముని వాడుకమాత్రము ప్రజలలో ఉన్నది మాజిల్లాలో ముఖ్యంగా కృష్ణానది లోపలిభాగములందు ఎత్తు ప్రదేశాలలోనూ లంకలలోను యిళ్లు కట్టుకుని నివసించు గ్రామాలు ఎన్నో ఉన్నవని ప్రభుత్వానికి తెలియకపోలేదు వరదలు వచ్చినప్పుడు వాళ్లుపడె అగచాట్లు కూడ తెలుసును ప్రాణ నష్టము పశువులు నష్టము పైర్లునష్టం యింకా అనేకవిధములుగా తిండికొరకు దాచుకున్న సంవత్సర గ్రాసము గడ్డి యిళ్ళు సమస్తము కొట్టుకొనిపోయే టటువంటి పరిస్థితులు ఉన్నవనేసంగతి గుర్తించాలని నా అభిప్రాయము ఒకసారికి అయిదేసిసార్లు వరదలువస్తే యిక ఆ వరదనీరు తీసేవరకు సంవత్సర ములో రెండునెలలు మూడునెలలు యింకనూ ఆరునెలలవరకు నీరు నిలవడమువల్ల పైర్లువేసుకునే అవకాశముకూడ లంకలలోలేని పరిస్థితులు మరవ కూడదు ప్రజలకు నివాసయోగ్యము దుర్లభమనే విషయముకూడ జ్ఞాపకము ఉంచుకోవాలి ఉధృతముగా వరదవచ్చినప్పుడు స్థానిక అధికార్లతోకూడా లాంచీ లలోవెళ్లి వాళ్ళ పరిస్థితులు చూచివచ్చాము ఆసమయములో ఎత్తుగాకట్టుకుని ఉన్నయిళ్లలోనూ చూర్లలోను యింటికప్పులమీదను డాబాలమీదను చేరుకుని నిద్ర ఆహారములు లేకుండా ప్రాణములు రక్షించు కుంటున్నారన్నసంగతి గుర్తిం చాలి వీటి అన్నింటిలో ఎక్కువ విషాదకరమైన పరిస్థితులు ఏమిటంటే ముఖ్యంగా హరిజనవాడలలో వరదలసమయములలో యిళ్ళలోనికి నీరువచ్చి ఉరకవేసి నీరుతీయకుండా నిలవఉన్నప్పుడు ఎల్లలతోసహా మెరక ప్రాంతాలకు పోయి ఏవిధ ముగా ప్రాణములను రక్షించుకొగలుగుచున్నారు అనేది గుర్తించారా అనిఅడుగు తున్నాను ఇటువంటి పరిస్థితులు ఉన్నప్పుడు ప్రభుత్వోద్యోగస్థులు వరదభాదిత కుటుంబాలకు ఒకటింటికి 30రూపాయలు యిస్తున్నారు మరీ ఎక్కువగా యిబ్బం దులుపడే వాళ్లకు యింకను కొంచెము ఎక్కువగా యివ్వమని కోరితే ముప్పది రూపాయలకంటె యివ్వటానికి ప్రభుత్వం అనుమతి కాదనిన్నీ తనకైనా discre tion power కూడ లేదని చెబుతున్నారు మిక్కిలి దుర్భరమైన కేసులలో నైనా కొంచెము ఎక్కువగా యిచ్చేటట్లు ఆయా నియమములను సడలించకపోతే యీ ముప్పది రూపాయలతో యిళ్లు వాకిళ్ళు ఏర్పడగలవా అని ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను. ఈ నియమమును సడలిస్తూ వరద బాధితులకు వారి వారి యిబ్బందులనుబట్టి తగినంత ధన సహాయము చేయటానికి వీలుగా ఉత్తరువులు ప్రభుత్వం పంపవలెనని కోరుతున్నాను డెల్టా గ్రామాలలో అతివృష్టివల్ల వరదల తోనూ, అనావృష్టివల్ల పంటలు లేకపోవడముతోను బాధలు పడుతూ, నష్ట పడుతూ ఉండే ప్రజలను చూచి మన రామకృష్ణరాజుగారు యీార్ష్యపడకుండా ఉంటారేమోనని నా అభిప్రాయము డెల్టా గ్రామములలో అవసరమైన నీరును

ఉంచి వరదల సమయములో excess గా ఉంగే నీరు నంతయూ చిత్తూరు జిల్లాలో రామకృష్ణరాజుగారి నియోజకవర్గానికి తరలిస్తే మాకెమీ అభ్యంతరము లేదు ఆ విధముగానైనా వారు డెల్టా ప్రజలను చూచి యీర్ష్యపడకుండా ఉంటారేమో నని అభిప్రాయపడుతున్నాను

మరొక విషయము 1947 సంవత్సరములో వచ్చిన వరదలలో అప్పుడు మాకు కలెక్టరుగా ఉన్నట్టి Prabhakara Rao Naidu గారు కొత్తపంథాను త్రొక్కారు ఒక్కొక్క రివెన్యూడివిజనుకు ఒకగ్రామాన్ని తీసుకొని మాగుంటూరు జిల్లాలో బేతపూడి పెదకొండూరు రాచవారిపాలెం మూడుగ్రామాలను సెలక్టు చేసి ప్రత్యేకముగా ఏటిగట్టు వెలుపలభూమిని acquire చేసి గృహనిర్మాణం కొరకు colonyలను ఏర్పాటుచేసి ప్రణాళికను అమలు జరిపారు ఆ కమిటీలో Joint Secretary గా ఉండి సేవచేసే అవకాశం నాకు లభించింది Prevention is better than cure అనే సిద్ధాంతాన్ని అమలుపెట్టి ఈ వరద నివారణ విషయములో ప్రభుత్వం వరదలు వచ్చినప్పుడు ఏదో patch work మానివేసి శాశ్వత నివారణకు పూనుకొనవలెనని నేను కోరుచున్నాను

కృష్ణా గుంటూరు జిల్లాలలో లంకగ్రామాలు ఎక్కువగా ఉన్నాయి అటువంటి వాటికి పరిసర ప్రాంతాల ప్రజల సహాయము తీసుకొని ప్రభుత్వం ఏటి వెలుపలభూమి తీసుకొని పేదప్రజలకు ఉచితముగాను భాగ్యవంతులు ఉన్నవారికి ఖరీదుమొత్తంతీసుకుని కాలనీలనుకట్టి శాశ్వతంగా రక్షించడానికి క్రమమైన విధానాన్ని ప్రభుత్వంఅమలుజరపాలని నేనుమనవిచేస్తున్నాను కోటిరెడ్డిగారు రామస్వామిగారు మనవిచేసిన వైకుంఠపురం నుంచి సీతానగరం వరకు ఈకరకట్ట నిర్మాణము విషయమై అత్యధిక ప్రాధాన్యత ఇవ్వవలసినఅవసరం ప్రభుత్వం గుర్తించవలెను కోటిరెడ్డిగారు చెప్పినట్లు ఇదివరకు 6అడుగుల నీరు ఆనకట్టమీద ఉన్నప్పుడే ఈ 30 40 గ్రామాలు నీటిలో మునిగి ఏమాత్రము వచ్చినా నష్టపడుతున్నారు ఈ బారేజి తయారు అయితే 12 అడుగుల నీరువస్తుంది కాబట్టి 40 గ్రామాలకు దెబ్బ దాదాపు గుంటూరు అమరావతిరోడ్డుకు మధ్య 200 గ్రామాలు ఈవరదకు గురికావలెను కాబట్టి కరకట్ట నిర్మాణపథకాన్ని వెంటనే ఏర్పాటు చేయించవలెనని State Flood Centre Board వారు సిఫార్సుచేసి కేంద్రప్రభుత్వ మంజూరు తెప్పించి అమలు జరిపించవలెనని చెప్పి వారితో ఏకీభవించి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను

SRI P GUNNAYYA —అధ్యక్షా, పూజ్యులు రెవెన్యూ మంత్రిగారి స్టేటుమెంటును నేను మనస్ఫూర్తిగా బలపరుస్తూ నా హృదయపూర్వక వంద

నాలను అర్పిస్తున్నాను గాని మా శ్రీకాకుళంజిల్లా చాలా వెనుకబడిన జిల్లా ఇక్కడ వంశధార పొంగి తాళ్లుడి నివగాం హంస కడుమ ఋఖలింగం గ్రామాలలో గట్టువిరిగిపోయి కొన్ని వెల ఎకరాల భూమి సర్వనాశనం అయింది అష్టు పోసుకునేందుకుకూడా వీయిలేదు అలాంటి పరిస్థితులలో P W D ద్వారా Flood Bank లు కట్టి నీరు పొలాలలోకి వెళ్లకుండా చెయ్యాలి సుమారు 1½ సంవత్సరముల నుంచి అనేకమైన మహజర్లు ఇచ్చినాము P W D Chief Engineer గారితోకూడా చెప్పనాను గాని ఆ files ఎక్కడఉన్నవో తెలియదు ప్రభుత్వంవారు కలెక్టరుగారి రిపోర్టులమీద ఎంత సహాయంచేస్తారో తెలియదు శ్రీకాకుళంజిల్లా వంశధార ప్రాంతములో శాశ్వతమైన సహాయం చెయ్యడానికి Flood Bank త్వరలో కట్టించి రిజర్వాయరు నన్ననాయ దగ్గర కట్టిస్తే బాగా ఉంటుందని మనవిచేస్తున్నాను నాగావళివల్లకూడా కొన్ని గ్రామాలు మునిగి పోయినవి Flood Bank లు కట్టి మాభూములు పాడై పోకుండా చూస్తారని ఆశిస్తు న్నాను అదేవిధముగా పార్వతీపురం తాలూకాలో వరహాలుగడ్డ చాలా కాలం నుండి ఒక 50 60 వేలతో ఒక Reservoir కట్టి అక్కడిభూములను రక్షించవల ెనని ప్రభుత్వానికి పంపుకున్నాము కనీసం 56 000 ఎకరాల భూమిలో పంటలేకుండా పోతున్నది రెవెన్యూమంత్రిగారు ఆసెంబ్లీఅయిపోయిన తరువాత నేనుస్వయముగా పార్వతీపురం పాలకొండ తాలూకాలు నాగావళి ప్రాంత ములో పర్యటనచేసి అక్కడి ప్రజల కష్టాలు తెలుసుకొని వారికి తగిన శాశ్వత సహాయం చేస్తారని మనవి చేస్తున్నాను అధ్యక్షులవారు నాకు ఈ అవకాశము ఇచ్చినందులకుకూడా నా అభివందనములు

SRI K APPA RAO —అధ్యక్షా మాతాలూకాలో ఈవరదలవల్ల అపార మైన నష్టం సంభవించింది ఆనష్టం యొక్క magnitude ఇక్కడ వివరముగా నివే దించకపోతే నా duty నేను నెరవేర్చనట్లే అగుతుంది బుడమేరు తమ్మిలేరు ఎర్రకాలువలు వరదలతో కొల్లేటిలో పడడమువల్ల పొంగి ఉప్పుటేరు ఎగతన్ని ఆ నీటిని సముద్రంలోనికి తీసుకుపోవడంవల్ల కైకలూరు తాలూకాలో 30 000 ఎకరాల పంట నష్టపడుతున్నదని రివెన్యూ అగ్రికల్చరలు వారి లెక్కలవల్ల తెలుస్తున్నది 30 000 ఎకరాల పంట మా రైతాంగము కోల్పోయింది అంటే ఎకరానికి 10 బస్తాలు వచ్చినా 3 లక్షల బస్తాలు నష్టపోయినట్లు వీటి కిమ్మత్తు హీనపక్షం 20 రూపాయల చొప్పున వేసినా 60 లక్షల రూపాయలు మా తాలూకా నష్టపోయినట్లు రివెన్యూ అగ్రికల్చరువారి అంచనాల ప్రకారం 60 లక్షలు నష్టం అయింది అంటే ఉప్పుటేరు widening కు అయ్యే ఖర్చు మొత్తం మా తాలూకా ప్రజలు నష్టపోయేరు అన్నమాట ఇచ్చే remission లతో

ఒక్కొక్క మురుగుకాలవ త్రవ్వించవచ్చును అప్పుడు ప్రభుత్వానికి ఇటు ప్రజలకు కలిగిన నష్టంతగ్గుతుంది బుడమేరు నష్టం చాలవిపరీతమని చెపుతూ ఉంటారు అదినిజమే బుడమేరుమీద కాకి గద్ద ఆడకుండా ఉన్నవని వానినిగురించి మెట్ట తాలూకాలవారు చాలాఎక్కువగా చెబుతూఉంటారు బుడమేరుకుDiversion కడతారో లేకపోతే Reservoir కడతారో మాకు అక్కరలేదు సముద్రంలోకి మళ్ళిస్తారో ఏమిచేస్తారో చెయ్యండి మేముకోరేదల్ల మాకొల్లేటిలో ఉప్పుటేరులో ఆ బుడమేరు పడకుండా మీరుకరకట్టలు కట్టినాసరే తిన్నగా సముద్రలోకి పోయే టట్లుచెయ్యండి బుడమేరు నష్టముగురించి నేను ఒక్కమాటలో చెబుతాను ఆప్రాంతం రైతులకుకల్గిననష్టం తుపాకిదెబ్బకో పోల్చవచ్చును మాదిచిత్రవధ ఒక మరమేకును మనిషికి దిగగొట్టడం వంటిది ముఖ్యమంత్రిగారు డిప్యూటిమంత్రి గారు ఓబుంరెడ్డిగారు మాతాలూకాలు చూచి ఆ megnitude గమనించారు రివెన్యూమంత్రిగారు రాంపోయినా మాకష్టాలను తెలుసుకొంటున్నారు నలుగురు మంత్రులు ఆవిధముగా చూయంది శ్రద్ధచూపినందులకు ఆ పగిలిన గుండెలతో కూలిపోయిన కొంపలతో బాధపడుతున్న ప్రజలతరపున వారికినేను కృతజ్ఞత తెలుపుతున్నాను ఒక్కబుడమేటి గురించి తమ్మిలేరు ఎర్రకాలవ గురించి వారందరికి చెపుతూ వున్నప్పుడు ఇన్నిఎర్లు కొల్లేటిలో పడుతున్నప్పుడు కొల్లేటిలో నీరు దాని outlet అయినటువంటి ఉప్పుటేరులోనుంచి సముద్రంలోకి పోకుండా ఉంటే ఎన్నిరోజులు మేము సహించగలమో మీరు తెలుసుకొనండి

ఒకవేళ తమరు అనుకోవచ్చును ఇది క్రానిక్ డిసీజ్ అని అది Chronic అని నేనుఒప్పుకుంటాను ఒకవిధంగా కాని ఆజబ్బు ఆగస్టులో వస్తుంది June July లలో ఆజబ్బు మాకుఎపుడురాదు ఏరుకు వరదలువచ్చినపుడు మాకాజబ్బువస్తుంది కాబట్టి ఆజబ్బును నివారణచేయడానికి మాకు మార్గాలు లేకపోలేదు మీరు Engineering సిబ్బందితో సంప్రదించి ఉప్పుటేరు Seuing కూడా బుడమేరుకు ఎంతప్రాధాన్యము యిస్తున్నారో అంతప్రాధాన్యము యివ్వవలసందని లోగడనేను హెచ్చరించాను యీనాడుకూడా మమ్ములను మరొకసారి హెచ్చరిస్తున్నాను యీ సంవత్సరం వర్షాయి June ఆఖరున పడ్డాయి July లో పడ్డాయి ఆగష్టులో పడ్డాయి కొన్నిచేలు ఊడ్చకుండా నేపోయాయి ఊడ్చినచేలు తిరిగి ఊడ్చేఅవకాశం లేకుండాపోయాయి ఈ పరిస్థితులలో నేను కొన్ని remedies suggest చేస్తున్నాను ఎక్కువగా మాతాలూకాలో వుండే మురుగుకాల్వలు కూడా ఉప్పుటేరులో పడుతూవుంటాయి ఆ ఏటిసీరే ఉప్పుటేరులాగ లేకుండా వున్నపుడు యీ మురుగుకాల్వలలోని నీరు

పొరలిపోతూ వుంటుంది పైగా పెద్దవరదలు వచ్చినపుడు చేలలోనికి నడుస్తూ వుంటాయి అసలు యీ మురుగుకాల్వలు అన్నీకూడా పుట్టుకలో వెడల్పుతగ్గి పోనుపోను నదిలోగాని సముద్రములోగాని కలిసేటపుడు వెడల్పు ఎక్కువగా వుండాలి పోనుపోను సన్నగిల్లేటటువంటి యీ మురుగుకాల్వల బాధ మేము పడలేకుండా వున్నాము పొలరాజు drain చిన్నకొమ్మిలేరు drain, పెదకొమ్మిలేరు drain, ఇటువంటి drains అన్నికూడా అపారమైన నష్టాన్ని కల్గిస్తున్నాయి అది క్రానిక్ డిసీజ్ అని త్రోసివేయకుండా దీనికి నివారణమార్గాలు ఏవో చేయమని కోరుతున్నాను తర్వాత ఇంకొకవిషయం చెపుతాను రెండుసంవత్సరాల క్రితము అదేవిధంగా బ్రహ్మాండమైన ముంపు వచ్చింది గతసంవత్సరము నవంబర్ లో కోయవలసిన కోతలు డిసెంబర్ లోకూడా కోయలేకుండా పోయినాము తొడలోకు మోకాలులోతునీరు మంచి మాగాణి ప్రదేశంలో వుండడముమూలాన నేనుఒక adjournment noticeకూడా పెట్టాను ఆనాడు అధికారంలో వున్నవారు దానిని నిరాకరించారు కోతలలోవచ్చింది అనుడుమునక ఇపుడుమనకుఊడ్పులలో వచ్చింది యీ వరదనివారణకు సత్వరచర్యలు తీసుకోవాలని మనవిచేస్తున్నాను తక్కావి loans విరివిగా యిప్పించమని పాత loans వాయిదావేయించమని చౌకడిపోలను ఎక్కువగా ముఖ్యంగా మాతాలూకాలో తాత్కాలికంగా పెట్టించమని నేను కోరుతూవున్నాను మరొకటికూడా చెప్పుతున్నాను అసెంబ్లీ సభ్యులతోను ఇతర అధికారులతోను ఒక Special Committee వేసి యీ కొల్లేటికి సంబంధించిన విషయాలన్నిటినికూడా శీఘ్రంగా పరిష్కారమయ్యేటట్లుగా శాశ్వతంగా నివారణయ్యేటట్లు చూడాలి దీనికి ఒక P W Zone కూడా ఎర్పాటుచేసి తగు చర్యలు తీసుకుంటారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను

SRI S K V KRISHNAVATARAM — అధ్యక్షా, యీ వరదల సమస్య రానురాను తీవ్ర రూపాన్ని దాలుస్తున్నది గతములో ఎపుడో 5 సంవత్సరాలకు లేక 10 సంవత్సరాల కొకసారి యీ వరదలు వచ్చేవి కాని ఇటీవల యీ వరదలు ప్రతి సంవత్సరము వస్తూవుండడము రైతాంగానికి అపారమైన నష్టము కల్గడముకూడా జరుగుతున్నది కాబట్టి యీ సమస్యనుగురించి బాగా ఆలోచించి దానియొక్క నివారణోపాయాలను మనము ఆలోచించవలసిన అవసరమెంతైనావుంది West Godavari జిల్లాలో ఎర్రకాలువ వున్నది దీనివల్ల నాలుగు తాలూకాలకు నష్టము సంభవిస్తుంది గత సంవత్సరము ఎర్రకాల్వ తీవ్రంగా పొంగడమువల్ల 4 తాలూకాలలోకూడా అపారమైన నష్టం కల్గింది గౌరవనీయులైన రివెన్యూ మంత్రిగారు స్వయంగా చూచివచ్చారు చూచి మీ జిల్లాలోని 16 గురు అసెంబ్లీ సభ్యులుకూడా ఏకముఖంగా యీ ఎర్ర

కాల్వ వరద నివారణ నిమిత్తమై కృషి చేయవలసినవని ఎంతో వుందని చెప్పారు ఈ ఎర్రకాలువ యీ జిల్లాలో 80 మైళ్ల పైచిలుకు ప్రవహిస్తుంది ఆ విధంగానే తమ్మిలేరనే కొండనదికూడా వుంది దానివల్లకూడా చాల అపారమైన నష్టము ప్రతి సంవత్సరంకూడా సంభవిస్తుంది ఈ ఎర్రకాల్వ తమ్మిలేరు రావిలేరు మొదలు కాగల నదుల సమస్యలను తీ స్తే కాని కొల్లేరుసమస్య పరిష్కారము కాదు కొల్లేరు ఒక పెద్ద సరస్సు ఈ నదులలో ప్రవహించిన నీరంతా కొల్లేరుకు వెళ్ళుతుంది అపుడు కొల్లేరు పొంగుతుంది కాబట్టి మిగతా యీ ఉపనదుల సమస్య అంతాకూడా తీరిస్తేకాని కొల్లేరు సమస్య తీరదు కొల్లేరు చాల క్లిష్టమైన సమస్య ఆ కొల్లేరుక్రింద కొన్ని లక్షల ఎకరాలు నాగుబడి పోతున్నాయి అక్కడవున్న ప్రజలు island లో వున్నట్లు వుంటారు దీనికి చాల సమస్యలున్నాయి ఈ కొల్లేరు సమస్య పరిష్కార నిమిత్తము యీ మిగతా నదుల వరద నివారణ నిమిత్తము అధికారుల అనధికారులతోటి ఒక కమిటీని దీనియొక్క నివారణోపాయాన్ని చెప్పేనిమిత్తము ప్రభుత్వము నియమించ వలసిందిగా లోగడ ముఖ్యమంత్రిగారితోటి చెప్పాము ఇప్పుడు కృష్ణా పశ్చిమగోదావరి శాసనసభ్యులు అంతాకూడా ఒక memorandum యివ్వదలచుకున్నారు ఆవిధంగా ఒక కమిటీని appoint చేసి ఆకమిటీ సూచనలను implement చేసే నిమిత్తము ఇతరవిధంగా కూడా నివారణోపాయాలను గట్టిగా investigate చేసేనిమిత్తము ఒక Special Division కూడా యిందునిమిత్తమై ఏర్పాటు చేయవలసిందిగా మేము కోరుతున్నాము రివెన్యూవారు అందులో ప్రత్యేకంగా చంద్రమౌళిగారు గత సంవత్సరంలోను యీ సంవత్సరంలోకూడా తాత్కాలికమైన చర్యలు తీసుకున్నారనడములో సందేహమేమీ లేదు కాని శాశ్వతమైన నివారణోపాయాలను ప్రభుత్వము వెంటనే తలపెట్టి కృషిచేయవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ విరమిస్తున్నాను

SRI V KURMAYYA —అధ్యక్షా ఇపుడు కృష్ణాజిల్లాలో దాదాపు లక్ష ఎకరాలు పోయినవని కొన్ని organisations, రైతులు అంటున్నారు కలెక్టరుగారేమో 75 వేల ఎకరాలు పోయినవంటున్నారు అందులో ముఖ్యంగా 50 to 60% బుడమేరు వరదలవల్ల మునిగి పోయింది ముఖ్యంగా గుడివాడ ఫిర్కాలో చాల గ్రామాలు యీ వరదదెబ్బకు గురి అయినాయి ప్రజలు చాల బాధలుపడుతున్నారు Agriculture మంత్రిగారు, ముఖ్యమంత్రిగారు తర్వాత P W D మంత్రిగారుకూడా వచ్చిచూచారు ముఖ్యంగా అక్కడిప్రజలు కోరారు తక్కావి loans యివ్వవలసిందని ఇప్పుడు ఇవ్వవలసిన బాకీలు post pone చేయవలసిందని అడిగారు యీసంవత్సరము బాగా వున్నటువంటి రైతులకు కూడా

యీసంవత్సరమునకు మాత్రం భోజనమునకు గింజలు వుంటాయే మోకాని వచ్చే సంవత్సరానికి భోజనానికి గింజలులేవు 70–80 వేల ఎకరాలు పాడుకావడమే కాకుండా వాటిలో పైరు వేసుకోడానికికూడా వీలులేకుండావున్నది దురదృష్ట వశాత్తు బుడమేరు diversion scheme reservoir scheme తర్వాత ఉప్పుటేరును లోతుచేయడము వెడల్పుచేయడము మొదలైన schemes రాజకీయంగా పరిణమించాయి 1938–39 సంవత్సరములోనే యీ ఉప్పుటేరును widen చేయడానికి deepen చేయడానికి కొన్నివేల రూపాయలు కేటాయించారు ఐతే ఆరోజులలో దానిని deepen చేయడానికి widen చేయడానికి dredgers లేవని అందుచేత దానిని ఆపారు ఆ schemes ఎటుపోయాయో నాకు అర్థము కావడములేదు ఇపుడు మన అప్పారావు చెప్పట్లు అన్ని కాల్వల నీళ్లు కైకలూరు తాలూకాకు వెళ్లడము అక్కడ stagnate కావడము జరుగుతుంది ప్రభుత్వము యీ మధ్యనకూడా మంత్రివర్గములో కొంతమందిని ఉపసంఘముగా వేసుకొని యీ బుడమేరు scheme diversion scheme గా వుండాలో లేకపోతే reservoir scheme వుండాలో ఏది వుండాలనే చర్చలు జరిగినాయి ఆ మంత్రులుకూడా ఆ ఉద్దేశంతో వచ్చి చూచినట్లు లెదు MLA లు ఎక్కడవున్నాసరే భేదాభిప్రాయాలు మరచిపోయి ప్రజలను దృష్టిలో పెట్టుకోవలసిందని మనవిచేస్తున్నాను కృష్ణా గోదావరిజిల్లాలు మన రాష్ట్రానికేకాక దేశానికి నయితము ధాన్యము సప్లయి చేస్తాయి కాబట్టి వాటిని దృష్టిలో పెట్టుకోవలసి యున్నది సంవత్సరానికి రైతులకు కొన్ని కోట్లు నష్టమువస్తుంది ప్రభుత్వము రైతులకు రెమిషన్ యిచ్చుటకుగాను బుడమేరుకు కట్టలుకట్టడానికి క్రిష్ణానది కట్ట బాగుచేయడానికి ప్రతి సంవత్సరం కొన్నివేల రూపాయలు ఖర్చుపెట్టుతున్నది వీటితోబాటు యీ బుడమేరు scheme ఎర్రకాల్వ scheme ను వెంటనే తయారుచేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను

SRI MAHAMMAD TAHSEEL — అధ్యక్షా భద్రాచలం తాలూకాలో ఈ సంవత్సరం వరదలు చాల హెచ్చుగనే వచ్చినాయి 1953వ సంవత్సరం వచ్చిన వరదలనుండి ఇంకా రైతాంగం కోలుకోకుండానే ఈ వరదలు ప్రతి సంవత్సరం రావడంమూలంగా రైతులు చాల కష్టాలపాలు అవుతున్నారు అయితే ఇపుడు ఆ వరదలు రాకుండాచేసే పథకాలు ఎమిలేవుగాని ఒకటిమాత్రం ఇక్కడ ఉన్నటువంటి ప్రజలు ప్రభుత్వాన్ని కోరుతున్నారు వెంకటాపురం తాలూకాలో పేరూరు అనే గ్రామం ఉంది అది కూనవరానికి 120 మైళ్లకు పైగానే ఉన్నది పేరూరు దుమ్ముగూడెం భద్రాచలం, కూనవరం ఈ నాలుగు

ప్రధాన కేంద్రాలలో ఒక్కొక్క wireless station పెట్టి అక్కడ వరద వచ్చేటటు వంటి సమయంలో ఆ వరదవార్తలు ప్రజలకు అందజేస్తూఉంటే ఆప్రజలు పల్లపు ప్రాంతములనుంచి మెట్టప్రాంతాలకు వెళ్ళిపోవడానికి కొంతవరకు అవకాశం ఉంటుంది కాబట్టి ప్రభుత్వం ఇకమీదనైనా వరదవచ్చే season లో అక్కడ wireless station పెట్టవలెనని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను 1953వ సంవత్సరంలో వరద బాధితులకు ఇచ్చిన అప్పులు అప్పుడే వసూలు చేయుటకు ప్రభుత్వంతరఫునుంచి ఉత్తరువులు వచ్చినాయి కాబట్టి ఈ సంవత్సరం వసూలుచేసే వాయిదాలను ఆపుచేసి మరొకసంవత్సరం గడువు ఇప్పించవలసినదిగ ప్రభుత్వాన్ని కోరడం అయింది తర్వాత ఆ తాలూకాలకు రాజమండ్రినుంచి బియ్యం వగైరా సప్లయికావాలి వరదలమూలంగా బియ్యం ఎగుమతి కాకపోవడంవల్ల ధరలువిపరీతంగా పెరిగిపోయినవి అందుచేత ముఖ్యమైన ప్రతి కేంద్రములోను చౌకడిపోలు పెట్టించవలసినఅవసరం ఎంతోఉందిఅని ప్రభుత్వదృష్టికి తీసుకొనివస్తున్నాను అయితే ఈవరదలు వచ్చేసమయంలో ప్రభుత్వోద్యోగులు చాలజాగ్రత్త తీసుకోవలసిన అవసరం ఎంతోఉంది ఈసారి మొన్న వరదలువచ్చినప్పుడు అక్కడఉన్న R D O కు ముందు తెలియజేసినప్పటికిన్ని కలగచేసుకోకుండాఉండడం తర్వాత జిల్లాకలెక్టరుకు తెలియచేసి దానిమీద వారువచ్చిప్రజలందరినికూడ మిమ్ములను ఈప్రాంతాలలో ఎవరు ఉండమన్నారు ? ఈ Ordinance తీసుకొనివచ్చి గోదావరికి ఇరుప్రక్కల ఉన్నటువంటి జనాన్ని వెళ్ళగొట్టితేనే మంచిది అని ఆబాధలలో ప్రజలంతా సామాను సర్దుకొనే పరిస్థితులలో ఉన్నపుడు ప్రభుత్వ ఉద్యోగులువచ్చి వాండ్లపైన దౌర్జన్యంచేయడం అంటే అది చాల అసహ్యమైన విషయం కాబట్టి ప్రభుత్వం ఇకముందు అటువంటి దౌర్జన్యాలు జరుగకుండా ప్రభుత్వఉద్యోగులకు తగినటువంటి తాఖీదులు ఇచ్చి ప్రజలందరినికూడ కాపాడవలసిన అవసరంవుంది లాంచీలుకూడ భద్రాచలం కూనవరం అభిచర్ల area లో మూడులాంచీలు గవర్నమెంటు ప్రతిసంవత్సరంకూడ జూలై 15 వ తేది లగాయతు సెప్టెంబరు 15 వ తేదీవరకుకూడ పెట్టవలసిన అవసరంవుంది అక్కడనుంచి ప్రజలు మెట్ట ప్రాంతాలకు వెళ్లవలెనంటే ప్రయివేటు నావలమీద ఒక్కొకమనిషికి రూపాయి లగాయతు అవసరాన్నిబట్టి 4 5 రూపాయలుకూడ వసూలుచేసిన ఘటనలు ఉన్నాయి ఆస్తులన్నికూడ చేరవేసుకోవాలంటే వాండ్లకు ఏమాత్రం రక్షణ ఇవ్వకుండా సామానులన్నిటికికూడ చాలఖరీదు వసూలుచేస్తున్నారు కాబట్టి గవర్నమెంటు దానినికూడ దృష్టిలో పెట్టుకొని అక్కడి ప్రజానీకాన్ని ఉచితంగా మెట్ట ప్రాంతాలకు చేరవేసే పద్ధతి ఏర్పాటుచేయాలి

[16th August 1956

SRI VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా ఈ వరదలు రావటం చాలా దురదృష్టంగా ఉన్నది ఇదివరకుకన్నా కొత్తగా ఎక్కువగా అగుపడుతున్నది దీనికి కారణం బహుశ Atomic, Hydrogen bombs ఈ రెండింటి explosions కావడంవల్ల వరదలు వచ్చాయని Scientists అందరూ చెప్పుతున్నారు అందువల్ల ఈ శాసనసభద్వారా ఆ ప్రభుత్వాలను కోరేది ఈ experiments ను దయచేసి మానవహృదయంతోటి మానుకోండి అని చెప్పడం మొదటి విషయం రెండవది గోదావరినది చాల తీవ్రంగా ఉంది దానిని అరికట్టడానికి శబరికి ఇపుడు మనం ఉద్దేశించిన project కాకుండా దీనికి పైన 150 మైళ్లలో మధ్యప్రదేశ్ ఒరిస్సా ఆంధ్ర మూడు కలిసినటువంటి border area లో కట్టితే బాగా ఉంటుందని సెంట్రలు గవర్నమెంటు ఆలోచిస్తున్నది అదిగనుక మీరు ఆలోచించినట్లయితే ఎక్కువ ప్రాంతం సాగుకావటానికి వీలు అవుతుంది మూడవ విషయం ప్రతిచోటకూడ ఈ వరద ఎప్పుడు వస్తుందని తెలుసుకొనుటకు Radio arrangements చేయకపోతే ప్రమాదం వస్తుంది వెంటనే చేయాలి కేంద్ర ప్రభుత్వం బుడమేరు విషయంలో డబ్బు మేము ఇచ్చాం రాష్ట్ర ప్రభుత్వమును మీరు ఎందుకు అమలు జరుపలేదు అని అడిగితే రాష్ట్ర ప్రభుత్వం ఏమి చెప్పింది? మిమ్ములను ఎవరు అడిగారు మేము estimates finalise చేయకుండానే మీరు డబ్బు ఇస్తే మేము మీ మాటమాత్రం వినము అనే ధోరణ చెప్పింది

THE HON SRI K CHANDRAMOULI — అధ్యక్షా దాదాపు 23 గురు గౌరవనీయులైన సభ్యులు ఈవరదలనుగురించి అధికవర్షాలనుగురించి వాటివల్ల కలిగిన నష్టాలనుగురించి చాలవివరంగా గట్టిగా అన్నివిషయాలుకూడ మాట్లాడారు చాల సంతోషం ఈవరదల విషయంలో ప్రభుత్వ దృక్పథంలో చాల బీభత్సంగానే ఉన్నదని చెప్పారు అందువల్ల గౌరవనీయులైన సభ్యులందరుకూడ ఈబీభత్సాన్ని చాల ప్రశాంతంగా ఎదుర్కొనడానికి ఆవేశంలేకుండా చక్కగా మాట్లాడినందుకు వారిని అభినందిస్తున్నాను రెండవవిషయం ప్రభుత్వంవారికవచ్చే లెక్కలు గౌరవనీయులైన సభ్యులు చెప్పే లెక్కలవంటివే అవి అన్ని షుమారుగ అక్కడ అంచనాలుతప్ప correct అయినటువంటి లెక్కలు అని నేను ఎప్పుడూ చెప్పను దాంట్లో కొంచెం హెచ్చుతగ్గులు వస్తూవుంటాయి ఈవేళ మీకు రిపోర్టులో 4 వేలు అంటే, రేపటికి 5 వేలు కావచ్చును ఈవిధంగా మార్పు జరుగుతూ ఉంటుంది అందువల్ల ఇచ్చినటువంటి అంకెలు సరిఅయినవిగాని ఇంతే అని గాని గౌరవనీయులైన సభ్యులు భావించవద్దని నేను మనవి చేస్తున్నాను మూడవవిషయం ఈ వరదలలోకూడా 2, 3 రకాలున్నాయి పెద్దపెద్ద గోదా

వరి కృష్ణా వరదలు నదులుపొంగి వరదలువచ్చే వ్యవహారం ఒకటి రెండవది బుడమేరు తమ్మిలేరు ఇటువంటి చిన్నచిన్న వాగులు ఏరులు పొంగివచ్చే వరదలు వేరు మూడవది అధికవర్షాలు ఇన్నివిధాలవల్ల వరదలు వస్తూవున్నప్పుడు మనం చేయవలసినదల్లా తాత్కాలిక సహాయం తక్కినపని అంతా శాశ్వతంగా అవి రాకుండా చేయడానికి చేసే వ్యవహారం అందువల్ల ముఖ్యంగా ఈ వరదలు వచ్చినపుడు ఈ తాత్కాలికంగా చేసిన వ్యవహారాలను గురించి కొంచెం వివరంగామాత్రం మనవిచేస్తాను వరదలు వచ్చినాయి అని చెప్పి ప్రభుత్వానికి రిపోర్టులు రావడంతోటే పత్రికలుగాని గౌరవనీయులైన సభ్యులుగాని వా రందరు చెప్పడంతోటే 4 గురు మంత్రులుకూడ వెళ్లిచూచారు ముఖ్యమంత్రిగారు వెళ్లారు డెప్యూటి ముఖ్యమంత్రిగారు వెళ్లారు ఓబులరెడ్డిగారు నాగేశ్వరరావు గారుకూడా వెళ్లివచ్చారు నేను రాలేదనేది ఒకటిఉన్నది కేవలం నా అనారోగ్యం వల్ల అప్పుడు వెళ్ళలేకపోయానేగాని ఇతరత్రకారణం ఏమీలేదు ఈ శాసనసభ సమావేశంఅయినవెంటనే నేనుకూడా వెళ్ళి కొన్నిప్రాంతాలుచూచి అక్కడ ఇంకా ఏమైనా చేయడానికి ఉంటే తప్పకుండా ప్రయత్నం చేస్తానని మనవి చేస్తున్నాను ప్రభుత్వంఎంతఉత్సాహంగా మీకన్నా ఎక్కువపట్టుదలతోచేసిందో చూపించడానికి మాత్రం ఒకటిరెండు ఉదాహరణలు మీకు మనవిచేస్తున్నాను తమ్మిలేరు బుడమేరు ఇటువంటి పెద్దవాగులను అరికట్టాలి ఎర్రకాల్వ కొవ్వాడకాల్వలవల్ల అక్కడ మెట్టప్రాంతాలకు damages జరుగుతూఉంటాయి అవి కేవలం చెరువులు గండ్లు పడడంవల్ల లేక కొన్ని కొన్ని చిన్న వాగులవల్ల జరుగుతున్నాయి శ్రీకాకుళం జిల్లాలో 17 కాల్వలు 387 ఇరిగేషన్ tanks breach కావడంవల్ల కొంతప్రమాదం జరిగింది వీటికి షుమారుగ 2 లక్షల రూపాయలు ఇచ్చేటట్లయితే వాలవరకు మరమ్మతుచేయడానికి అవకాశంఉంటుంది అని వారు rough గా estimate వేశారు ఈ 2 లక్షలరూపాయలలో 20 వేల రూపాయలు వెంటనే sanction చేసి పంపించినాను రమారమిగ వారు ఎక్కడైతే లెక్కలు ఇస్తున్నారో దానికి ఇంకా లెక్కలు సుమారుగ తేలకముందే 120 వేల రూపాయలు sanction చేసి చెరువులు మొదలైనవన్నీ వెంటనే మరామత్తు చేయమని పంపాము ఇరిగేషన్ క్రింద direct గా ఉండే వ్యవహారం మాత్రం నేను చెప్తున్నాను అదేవిధంగా విశాఖపట్నం జిల్లాకు షుమారు 40 వేల రూపాయలు కావలెనని చెప్పి Revenue Board వారు కోరితే వెంటనే విశాఖపట్టణానికి కూడ 40 వేల రూపాయలు sanction చేసి పంపించాను అందు వల్ల ఇది కేవలం loans కు సంబంధించినటువంటి విషయంకాదు వెంటనే అక్కడ మరామత్తులుచేసి చెరువులన్నిటిని చక్కగా ఉంచి మళ్లీ వాటిలో నీళ్ళు నిలువ

చెసి అవసరమైతే డబ్బుకావాలి అనేటటువంటి మాట తెలుపవలసింది అని కలెక్టరుకు చెప్పాము తక్కిన విషయాలు చెప్పకుండా ఉండిచనందుకు కారణం ఏమంటే-ప్రభుత్వంకూడ చాల ఎక్కువ పట్టుదలతో ఈ విషయాలలో పనిచేస్తుంది అని సభ్యులకు తెలియచేయటానికి తర్వాత ఇంకొక విషయం కడపనుంచి సరియైన లెక్కలు రాలేదు వచ్చినట్లయితె వెంటనే sanction చేయటానికి అభ్యంతరంలేదు తర్వాత నేను ఇచ్చినటువంటి statement లోనే అక్కడ పశునష్టం సంభవించినా ఇండ్లు పడిపోయినా వాటికి కావలసినడబ్బు వెంటనే ఇవ్వవలసినదిగ instructions ఇచ్చాము Loans విషయంలో ఇదివరకు పాతబాకీలు అన్నికూడ ఇప్పుడు వసూలు చేయవద్దు తాత్కాలికంగా December వరకు ఆపండి అని చెప్పాము తరువాత నష్టము ఎంతవరకు వచ్చిందో వాటినిచూచి ఎవరెవరు చెల్లించడానికి అవకాశాలు లేవో వివరంగా చూచుకోవచ్చు అనే దృష్టితో డిసెంబరువరకు ఆపుచేశాం అవసరం అయితే దానిని ఇంకా ఆపడానికి ప్రయత్నంచేస్తాం అదేవిధంగా loans విషయంలో కలెక్టర్ల దగ్గరనుంచి రిపోర్టులు వచ్చాయి ఎంత loan కావలెనన్నా సరే ఇవ్వమన్నాము విత్తనాలు ఉచితంగా సప్లయిచేయడానికి ఒక కృష్ణాజిల్లాలో సుమారు ఒక లక్షరూపాయల పైచిల్లర వెంటనే వారికి ఇచ్చాము అందువల్ల అక్కడనుంచి వస్తున్న రిపోర్టులు ఆధారం చేసుకొని వారు ఎంతకోరితే అంతా కూడా ఇవ్వడానికి ప్రభుత్వం ఒకనిర్ణయం చేసింది అని నేను మీకు మనవిచేస్తున్నాను ఈ వరదలుఅనేవి ఎప్పుడుకూడ బాధాకరంగానే ఉన్నాయి ముఖ్యంగా కృష్ణా గోదావరి జిల్లాలలో ఈ వరదల నివారణకు permanent measures చేయవలసినటువంటి వ్యవహారంఉంది దానినిగురించి ఇందాక గౌరవనీయులైన సభ్యులు చెప్పినట్లు ఇండియా గవర్నమెంటునుంచి అప్పో ఏదో వారు ఇచ్చినవి అన్నీ తీసుకొని కొంతప్రయత్నంచేయడానికి పనులుజరుగుతున్నాయి దానినిగురించి ఇదివరకే ఉపముఖ్యమంత్రిగారుచూచి రావటమేకాకుండా ఒకప్రకటనకూడాచేశారు తర్వాత ఈశాసనసభ అయిపోవటంతోటే వారు ఏదోఒక conference పెట్టి దానినిగురించి అన్నివిధాలకూడా చూస్తాంఅని చెప్పారు అందులో రాజకీయాలుగాని సంకుచితభావాలుగానిఏమిలేవనిమనవిచేస్తున్నాను ఇదిప్రజలకుఇబ్బందికరమైనటువంటివిషయం ప్రజలందరూకూడా బాధపడుతున్నారు ప్రజలయొక్క కళ్యాణంకోసమే చేయబడ్డది రాజకీయపార్టీలతోగాని, వ్యక్తిగత అభిప్రాయాలతోగాని సంబంధించినటువంటి విషయంకాదు అందువల్ల ఈవిషయంలో సభ్యులందరుకూడ ఆసమావేశంలో పాల్గొని తమయొక్క అభిప్రాయాలను గట్టిగాచెప్పడమే కాకుండా వారందరు కూడఇదిఎంతోత్వరగారావటానికిప్రయత్నంచేస్తే దానికిప్రభుత్వంకూడాపూర్తిగా తోడ్పడి త్వరగా దానినిపరిష్కారంచేయడానికి సిద్ధంగావుంది అందులోముఖ్యంగా

కొంతమందిసభ్యులు ఇది ప్రతిసంవత్సరం వస్తూవున్నదని చెప్పారు విషాదకరమైన విషయం దీనిని నివారణచేయడానికి మనమందరంకూడ ప్రయత్నంచేదాము దీనికి ప్రత్యేకంగా వేరే P W D శాఖవారు ఒక Division వేశారు Scheme లు investigation చేయడమే కాకుండా వాటిని అమలుచేయుటానికికూడా పూనుకోవాలని చెప్ప గౌరవనీయులైన సభ్యులు కొన్ని సూచనలు చేశారు వీటిని ఉపముఖ్య మంత్రిగారికి తెలియజేస్తాను వారు ఈ వేళ ఇక్కడికి వచ్చేవారే కాని వారి మామగారు sudden గా చనిపోవడంవల్ల వారు ఇక్కడికి రావడానికి వీలులేక పోయింది అంతేగాని దీంట్లో ఇతరత్రా భేదాభిప్రాయం లేదు గౌరవనీయులైన సభ్యులు చెప్పిన విషయాలలో loans disburse చేయడంలోగాని చౌక డిపోలు పెట్టే విషయంలోగాని భోజనాలు పెట్టె విషయంలోగాని ఎట్టిలోపము చేయలేదు Floods వచ్చినాయి అని అనటంతోటే ఇండియాగవర్నమెంటుకు wireless మీద సమాచారంపంపి ఆర్డర్లు తెప్పించి Hyderbad నుంచి బియ్యంకూడా రవాణా చేయించి ఎక్కడెక్కడ కావాలో అక్కడ ఈ చౌక depot లను liberal గా open చేయవలసిందనికూడా instructions ఇచ్చాము ఈ విషయాలలో ప్రభుత్వం ఇంకా అక్కడ తాత్కాలికంగా సహకరిస్తున్నటువంటి ఉద్యోగస్తులు ఉద్యోగస్తులు కానటువంటి ప్రజాప్రతినిధులందరు కూడా ఎంతచేస్తున్నప్పటికి కొన్ని చేయడానికి అవకాశం లేనటువంటి పరిస్థితులుకూడ వస్తూవున్నాయి అటువంటి వాటినికూడ ఉదారంగా చూచి మళ్ళ ఈ శాసనసభ అయిపోవడింతోటే అందరు కూడా ఆయా constituency లలో ముఖ్యంగా వరద దెబ్బతిన్న ప్రాంతాలకు వెళ్ళి అక్కడఉన్ననష్టాన్ని మనం కొంతవరకు లెక్కవేయటానికిగాని లేక నివారణ మార్గాలు చూడడానికిగాని అవకాశాలు కలుగజేయగలరని ఆశిస్తున్నాను అందువల్ల వారు ఆవిషయంలో ఉత్సాహంగా పూనుకొని పనిచేయవలెనని మనవిచేస్తున్నాను ఇంకొకవిషయం ఉన్నది ఈభూములకు loans ఇచ్చేవిషయంలో joint patta లను గురించి ఇదివరకే వచ్చింది ఈ joint patta లలో ఒక చిక్కు ఉంది నలుగురు రైతులకు కలసి 10 ఎకరాలు joint గ ఉంటుంది పట్టామాత్రం ఒకటే ఒకరికొక ఎకరము ఇంకొకరికి 2 ఎకరాలు 3వ వానికి 3ఎకరాలు ఇట్లా ఉండవచ్చును అది స్పష్టంగా తెలియడంకష్టం కాబట్టి దాంట్లో 2 రకాలుగా ఉంది 4గురు రైతులు ఫలానారైతుకుమీరు అప్పు ఇవ్వవచ్చును ఆయనకువున్నది రెండుఎకరాలుఅనిచేప్పే టట్లయితే రెండు ఎకరాలమీద loan ఇచ్చుటకు ప్రభుత్వానికి ఏమీ అభ్యంతరంలేదు ఇకపోతేవచ్చినచిక్కు ఏమంటే నలుగురురైతులలో ఎవరైనా ఇవ్వరు అనుకోండి Out of spiteఇవ్వనివారుఉన్నారు ద్వేషంమీద విరోధంమీద ఇవ్వనివారు ఉన్నారు నాకుతెలుసు అటువంటి పరిస్థితులలో నేను ఇదివరకు instructions ఇచ్చాను

Sri K Chandramouli ] [ 16th August 1956

మళ్లా ఇప్పుడుకూడా ఇవ్వబోతున్నాను ఈ వేళ సాయంత్రంలోపల ఇస్తారుకూడా అవిఏమంటే షుమారుగ వాండ్లుకట్టేఎన్నునుపట్టి 10 రూపాయలు కట్టితే షుమారు ఒకఎకరం ఉంటుందనేఉద్దేశంతో ఆవిధంగా ఉజ్జాయింపుమీద 4 రూపాయలు తక్కువచేస అయినా వారికికూడ liberal గా loans ఇవ్వవలసిందని instructions పంపుస్తున్నాను ఈ loans ఇచ్చేదాంట్లో కూడ valuation లో ½ వరకుకూడా పోయి loans ఇవ్వవలసిందని ఇదివరకే instructions ఇచ్చాము అందువల్ల నేను మనవిచేసేది revenue శాఖకు సంబంధించినంతవరకు మొన్న ఇరిగేషన్‌కు సంబంధించినంతవరకు ఈ విషయాల్లో అక్కడ యథాతథంగా ఏమడిగినా ఎంత అడిగినా ఏమి చేయవలసినా వారు అడిగినదానికన్న ఇంకా కొంచెం ఎక్కువగా ఇచ్చి కృషిచేయటానికి అక్కడ పనులు జరుగుతున్నాయి అని మేము ఇక్కడ ఊరకనే అంకెలు చదవడంలేదు మీరందరు మళ్లీ వెళ్లి ఈపనులు జరుగుతున్నాయా లేదా చూడండి అక్కడ జరుగకపోతే జరగటానికి తోడ్పడుతాము నేను వచ్చి ఆ ప్రాంతాలను చూస్తానని మనవిచేస్తున్నాను

తర్వాత flood control వ్యవహారంలో Budameru మొదలైనవాటి విషయాలలో తర్జనభర్జనలు జరుగుతున్నాయి ఆ విషయాలు నాకు తెలియకపోలేదు ఏమి ఉన్నప్పటికిని ఇది కేవలం వ్యక్తిగతమైనటువంటి అభిమానంకొరకో ఒక మాట అన్నాం కాబట్టి పెనుగులాడుతాము అనో అటువంటి ఉద్దేశాలు ప్రభుత్వం తరఫున లేవని మనవిచేస్తున్నాను దీనిని గురించి మరొకసారి నేను మనవిచేసేది ఏమంటే ఈసభలో జరిగినటువంటి విషయాలు దాంట్లో ఉన్నముఖ్య విషయాలు అవి అన్నికూడ ఉపముఖ్యమంత్రిగారికి ముఖ్యమంత్రిగారికి చెప్పుతాను వారు కూడ స్వయంగా చూచివచ్చారు చాల తొందరగా సమస్యాపరిష్కారం చేయడానికి అన్నివిధాలా ప్రభుత్వం కృషిచేస్తుందని మనవిచేస్తూ విరమిస్తున్నాను

Mr SPEAKER —The House will now adjourn and meet again tomorrow at 8 30 a m

The House then adjourned

# APPENDIX I

DEPARTMENT OF INDUSTRIES CO OPERATION AND LABOUR

## STATEMENT PLACED ON THE TABLE OF THE HOUSE

[*Vide* answer to clause (b) of Legislative Assembly Question No 240* put by Sri P SATYANARAYANA M L A ]

The following six schemes for the development of handloom industry in this State have been included in the Second Five Year Plan -

| Serial number and name of the Scheme (1) | Cost for entire Plan (2) (RS IN LAKHS) | Budget provision for 1956 57 (3) (RS IN LAKHS) |
|---|---|---|
| (1) Share capital and working capital loans to primary societies | 70 00 | 14-00 |
| (2) Loans to Andhra Handloom Weavers' Co operative Society | 25 00 | 7 00 |
| (3) Expansion of marketing organisation of the Andhra Handloom Weavers Co-operative Society | 53-79 | 9 38 |
| (4) Improvement of techniques and organisational expenses | 67 68 | 13 75 |
| (5) Establishment of dye factories | 2 52 | 1 14 |
| (6) Rebate Scheme | 50-00 | 10-00 |
| Total | 268 99 | 55 27 |

1 *Share Capital and working Capital Loans to Primary Societies* —It is proposed to admit 25 000 weavers into co operative societies at the rate of 5 000 every year Loans will be advanced to weavers to enable them to pay share capital to weavers co operative societies and to become members Loans towards working capital of societies at the rate of Rs 200 per loom are also proposed to be given to the new looms admitted The total loan expenditure under this scheme for the plan period is Rs 70 00 lakhs

2 *Loans to Andhra Handloom Weavers' Co-operative Society* — It is proposed to provide during the plan period a sum of Rs 25 lakhs from the Cess Fund towards the working capital of the Andhra Handloom Weavers' Co-operative Society to facilitate its trade to buy the cloth produced by the members of primary weavers' co-operatives and to market it through its central depots sales depots, city emporia and

* Vide page 129 supra.

inter state depots Purchase of 570 lakhs of yards of cloth and sale of 506 lakhs of yards are programmed for the plan period

3 *Expansion of marketing organisation of the Andhra Handloom Weavers Co operative Society*—The programme of the Andhra State Handloom Weavers Co operative Society for the plan period is to open 60 additional sales depots and 5 city emporia within the State to organise 6 central depots (godowns) for pooling and stocking of cloth and to provide 5 more mobile vans (in addition to the existing 6 vans) for the promotion of sales in the country side The existing staff of marketing officers will be further strengthened by the addition of two more officers

The estimatted cost of the scheme for tho plan period is Rs 53 79 lakhs

4 *Improvement of Techiques in Handloom Industry*—It is proposed to supply to weavers' co-operatives during the plan period, 9,900 standard reeds 1,980 devices to regulate picks 660 warping machine, 990 pedal looms 1650 frame looms with accessories, 3 300 Coimbatore type looms and 6 600 dobbies It is also proposed to appoint 13 additional technical assistants 8 peripatetic demonstrators and 66 maistries to train weavers in the art of weaving southern varieties of cloth and to demonstrate to them the working of improved appliances Three additional patternmaking factories for the manufacture of up to date varieties of shirting furnishing fabrics, etc, are proposed to be set up during the year The cost of the scheme is Rs 67 68 lakhs for the plan period

*Establishment of dye factories*—It is proposed to instal two dye units one at Chittoor and the other at Visakhapatnam during the Second Plan Period About 25,200 bales of yarn are proposed to be dyed during the plan period The cost of the scheme is Rs 2 52 lakhs during the plan period

*Rebate on sale of Handloom Cloth*—The scheme of grant of rebate on the sale handloom cloth made in the depots of the Andhra Handloom Weavers Co operative Society and other agencies dealing exclusively in handloom cloth is proposed to be continued in the Second Plan Period, the entire expenditure being met from the handloom cess fund During the Plan Period a sum of Rs 50 lakhs is proposed to be disbursed as rebate

16th August 1956]

# APPENDIX II

## EDUCATION AND ENDOWMENTS DEPARTMENT

## PAPERS TO BE PLACED ON THE TABLE OF THE HOUSE

[*Vide* answer to Question No 462* (Starred) BY SRI P VENKATA SUBBAIAH, M L A ]

Q *462

(a) The procedure adopted to bring in any charitable endowments under the purview of the Charitable Endowments Act

A 462

If on consideration of the reports of their subordinate officers the Government have reason to believe that a particular charitable endowment is being mismanaged they publish in the *Andhra Gazette* notice of their intention to extend the provisions of the Madras Hindu Religious and Charitable Endowments Act 1951 and of the rules made thereunder specifying the reasons therefor and to show cause against the acction proposed before a specified time which shall not be less than two months from the date of the publication of the said notice in the *Andhra Gazette* In addition to publication in the *Andhra Gazette* the notice is also published in the language of the locality concerned in a daily newspaper having circulation in the said locality and is also sent by registered post acknowledment due to the trustee or trustees of the charitable endowment Copies of the notice are also published by affixture on the notice board of the institution and if there is no notice board on the front door or any other conspicuous place in the institu tion Objections or suggestions if any received from the interested persons or the trustees in pursuance of the said notice are carefully examined and if the Government are satisfied that the charitable endow ment is being mismanaged and that in the interest of the administration of the charitable endowment it is necessary to extend the provisions of the Act and of the rules made thereunder to the charitable endowment, a notification extending the said provisions to the charitable endowment will be published in the *Andhra Gazette* Thereupon the provisions of the Act will apply to the endowment as if it were a specific endowment

* Vide page 130 supra

[16th August 1956

# APPENDIX III

## PAPER PLACED ON THE TABLE OF THE HOUSE

[*Vide* L A Q No 371* (STARRED) BY SRI P VENKATASUBBAIAH]

Note on the Industrial units for the manufacture of soap with non edible oils

It is understood from a representative of the All India Khadi and Village Industries Board that the Board has allotted to Andhra 30 units for the manfacture of soap from non-edible oils as shown below —

| | |
|---|---|
| A Class Units | 4 |
| B Class Units | 10 |
| C Class Units | 16 |

The classification is according to the capacity of the unit

| *Class* | *Capacity* |
|---|---|
| A Class | 50 tons of soap per year |
| B Class | 30 ,, |
| C Class | 20 ,, |

2 The agency for starting the units and working them must be registered co operative societies only Either existing credit societies may be converted into Industrial Co operative Societies or multi Industrial Cousumers Societies or multi purpose societies or new societies may be started for this purpose

The All India Khadi and village Industries Board will provide assistance to the societies in the form of grants and loans as indicated below —

(A Class Unit) Rs 18 000 as grant for non recurring expendifure Rs 18 500 as interest free loan repayable in 5 years plus another Rs 18 000 as working capital with 3 per cent interest repayable in 5 years In addition, they also meet the cost of a chemist for a period of one year on Rs 150/- per mensum

(B Class Unit) Rs 10,250/ as a grant for non recurring expenditnre Rs 10 250 as interest free loan repayable in 5 years puls another loan of Rs 10,000/- as working capital with 3 per cent interest repayable in 5 years In addition, they also meet the cost of a chemist for a period of one year on Rs 100/- per mensum

* Vide page 130 supra

(C Class Unit) Rs 5,750/ as grant for non recurring expenditure, Rs 5,750 as interest free loan repayable in 5 years puls another sum of Rs 5,000/- as working capital with 3 percent interest repayable in 5 years In addition, they also meet the cost of a chemist for a period of one year on Rs 75 per mensum

All the 30 units are proposed to be located in National Extension Service and Community Development areas

4 *Mode of Disbursement*

As the State Khadi and Village Industries Board is not a statutory body, the All India Board is not prepared to disburse moneys through the State Board The moneys will be disbursed direct to the Societies on a proper certificate being furnished by an authorised office of the Government, probably, in this case, the Director of Industries and Commerce On the Society being registered an application for grant and loan being recommended by the Director of Industries and Commerce, the Board will place the amounts specified above at the disposal of the registered society

5 *Specifications of the units*

In each unit there will be 2 sections (a) a oil pressing section and (b) a soap manufacturing section

The oil is to be pressed from out of Vippa, Neem, Kanuga or castor seeds

Thére will be provision for 8 ghanies for pressing oil in an 'A class unit, 4 in a B class unit 2 in a C class unit

It is stated that a unit can be brought to operation stage within about 2 to 3 months after starting the Society

6 *Subsidy*

A subsidy of one anna per every seer (2 lbs) of oil pressed is provided for

The All India Khadi and Village Industries Board is giving this aid with a view to bringing down the price of soap and making it competetive This soap is usable for washing and bathing as well If properly manufactured, there should be no difficulty to find a market for it

7 *Technical Staff*

The Board is training graduates (Chemistry) for a period of 3 months in soap manufacture and it is in a position to supply adequate number of trained chemists for the units

8 All the above details are subject to confirmation by the All India Khadi and Village Industries Board